# ఆంధ్రప్రదేశ్

సంపుటి 8 మార్గశిరం పుష్యం
సంచిక 2 1885 శకం
డిశంబరు 1963

## విషయసూచిక





" సందర్శన "
ఇస్తాంబుల్ (6వ శతాబ్దం) పరెంజో చర్చిలో కుడ్యచిత్రం. [చూ. వ్యాసం-14 పేజీ]



ముఖచిత్రం : కాకతీయుల శిల్పకళా వైభవాన్ని చాటిచెప్పే వరంగల్లులోని ఒక విగ్రహం.

రెండవ అట్ట : అధికోత్పత్తి దీక్ష : పొలంపనిలో నిమగ్నుడైవున్న కృష్ణాజిల్లా రైతు.

సంవత్సరం చందా — రు. 3—00.
విడి ప్రతి రు 0—25 నయాపైసలు.






ఆర్యా!

తరచుగా ఆంధ్రప్రదేశ్ చూస్తూ ఎవ్వరో సమర్థులే ఎడిట్ చేస్తున్నా రనుకుంటూ వుండేవాణ్ణి. మొన్నటి సంచికలో మీ అడ్రసు చదివి ఎడిటర్ మీరని తెలిసిన తర్వాత నా ఊహ నిజమనుకున్నాను. ఆంధ్రప్రదేశ్‌లో బాలానందం శీర్షిక కడు సమర్థతతో నిర్వహించుచున్నందుకు నా అభివందనలు తెలియజేస్తున్నాను - సెలవు.

భవదీయుడు,
కవిరావు
వైస్-ప్రెసిడెంట్
అఖిలభారత బాలల సాహిత్య
మహాసభ: (కలకత్తా)
రేపల్లె.

ఆంధ్ర ప్రదేశ్‌ను అప్పు డప్పుడు చూచు అవకాశము కలుగుతున్నది. పత్రిక కొత్త శీర్షికలతో చదువరుల కాకర్షణీయముగ వున్నది. పత్రికా సంపాదకత్వమున మీ కృషి, పరిశ్రమ ప్రశంసనీయాలు.

ఇట్లు
బులుసు వెంకట రమణయ్య
క్రోం పేట, మద్రాసు.

పత్రికను చాలా ఉత్తమస్థాయిలో నడుపుతున్నారు. నిజమైన ప్రజా సాహిత్యాన్ని అందజేస్తున్న మిమ్మల్ని ప్రత్యేకించి అభినందిస్తున్నాను.

భవదీయుడు,
కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు
లింగసముద్రము,
నెల్లూరు జిల్లా.

"ఆంధ్రప్రదేశ్" ప్రచురణలో ఈ మధ్య మీరు అనుసరించే విధానం చాలా ప్రశంసనీయమైనది. ప్రజలలో ప్రగతిశీల దృక్పథాన్ని కలిగించుటలోను, జాతీయ ప్రబోధపు సాహిత్యాన్ని అందించుటలోను, మీ ప్రచురణలు చాలావరకు సహాయపడుచున్నవి. ముఖ్యముగా దేశరక్షణ కృషిలో "ఆంధ్రప్రదేశ్" చూపించే గురుతర బాధ్యత కొనియాడ దగినది.

అక్టోబరు సంచికలో ప్రచురించిన సున్నం వారి "దురాక్రమణ," తాళ్ళూరు వారి "గెలుపు మనదే" కరుణశ్రీవారి "విజయభేరి" నన్ను ఆకర్షించాయి. ప్రస్తుత ఆత్యయిక పరిస్థితిలో నవభారత రక్షణ కోసం ప్రజలలో నవచైతన్యాన్ని, నైతిక శక్తిని పెంపొందించే యిట్టి రచనలు ఎంతైనా అవసరం. రచయితలందరికి నా ధన్యవాదములు.

ఇట్లు
ఎ. వి. నరసింహం
ఆమదాలవలస
శ్రీకాకుళం జిల్లా.

మీ పర్యవేక్షణలోనున్న "ఆంధ్రప్రదేశ్" (తెలుగు) మాసపత్రిక మా పాఠశాలకు సుమారు నాలుగు సంవత్సరములనుండి ప్రతి మాసము సకాలములో మీ కార్యాలయము నుండి అందుచున్నది. నేటి పరిస్థితులలో ఆంధ్ర ప్రదేశ్ ఏ విధముగా అభివృద్ధి చెందుచున్నదో ఎప్పటి కప్పుడు సవిస్తరముగా ఆబాల గోపాలమునకు అర్థమగునట్లు సులభ శైలిలో ప్రచురించి ప్రజానీకమునకు వెలుగు నీడగా అందించుచున్నందులకు మీకు కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను. మరో విశేషమేమనగా చిన్న చిన్న నాటికలు మరియు గేయములు, కథలు, ప్రశ్నోత్తరములు, ముఖ్యమంత్రిగారి లేఖ ద్వారా ప్రజలు ఎన్నో క్రొత్త విషయములను తెలుసుకొనుచున్నందుకు చాలా సంతోషము కల్గుచున్నది.

మా పాఠశాల బాలబాలికలు, ఉపాధ్యాయ వర్గము ఈ మాసపత్రికను చదివి ఎన్నో విషయములు తెలుసుకొనుటయేగాక, విజ్ఞానమును అభివృద్ధి పరచుకొనుటలో ఎంతో తోడ్పడుచున్నదని చెప్పుటలో ఏలాంటి సందేహము లేదు.

వెల మిక్కిలి స్వల్పము అయినను కాగితము మిక్కిలి వెలగలది ఉపయోగించుచు, అందమైన అచ్చులు వాడుచు ప్రజానీకమునకు సహాయము చేయుచున్నందులకు ప్రశంసనీయము.

''ఆంధ్రప్రదేశ్'' (తెలుగు) మాసపత్రిక దినదినాభివృద్ధి చెందవలయు నని ఆశించుచు "దీపావళి శుభాకాంక్షలు" తెలియజేయుచున్నాను.

ఇట్లు
జి. వి. సత్యనారాయణ,
హెడ్‌మాస్టర్,
ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల
నైమనగర్, హనుమకొండ

## "ఆంధ్రప్రదేశ్"

### ప్రత్యేక సంచిక

తెలుగు "ఆంధ్ర ప్రదేశ్" 1964 జనవరి సంచిక ధాన్య - రాశులతో కళ కళలాడే సంక్రాంతి పర్వదినాలను - నూత్న వత్సరాదిని పురస్కరించుకొని "ఆంధ్ర ప్రదేశ్"లో వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన వివిధ వ్యాసరాజాలతో, చిత్రాలతో, ప్రత్యేకసంచికగా వెలువడుతుంది. ఎక్కువ కాపీలు కావలసిన ఏజంట్లు వెంటనే తెలియజెయ్యాలి. వెల మామూలే. — *ఎడిటర్. (తెలుగు).*

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

మనం అధికార వికేంద్రీకరణ సిద్ధాంతాన్ని ఆమోదించి దానికి కట్టుబడి వున్నాం. ఈ లక్ష్యాన్ని పురస్కరించుకొని పంచాయతీలకు, జిల్లా పరిషత్తులకు క్రమక్రమంగా ఇతోధికాధికారాలను సంక్రమింప జేయడం జరుగుతున్నది. అయితే ఇటీవల, పల్లె ప్రాంతాలకు క్రమేపీ ప్రజాస్వామిక విధానం విస్తరించబడడంతో మంచితో పాటుగా దీని దుష్ఫలితాలుకూడా గ్రామీణప్రాంతాలకు ఒక్కొక్కసారి తీవ్రంగాకూడా వ్యాపిస్తున్నాయని కొందరు అంటున్నారు. ఇలా అనడం ప్రజాస్వామిక విస్తరణ సూత్రాన్ని విమర్శించే ఉద్దేశంతోనే కాదు. ఇదే అత్యుత్తమమైన విధానం కాకపోవచ్చు. కాని ఈ విధానం జీవిత సత్యాలను వున్నవి వున్నట్లుగా అంగీకరిస్తుంది. అంతేగాని వాటికి లేనిపోని పై మెరుగులు పెట్టడానికి ప్రయత్నించదు. ప్రజలలో భేదాభిప్రాయాలు వుండటం సహజమే. ఈ విభేదాలను అణచివేయడంకంటే వాటిని చర్చించడం శ్రేయస్కరమని ప్రజాస్వామ్యం విశ్వసిస్తుంది. చర్చలు, వివాదాలవల్ల విస్పష్టమైన నిర్ణయాలు జరగగలుగుతాయి. కాగా ఈ నిర్ణయాలు సమిష్టిగా సమాజం యొక్క విజ్ఞతను ప్రతిబింబిస్తాయి.

స్థానిక సంస్థలకు అధికారాలను, హక్కులను ఇతోధికంగా ఇవ్వడంవల్ల సహజంగానే అధికారం అత్యాసకు దారితీస్తుంది. దీనివల్ల అవాంఛనీయమైన 'రాజకీయాలు' పెరిగిపోయి ఒక్కొక్కసారి శుష్కమైన తగాయిదాలు ఉత్పన్నమవుతాయి. 'రాజకీయాలు' అనేది చాలా మృదువైన మాట. దాదాపు మంచిపనులన్నింటికీ ఇది వర్తించవచ్చు. కాని రాజకీయ వ్యవహారాలు సంస్థయొక్క విధులకూ, బాధ్యతలకూ దూరమైపోయి వ్యక్తితత్వ, వర్గతత్వ స్థాయికి దిగజారినప్పుడు నివారణోపాయాలను గూర్చి ఆలోచించవలసి వుంటుంది.

ఏకగ్రీవంగా ఎన్నికలు జరిగిన పంచాయతీలకు రొక్కపుగ్రాంట్లు బహూకరించడం ఇటువంటి నివారణోపాయాలలో ఒకటి. ఈ ప్రతిపాదనపై ప్రజాభిప్రాయం తెలుసుకోవడం జరుగుతున్నది.

నేను లోగడ చెప్పినట్లు చిన్నతరహా నీటిపారుదల, వ్యవసాయంలో అంతకంతకు ఎక్కువ ప్రాముఖ్యత పొందుతున్నది. ఇది తప్పనిసరిగా చిన్నతరహా భూకామందులచొరవపైననే ఆధారపడివుంటుంది. మూడవ ప్రణాళికలో ఈ కార్యక్రమానికికూడా అత్యధిక మొత్తాలను కేటాయించడం జరిగింది. తొలుత చేసిన రూ. 18.26 కోట్ల కేటాయింపు దరిమిలా రూ. 28.26 కోట్లకు హెచ్చించబడింది. ప్రాంతం వారీగా, సర్కిలు వారీగా రాష్ట్రంలో అన్ని జిల్లాలకూ ప్రయోజనాలు చేకూరేట్లుగా ఈ కార్యక్రమం రూపొందించబడింది. ఈ పథకాలలో ప్రజలు పాల్గొనడాన్ని ప్రోత్సహించడం ఈ కార్యక్రమం ముఖ్యాంశం. తమ ప్రాంతాలలో అమలు జరిగే పనులలో పాల్గొనడంలో పంచాయతీసమితులు, గ్రామపంచాయతీలు, ఆయకట్టుదార్లు ప్రత్యేకసౌకర్యాలుపొందుతారు. ఈ ప్రణాళిక ప్రస్తుత సంవత్సరం నుంచి ఈ పనిని వేగవంతం చేయడం జరుగుతున్నది. ఈ కాలంలో రూ. 4.15 కోట్లు ఖర్చుచేయబడతాయి. సాంకేతికంగానూ, పరిపాలనా విషయంగానూ మంజూరీ ఇచ్చేందుకు వివిధ స్థాయిలలో అధికార్లకు అవసరమైన అధికారాలను సంక్రమింపజేయడంద్వారా ఆలస్యాలను నివారించడానికి చర్యలు తీసుకోవడం జరిగింది. ఒక వంక నీటిపారుదల సౌకర్యాలను విస్తృతీకరించవలసిన ఆవశ్యకతను గమనిస్తూనే భూసారాన్ని పెంపొందించడానికి నూతన పద్ధతులను అన్వేషించే విషయంలోకూడా మనం ఆసక్తి చూపుతున్నాం. ఇది పరిశోధనయొక్క ప్రాముఖ్యతను ఉగ్గడిస్తుంది. తుంగభద్ర ప్రాజెక్టుక్రింద ఎమ్మిగనూరులో నీటిపారుదల పరిశోధనా కేంద్రం స్థాపనకు సంబంధించిన పథకానికి మంజూరీ లభించిందని ఈ సందర్భంలో తెలియజేయడానికి నేను సంతోషిస్తున్నాను. ఈ పథకాన్ని కేంద్రం తలపెట్టింది. దీనికి మొత్తం సుమారు 6½ లక్షలు ఖర్చవుతుంది. దీనిలో భూమి వ్యయాన్ని, కొంతమంది సాంకేతికోద్యోగుల జీతభత్యాలనూ రాష్ట్రం భరిస్తుంది. ఇవన్నీకలిసి ఖర్చు ఒక లక్షరూపాయలు దాటుతుంది. ఇటీవల జరిగిన జాతీయాభివృద్ధిమండలి సమావేశంలో, నాగార్జునసాగర్‌ను జాతీయ ప్రాజెక్టుగా కేంద్రం చేపట్టాలని నేను మళ్ళీ ఒక పర్యాయం సూచించాను. నీటివసరుల విషయమై ప్రస్తావిస్తున్నాను కాబట్టి ఈసంగతి వెల్లడిస్తున్నాను. మన సాధనసంపత్తులలో చాలా ఎక్కువభాగం నాగార్జునసాగర్‌కు వినియోగించవలసి వుంటున్నది. బృహత్తరమైన ఈ పథకానికి ఎక్కువ ఖర్చుచేయవలసివస్తున్నందువల్ల మన ఇతర ప్రాజెక్టులకు కొన్నింటికి దెబ్బతగులుతున్నది. దీనినిమనం అమలుపరచాలంటే కాలహరణం జరగడం తప్పనిసరి. పోతే వ్యయంలోకూడా కొంత తగ్గింపు జరుగవచ్చు. ఒక వేళ

దీనిని కేంద్రం తీసుకున్నట్లయితే వచ్చే 3–4 సంవత్సరాలలో మొదటిదశ పూర్తి కాగలుగుతుందని మనం ఆశించవచ్చు.

నా దృష్టిలో యీ రకపు ప్రాజెక్టులను జాతీయ ప్రాజెక్టులుగా పరిగణించాలి. అంతేగాని ఏ రాష్ట్రానికో ప్రత్యేకంగా సంబంధించి వుండేటట్టుగా వుండకూడదని నా అభిప్రాయం. ఇతరరాష్ట్రాల ముఖ్య మంత్రులుకూడా యిదే అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. ఈ సిద్ధాంతంవెనుకవున్న అసలుభావాన్ని కేంద్రప్రభుత్వంగుర్తించి హర్షిస్తుందనే నేను భావిస్తున్నాను.

మన అధికాహారోత్పత్తికి ఒక విధమైన ప్రేరణగా చిన్నరకపు ట్రాక్టర్లను బాగా వాడుకలోకి తీసుకురావడానికి మేము ఉద్దేశించాం. ఈ ట్రాక్టర్లు భూమిని లోతుగా దున్నడానికి ఉపయోగపడడమే కాకుండా వాటి అవసరం చాలా వున్నది. బీదరైతులు ప్రభుత్వం వద్దనుంచీ యీ ట్రాక్టర్లను అద్దెకు తీసుకుని దున్నుకోవచ్చు. వీటిని కొనదలచుకున్నవారికి ప్రభుత్వం రూ. 10,000 నుండి రు.16,000 లను ఋణంగా యిస్తుంది. వచ్చే యేడాది యీ మొత్తాన్ని అధికం చేసే ఉద్దేశ్యంకూడా వుంది. ఇక్కడే చిన్నరకపు ట్రాక్టర్ల తయారీకి అప్పుడే లైసెన్సులు యివ్వడం జరిగింది. హైదరాబాదులో ఒక సంస్థ 4 హార్స్ పవర్స్‌గల ట్రాక్టర్లను తయారు చేయడానికి ప్రయత్నాలు చేస్తున్నది.

ఇటీవల జరిగిన కలెక్టర్ల వార్షిక సమావేశంలో నేను, పౌర సర్వీసులల్లో జరుగుతున్న అవినీతిని పూర్తిగా తుడిచిపెట్టి వేయవలసిన అవసరాన్ని గూర్చి నొక్కి వక్కాణించాను. మన పౌర సర్వీసుల్లో వున్న అవినీతి, మొత్తంగా మన అందరి గుణగణాలను ప్రతిఫలింపజేస్తుంది. మనమంతా – అధికారులు, అనధికారులు – యీ అవినీతిని రూపుమాపడానికి గట్టిగా నిశ్చయించుకొంటేనేతప్ప మన మేమీ సాధించలేం. ఈనాడు ఈ దుష్టశక్తిని మన మందరం ఎదుర్కొంటున్నాం. ఈ అవినీతిని తొలగించడానికి అధికారులంతా కంకణం కట్టుకోవాలని అధికారులనూ, అధికారులలో అవినీతిని గుర్తించడంలో ప్రజలు ప్రభుత్వానికి సహాయపడవలసిందిగా ప్రజలనూ హృదయపూర్వకంగా కోరుతున్నాను. నేరుగా తమ అధీనంక్రిందకురాని అధికారుల అవినీతికి సంబంధించిన ఏ విధమైన సంఘటనలైనా వివరంగా తమకు తెలిస్తే అట్టివాటిని వెంటనే తిన్నగా ప్రభుత్వానికి తెలియచేయమనికూడా నేను కలెక్టర్లను అడిగాను. కలెక్టర్లు జిల్లాకు అధికారులు గనుక ఆయా జిల్లాలలో పనిచేసేఉద్యోగులందరి పైనా ఒక కన్ను వేసివుండవలసి వుంటుంది.

ఈ నాడు వివిధస్థాయిలకు సంబంధించిన అనేక రకాల ఉద్యోగాలు ఖాళీగాపడి వుంటుంటే, ఉద్యోగావకాశాలు ఏ మాత్రం లేవనే అభిప్రాయం ప్రజలలో నాటుకుపోవడంచూస్తే ఎవరికైనా విచిత్రం అనిపించక మానదు. మన సైనికబలాల్ని, కొన్ని కొన్ని పరిశ్రమలను విస్తృతీకరించడం వల్ల రకరకాలయిన ఉద్యోగాలకు అవకాశం కల్గింది. ఈ ఉద్యోగాలలో చేరవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తులు చేయబడ్డాయి. భారత సైన్యంలోను, దానిసహాయకసంస్థలలోను మన రాష్ట్రంనుండి అధికమొత్తంలో డాక్టర్లు చేరారనిచెప్పడానికి నేనెంతో గర్విస్తున్నాను. అయినప్పటికీ యింకా ఎన్నో నిపుణతకు సంబంధించినవి, సంబంధించనివి అనేకఉద్యోగాలకు ఆంధ్ర ప్రదేశ్‌నుండి వస్తున్న ప్రోత్సాహం ఏమంత ఉత్సాహకరంగాలేదు. హైదరాబాదులోని ఆర్మీ రిక్రూటింగ్ కేంద్రంలో నిపుణతకు సంబంధించినవి, సంబంధించనివి మొత్తం 800 ఉద్యోగాలను భర్తీచేయడం వారికి సాధ్యం కావడంలేదని రిక్రూటింగ్ అధికారులు తెలియజేస్తున్నారు. అధికసంఖ్యలో వున్న యీ ఉద్యోగాలకొరకు వీటిలో సమోదయి యీఅవకాశాలను వినియోగించుకోవలసినదిగా రాష్ట్రంలోని ప్రజలకు విజ్ఞప్తిచేస్తున్నాను.

జై హింద్!

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి.

# పౌరుషజ్వాల

★ శ్రీరంగపురం కేశవాచార్యులు

తడిసెరా ! మననేల త్యాగరక్తంబున
స్వాతంత్ర్యవీరుల సమరమందు
గర్జించెరా.! సేన గంభీరసింగముల్
గోముఖవ్యాఘ్రాల గుండె లదర
మ్రోగెరా ! రణభేరి ముష్కరతస్కర
యుద్ధభూతంబులు దద్దరిల్ల
సింహరోషజ్వాల ఝృంభించెరా.! శత్రు
శలభమ్ము లెల్ల భస్మమ్ముగాగ
సమరవీరమహోగ్రప్రచండతేజ
భాను డుదయించె చీకట్లు బ్రద్దలయ్యె !
తమ్ముడా ! లెమ్ము దేశఋణమ్ము దీర్చ
అనుగుణసుకమ్ము స్వాతంత్ర్యసమరమందు॥

కరకర యెమ్ములన్ గొరకు కర్కశమౌ హిమవంతమందు సం
గరము, విరోధియున్ బరమకంటకుడైన చలించకుండ ముం
దరుగుము నీ మహోగ్రతప్రతాపదవాగ్ని
దహించివేయు ము
ష్కరులను వీరభారతప్రచండప్రతాప అఖండ యోధుడా !॥

వంచకబుద్ధితో మనల భాయి యటంచును భ్రాంతి గొల్పి న
మ్మించి కునీతితో మనల మ్రింగగజూచిరి, సాగకున్న చా
టించిరి "సీజుఫై" రని నటించుచు నిన్ను మరొక్కమారు వం
చించగ, మేలుకొమ్మిక ! కుచేష్టలు మానరుగాదె
కుత్సితుల్॥

అచ్చపు వెన్నముద్ద అమృతాంశుని మ్రింగు ననేకమార్లు కా
ర్చిచ్చుకణాల భాస్కరుని మ్రింగు నొకొక్కకమారె
రాహు, వీ
మ్లేచ్ఛులవైఖ రింతెగద ! మెత్తగ నుండెడివాని మీదికే
కచ్చెకు కాలు దువ్వుదురు, కాని కఠోరునిమీద చెల్లునే ?॥

ధూళి యచేతనంబయినఁ దొక్కినవాని శిరంబుమీదికిన్
వాలగ జిమ్ము, చేతనునిమాట వచింపగ నేల ? మాతృదే
శాలయమందు దుష్కరదురాక్రమణంబు ఘటిల్ల పౌరుష
జ్వాలల శాత్రవాధముల భస్మ మొనర్పక నూరకుందువే ?॥

సంగరమందు నిన్ గెలువజాల మటంచును నీతిలేని పె
క్కింగుకిరాతకీచకులు గెల్వగనెంచిరి మోసగించి, ఒ
క్కంగుళమేని భూమిని దురాక్రమణం బొనరింప మానమున్
భంగమొనర్చినట్లగు సుమా ! అవమానము సైప శక్యమే ?॥

అవమానింపంబడియును
లవమైన చలించనట్టి లజ్జాహీనుం
డవని జనించనియెడల ప్ర
సవవేదన లేకపోవు జననికి భువిలోన్॥

తీయగ "హిందీ చైనీ
భాయీ భాయీ" యటంచు పలికించిన చై
నీయుడు వెన్నున బొడిచిన
[illegible]
"ఛీ" యనె జగ మెల్లను "ద్రో
హీ" యనె చారిత్ర నీతిహీనుడ ! ఓ చై
నీయుడ ! యేమి లభించెర !
భాయీ యనువానిమీద బాకును విసరన్॥

భరత వీరపరాక్రమపర్వతముల
తాకి దుర్మదతగరులు తలలు పగిలి
పారిపోయెను పొగ రెల్ల భంగపడగ
మరల ఢీకొనవచ్చిన మరణ మొదవు॥

పంచశీలను నేడదే భంగపరచి
శునకములవోలె మన కొండకనుమ దాటి
వంచకులు వచ్చుచున్నారు పొంచి పొంచి
కంటిరెప్పగ దేశమున్ కాచుకొమ్ము॥

భాయి భాయీ యటంచును భ్రాంతి గొల్పి
ఔర ! వీపున బొడిచిరి అదను జూచి,
సీజుఫైరు తమంత తా చేసినారు
గోముఖవ్యాఘ్రముల నమ్మ లేము సుండి॥

మంచితనము చూపి పంచశీలపైన
వ్రాలు చేసి మైత్రి చాల చేసి
కుటిల క్రూర చీనిగోముఖవ్యాఘ్రంబు
పొంచి మీదబడెర మోసపుచ్చి॥

# విషాద సంఘటనలు



శ్రీ కెనెడీ




నవంబరు చివరివారంలో మృత్యుదేవత వికటాట్టహాసం చేసింది. ముఖ్యులైన పలువురు ఈ వారంలో మృత్యువు వాతబడటం సంభవించింది. వీరి మరణంవల్ల మొత్తం మీద ప్రపంచానికే పెద్దలోటు ఏర్పడింది. మానవాళి ఈ అఘాతం నుంచి తేరుకోవడానికీ, ఈ దుస్సంఘటనల వల్ల కలిగే సాధక బాధకాలను తెలుసుకొని ఎదుర్కోగలగడానికి అవశ్యం కొంతకాలం పడుతుంది.

ప్రెసిడెంట్ కెనెడీ అన్ని విధాలా అద్వితీయమైన వ్యక్తి. ప్రతిఘటనలేని సునాయాసమైన మార్గాన్ననుసరించే అధ్యక్షుల కోవకు చెందడు ఆయన. ప్రపంచం క్లిష్ట ఘట్టంలో వున్న తరుణంలో శ్రీ కెనెడీ అమెరికా అధ్యక్ష పీఠాన్నలంకరించడం జరిగింది. అప్పుడు ప్రపంచ వ్యవహారాలలో అమెరికాకు గౌరవ ప్రతిష్ఠలు చెప్పుకోదగినంతగా లేవు. శత్రు వైఖరులవల్ల దుష్ఫలితాలు కలుగుతున్నాయి. ప్రపంచ శాంతికి సంబంధించిన సమస్యల విషయంలో సాహసోపేతమైన, ఊహాజనితమైన దృక్పథాన్ని అవలంబించడం అవసరమైంది. కాగా ఈ పరిస్థితి కొంతవరకు చిక్కైనది కూడా. ఎందుచేతనంటే ఒక పక్క శాంతిసాధనకై నిశ్చితమైన చర్యలు తీసుకుంటూనే అదే సమయంలో బలహీనత లేదా అణుశక్తి రంగంలో వెనుకబడడమే ఈ వైఖరికి కారణమనే అభిప్రాయం కలుగకుండా చేయాల్సి వచ్చింది. బెదిరింపును బెదిరింపుతో, దృఢవైఖరిని దృఢవైఖరితో ఎదుర్కోవలసి వచ్చింది. అలాగే చిత్తశుద్ధి విషయంలో కూడా. వీటన్నింటినీ మించి అధోగతి చెందుతున్న పరిస్థితిలో పెద్ద మార్పు తీసుకొని రావడానికి కొన్ని అవరోధాలను కూడా ఎదుర్కోవలసి వచ్చింది.

వీటన్నింటికీ దీటు వచ్చే వ్యక్తిగా శ్రీ కెనెడీ రూపొందడం ప్రపంచం అదృష్టం. స్పష్టంగా చెప్పాలంటే సాహసం, సరైన ఆలోచనా శక్తి — ఈ రెండు సుగుణాలు మూర్తీభవించిన వ్యక్తి ఆయన. రూజ్వెల్ట్ అనంతరం, తిరిగి తన సిద్ధాంతాలను, అమెరికా తక్షణ స్వప్రయోజనాలనే సంకుచితమైన హద్దులను అధిగమించ చేసినవారు బహుశా శ్రీ కెనెడీయే. ఆయన ప్రపంచ సమస్యలపట్ల నిజమైన ఆలోచన కనబరిచారు. ప్రపంచ శాంతి, సౌభాగ్యం అవిభాజ్యమైనవనే మూల సిద్ధాంతాన్ని విశ్వసించారు.

క్యూబాలో రష్యా అణుస్థావరాల స్థాపన సమస్యపై పూర్తి ప్రపంచాన్ని అణుయుద్ధ జ్వాలలకు లోనుచేయగల వ్యక్తిగా శ్రీ కెనెడీ మొదటిసారిగా ప్రపంచ దృష్టి నాకర్షించారు. శాంతి కాముకుడైన ఆయన ఈ విధంగా ప్రథమ పర్యాయం ప్రపంచ దృష్టి నాకర్షించడం విచిత్రమైన సంగతే. కార్య సాధనే తనకు ముఖ్యమనే విషయాన్ని ఆయన దీనిద్వారా తొలి తొలుతగా నిరూపించుకున్నారు. క్యూబా ఉదంతం పిమ్మట అమెరికా అధ్యక్షుడుగా వుండడం నిజంగా ప్రమాదకరమనే విషయాన్ని శ్రీ కెనెడీ నిరూపించారని ఒకరు వ్యాఖ్యానించడం జరిగింది. ఈ వ్యాఖ్య సబబైనది. ఈ కార్యంలో విజయం పొందిన పిమ్మట ఆయన దృఢమైన పునాదులపై ప్రపంచ శాంతిని సంస్థాపించే కృషిలో నిమగ్నమయ్యారు. అణ్వస్త్ర పరీక్షల పాక్షిక నిషేధంపై జరిగిన ఒప్పందం శ్రీ కెనెడీ సాహసానికీ, చిత్తశుద్ధికీ చిహ్నం. చైనావారివలె యుద్ధం వాంఛనీయమైనదని విశ్వసించేటటువంటి వారికి అమెరికాలో కొరత లేదనే విషయాన్ని తెలుసుకున్నప్పుడు ఈ ఒడంబడికకు సంబంధించిన సాధక బాధకాలు సుస్పష్టమవుతాయి. ఒక విధంగా శ్రీ కృశ్చేవ్ కంటే శ్రీ కెనెడీ కార్యభారం దుర్లభమైనది. ఎందుచేతనంటే శ్రీ కృశ్చేవ్ తమ దేశంలో సర్వాధికారి కాగా శ్రీ కెనెడీ సున్నితమైన ప్రజాస్వామిక వ్యవస్థలోని వైవిధ్యాల మధ్య నిర్ణయాలు తీసుకోవలసి వచ్చేది.

పోతే స్వదేశ వ్యవహారాలలో శ్రీ కెనెడీ ప్రదర్శించిన వైఖరికూడా ఇదే విధంగా పేర్కొనదగింది. అలబామా వ్యవహారం క్లిష్టమైన వివాదంగా పరిణమిల్లింది. దాని పరిష్కారంపైననే దేశంలో అధ్యక్షుని గౌరవం, విదేశాలలో అమెరికా ఖ్యాతి ఆధారపడ్డాయి. నీగ్రో సమస్యకూడా కేంద్రా

నికీ, రాష్ట్రాలకూ గల సంబంధాలవంటి కొన్ని ఇతర రాజ్యాంగ సంబంధమైన అంశాలతో కూడుకున్నదే. ప్రెసిడెంట్ దక్షుడు కాకపోయినట్లయితే ఏమైనా జరిగివుండేదే. కాని ఈ విషయంలో కూడా శ్రీ కెనెడీ సమయోచితమైన ప్రజ్ఞ ప్రదర్శించి ఈ సమస్యను ఎంతో ధైర్యంగా, సమర్థంగా ఎదుర్కొన్నారు. ఈ వ్యవహారానికి సంబంధించిన వివాదం పూర్తిగా సమసిపోలేదు. ఒకవేళ శ్రీ కెనెడీ హత్యకు ఏహ్యకరమైన జాతివిద్వేషమే కారణమైనట్లయితే అందుకు ఎంతమాత్రం ఆశ్చర్యపడనవసరంలేదు. నీగ్రో సమస్య విషయంలో శ్రీ కెనెడీ అనుసరించిన విధానంవల్ల ఆయన వారికి ప్రియతముడయ్యాడనే విషయాన్ని ఎవ్వరూ ఖండించలేరు.

శ్రీ కెనెడీ భారతదేశానికీ, ఇతర వెనుకబడిన దేశాలకు ప్రియమిత్రుడు. అంతర్జాతీయ రాజకీయ నాటకరంగంలో అమెరికా షైలాక్‌పాత్ర వహించడం ఆయనకు ఇష్టంలేదు. సహాయక కార్యక్రమాల విషయంలో "నిర్బంధాలను" విధించే విధానాన్ని ఆయన స్పష్టంగా వ్యతిరేకించేవారు. సెనేటు అననుకూల అభిప్రాయంతో ఉన్నప్పటికీ ఆయన తన అభిప్రాయాలకు కట్టుబడి ఉండడమే ఆయన అభ్యుదయ దృక్పథానికి నిదర్శనం.

ఇంత కొద్దికాలంలో సమకాలీన చరిత్రలో శ్రీ కెనెడీ వహించిన ఇంతటి కీలకపాత్రను మరే అమెరికన్ ప్రెసిడెంటు వహించలేదని చెప్పవచ్చు. అతను పొందుతున్న ప్రఖ్యాతిని పరిశీలిస్తే అమెరికా చరిత్రలో మరి యే ఇతరవ్యక్తి నిర్వహించనంతటి ప్రెసిడెంటు పదవీ కాలాన్ని శ్రీ కెనెడీ నిర్వహించడానికి హత్యమినహా మరి యే ఇతరకారణాలు అడ్డగించేవి కావని చెప్పవచ్చు. అతను నవయువకుడు. రోమన్‌కాథెలిక్కు. అసమాన్యమైన అనేక విషయాలు అతనిలో ఉన్నాయి. అతని జీవితచరిత్ర అమిత అద్భుతమైనది, శాశ్వతంగా నిలుస్తుంది.

తమ ఆశయసిద్ధికై ప్రాణాలొడ్డిన ఇతర గొప్పవ్యక్తులకువలెనే శ్రీ కెనెడీ తన మృతితో ప్రపంచానికీ, ప్రత్యేకంగా ప్రజాస్వామ్యానికి ఒక గుణపాఠాన్ని నేర్పాడు. పరిణతిచెందిన ప్రజాస్వామ్య దేశంలో తమ ఉద్దేశాన్ని నెరవేర్చుకోడానికి హత్యకు పూనుకోవడం విషాదకరమైన విషయం. భౌతిక సంపద సమృద్ధిగా ఉన్నంతమాత్రాన అది రాజకీయ పరిణతకు ప్రమాణంకాదనే విషయం దీనివల్ల సుస్పష్టమవుతుంది.

హంతకుని చంపినందువల్ల రహస్యం మరింత గోప్యం కావడమేగాక హత్యా ఉద్దేశం కప్పిపుచ్చబడింది. ఇటువంటి విషయాలు వాటికవే జరుగుతాయనుకోవడం నమ్మ [illegible] ఉండగానే సంక్షోభకరమైన వాస్తవిక విషయాలు వెలుగుకు వస్తాయనే భావించవచ్చు.

కెనెడీ అనంతరం అధ్యక్షపదవిని నిర్వహిస్తున్న ప్రెసిడెంటు లిండన్ జాన్సన్‌కు అమెరికా అధ్యక్షునికి ఉండవలసిన అర్హతలన్నీ ఉన్నాయనే చెప్పబడుతున్నది. గొప్ప వ్యక్తులకు వారసులయిన ఇతరులందరివలనే శ్రీ జాన్సన్ అనుకూల వాతావరణంలో తమ పదవీనిర్వహణను ప్రారంభిస్తున్నారు.

ముఖ్యంగా ప్రెసిడెంట్ జాన్సన్, శ్రీ కెనెడీ ఏ సిద్ధాంతాలు, ఆదర్శాలకొరకై తే జీవించి, మరణించారో వాటిని ఖచ్చితంగా పాటించాల్సి వుంటుంది. ప్రపంచ శాంతి, సౌభాగ్యం — ఈ లక్ష్యద్వయం సాధనకు అమెరికాలో మున్నెన్నడూ లేనంతటి సాహసోపేతమైన, వివేకవంతమైన నాయకత్వం అవసరం. కొన్ని కొన్ని క్లిష్టమైన కాలాలలో కొన్ని దేశాలకు చారిత్రకమైన బాధ్యత సంక్రమిస్తుంటుంది. ఈ చారిత్రక బాధ్యతను వహించడంలో ప్రెసిడెంట్ జాన్సన్ కృతకృత్యులు కాగలరని ఆశించబడుతున్నది.

# అపార నష్టం

అదేరోజున, జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రంలో పూంఛ్ సమీపంలో గుల్పూర్ వద్ద భారత విమానదళం తాలూకు హెలికాప్టర్ కూలిపోవడంవల్ల భారత రక్షణ దళాలకు చెందిన అయిదుగురు ఉన్నతాధికార్లు మరణించినట్లు విషాదవార్త అందింది.

ఆ ప్రాంతంలో తనిఖీ జరపడానికి వెళ్తూ ప్రమాదవశాత్తు మరణించిన ఆ అధికార్లు వీరు: లెఫ్టినెంట్ జనరల్ దౌలత్‌సింగ్, పశ్చిమ ప్రాంతం సేనాని; ఎయిర్ వైస్ మార్షల్ ఇ. డబ్ల్యు. పింటో, ఎయిర్ కమాండింగ్ ఆఫీసర్, పశ్చిమ ఎయిర్ కమాండ్; లెఫ్టినెంట్ జనరల్ బిక్రమ్‌సింగ్, కోర్ కమాండర్, పశ్చిమ ప్రాంతం; మేజర్ జనరల్ ఎన్. కె. డి. నానావతి, బ్రిగేడియర్ ఎస్. ఆర్. ఓబెరాయ్. హెలికాప్టర్ పైలట్ ఫ్లైట్ లెఫ్టినెంట్ ఎస్.ఎస్. సోఢీకూడా మరణించారు. సంయుక్త విమాన శిక్షణ విన్యాసాలు ముగిసిన వెంటనే ముఖ్యంగా భారతదేశం అగ్రశ్రేణి సైనికాధికార్ల ఎట్టి నష్టాన్నీ భరించలేనటువంటి తరుణంలో ఈ వార్త నిజానికి పిడుగుపాటుగా వుంది. ఈ ప్రమాదంలో దివంగతులైన సైనికాధికార్లందరూ సామర్థ్యంలోనూ, శౌర్య పరాక్రమాలలోనూ ప్రసిద్ధిగాంచారు. దేశ రక్షణ శక్తిని పటిష్ఠం చేయడంలో వీరి సేవలు చాలావరకు తోడ్పడ్డాయి.

ఈ దుర్ఘటన చాలదన్నట్లు, బనిహాల్ సమీప ప్రాంతంలో మరో విమానప్రమాదం సంభవించింది. తత్ఫలితంగా మన విమాన దళానికి చెందిన నలుగురు ఉద్యోగులు, నలుగురు సివిల్ అధికార్లు మరణించారు. ఈ ప్రమాదంలో చనిపోయిన వారి పేర్లివి:— ఎఫ్/ఓ. ఎస్. ఎస్. సిద్ధు, పి/ఓ. డి. గుప్త, పి/ఓ. వి. కె. సహస్రబుధే, పి/ఓ. ఎం. వి. సింగ్. విమానదళానికి చెందిన నలుగురు సివిల్ ఉద్యోగులు — ఎన్. సి. చెట్టి, ముజుమ్దార్, అగ్నాలిక్, అత్రిష్ రద్దే.

అనేకమంది ఉన్నతాధికార్లు కలిసి ఒకే వాహనంలో ప్రయాణంచేయడం ఎంత అపాయకరమో ఈ రెండు సంఘటనలవల్ల స్పష్టమవుతున్నది. ఈ విషయంలో ఏదైనా నిబంధన వుండాలి. బహుశా ఇదివరకే ఇటువంటి నిబంధన వున్నట్లయితే దానిని ముమ్ముందు మరింత ఖచ్చితంగా పాటించాలి.

## ప్రఖ్యాత నాయకుడు



శ్రీ కన్నమ్‌వార్ ఆకస్మిక మరణం చెందారు. ఆయన మహారాష్ట్ర అగ్రనాయకులలో ఒకరు. శ్రీ కన్నమ్‌వార్ తమ త్యాగనిరతి, సేవాభావాలవల్ల సామాన్యస్థితినుండి ముఖ్యమంత్రి వంటి ఉన్నత పదవి నలంకరించగలిగారు. ఆయన మహోన్నత జీవితం భావితరాల వారికి ఆదర్శప్రాయమవుతుంది.

## ఆల్డస్ హక్స్‌లీ

నవంబరు నాలుగవ వారంలో అస్తమించిన మరో ప్రసిద్ధవ్యక్తి ఆల్డస్ హక్స్‌లీ, ఆయన వ్యాసకర్త, నవలా రచయిత, నాటకకర్త. ఈ శతాబ్దంలో సాహిత్యజగత్తులో అలరారిన గొప్ప మేధావంతులలో ఒకరు.

హక్స్‌లీ రచనలలో దాదాపు అన్నింటిలోనూ భారతీయ తత్త్వశాస్త్ర ప్రభావం స్పష్టంగాకనిపిస్తుంది. ఆయన మనసుఅంతగా ఆకర్షించడానికి ఇదే కారణం. "ది బ్రేవ్ న్యూవరల్డ్"లో ఆయన చేసిన గొప్ప వ్యంగ్య చిత్రణలను పాఠకలోకం కలకాలం జ్ఞప్తికుంచుకుంటుంది. ఈ గ్రంథంలో ఉదహరించబడిన "సోమ" అనే మాట "సోమరసం" అనే పదానికి రూపాంతరమైనట్లు కనిపిస్తుంది.

భారతీయ ఆలోచనా ప్రభావానికిలోనైన హక్స్‌లీ వ్యంగ్య కారునిగా మాత్రమే ఎంతకాలమో వుండిపోలేదు. కాలం గడచినకొద్దీ ఆయన దృష్టి నిగూఢత్వాన్ని సంతరించుకుంది. "ఎండ్స్ అండ్ మీన్స్" అనే ఆయన గ్రంథంలో ఈ ముద్ర కానవస్తుంది.

హక్స్‌లీ శైలి స్వచ్ఛమైనది. స్పష్టమైనది. చమత్కారమైనది. అయినప్పటికీ అనేకమంది వ్యంగ్యరచయితల రచనల్లో సహజంగావుండే హేళన ఈయన రచనల్లో అంతగా కనిపించదు. హక్స్‌లీ కొత్తగా ఏదైనా విషయాన్ని చెప్పదలచినట్లు కనిపిస్తుంది. అయితే తన స్వంతమైన ఏదైనా బలమైన సిద్ధాంతాలను ఆయన ప్రవచించాడని గానీ లేదా అందుకు ప్రయత్నించాడని కాని చెప్పటం కష్టమే.

ఆయన మరణంతో ముఖ్యమైన, ఆసక్తికరమైన ఒక ఆధునిక రచనా ప్రక్రియకు తీరని లోటు ఏర్పడింది.

## పారిశ్రామిక యుగం

భారీ ఇంజనీరింగ్ కార్పొరేషను తాలూకు నాలుగు ప్రధాన ప్రాజెక్టులలో మొదటిదైన భారీయంత్ర నిర్మాణాల కర్మాగారానికి రాంచీలో గత నెలలో ప్రధాన మంత్రి లాంఛన ప్రాయంగా ప్రారంభోత్సవం చేశారు. ఇదిభారతదేశ పారిశ్రామికాభివృద్ధి రంగంలో వినూత్నమైన, గమనార్హమైన సంఘటన. ఈనాలుగుప్రాజెక్టులకూ రూ. 171 కోట్లు ఖర్చవుతుంది. వీటిలో రెండు చెకోస్లవేకియా సహకారంతో నిర్మించబడుతుండగా మిగిలిన రెండు రష్యాసహాయంతో నిర్మించబడుతున్నాయి. దుర్గాపూర్‌లో బొగ్గుగని త్రవ్వకపు సాధన సామగ్రుల యంత్రానికి కూడా ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఈ భారీయంత్ర నిర్మాణాల కర్మాగారం నిర్మాణం పూర్తయ్యాక, ఒక సంవత్సరంలోగా 2,000,000 టన్నుల ఒక ఉక్కు యంత్రాగారానికి అవసరమయ్యే ముఖ్య విడిభాగాలలో 75 శాతం విడిభాగాలను ఉత్పత్తి చేయగలుగుతుంది.

ఈ ప్రారంభోత్సవానికి కేంద్ర ప్రభుత్వ ఉక్కు, భారీ పరిశ్రమల మంత్రి అధ్యక్షత వహించారు. ఈ ప్రాజెక్టు ఉక్కు యంత్రాగారాల స్థాపనకై యంత్ర పరికరాలను ఉత్పత్తి చేస్తుంది కాబట్టి ఇది ఇతర ప్రాజెక్టులకంటే భిన్నమైనదని ఆయన అన్నారు. నిర్మాణదశ ముగిశాక ఇది 80,000 టన్నుల యంత్ర పరికరాలను ఉత్పత్తి చేయగలుగుతుంది. కాగా వీటిలో 60,000 టన్నుల యంత్ర పరికరాలు బొకారో ఉక్కు కర్మాగారానికే అవసరమవుతాయి.

భిలాయ్‌లో మరోసభలో మాట్లాడుతూ కేంద్ర భారీపరిశ్రమలమంత్రి, బొకారో ఉక్కు కర్మాగారం ఇంజనీరింగ్ విషయాలను ఒక భారతీయ ఫర్మ్‌కు అప్పగించడానికి యూనియన్ ప్రభుత్వం నిశ్చయించిందనీ, భారతదేశ సాంకేతిక రంగం అభివృద్ధి చరిత్రలో ఈ నిర్ణయం ఒక ముఖ్య ఘట్టంగా పరిగణించ బడవచ్చుననీ అన్నారు. భారతదేశ వర్తమాన ప్రణాళికలలోనూ, భవిష్యత్ ప్రణాళికలలోనూ ఇనుము, ఉక్కు, అల్యూమినియం, రాగి తదితర లోహాల ఉత్పత్తి విస్తరణ కార్యక్రమాలకు—ఇంజనీర్లు, మెటలార్జిస్టుల శిక్షణతోసహా—భారీ ఎత్తున కృషి

సాగించవలసి వుంటుందని ఆయన అన్నారు. 1971 వ సంవత్సరం నాటికి భారత దేశానికి 3000 మెటలార్జిస్టులతో సహా 6500 మంది ఇంజనీర్లు అవసరమవుతారు.

## ఏ. సి. రైలు ఇంజన్లు

చిత్తరంజన్ కర్మాగారంలో తయారైన ఏ. సి. ఎలక్ట్రిక్ రైలు ఇంజనుకు ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఇది గమనార్హమైన మరో సంఘటన. భారత దేశంలో నిర్మించబడిన మొట్ట మొదటి ఏ. సి. ఎలక్ట్రిక్ రైలు ఇంజన్ ఇది. చిత్తరంజన్ కర్మాగారం ఇప్పుడు, దేశావసరాలను ఆదుకోవ [illegible] యంత్రాలను అయిదారింటిని ఉత్పత్తి చేస్తుంది.

చిత్తరంజన్ కర్మాగారం 1950 జనవరి 26 వ తేదీన ఉత్పత్తి ప్రారంభించి గత అక్టోబరు నెలాఖరు నాటికి 1,618 ఆవిరి రైలింజన్లను ఉత్పత్తి చేసింది. వీటిలో ప్రతి ఇంజను ఖరీదు దిగుమతి చేసుకున్న రైలింజను ఖరీదుకంటే చాలా తక్కువే.

ఈ కర్మాగారం ఈ సంవత్సరం ఆగస్టు వరకు 21 డి. సి. ఎలక్ట్రిక్ రైలింజన్లను కూడా ఉత్పత్తి చేసింది. డి. సి రైలింజన్లను బొంబాయి ప్రాంతంలో ఉపయోగిస్తారు. కాగా ఏ. సి. రైలింజన్లు తూర్పు ప్రాంతంలో ఉపయోగించబడతాయి.

## కెనడా సహాయం

రాజస్థాన్‌లో రెండవ అణుశక్తి యంత్రాగారాన్ని నెలకొల్పుకోవడంలోనే కాక, భవిష్యత్తులో పెద్ద ఎత్తున అణుశక్తి అభివృద్ధి పథకాలను రూపొందించుకోవడంలో కూడా భారత దేశానికి సహాయపడగలవని భావించబడుతున్న రెండు ఒడంబడికలపై ఒట్టావాలో సంతకాలు జరిగాయి. ఈ ఒడంబడికల మేరకు కెనడా, భారత అణుశక్తి కమీషన్లు సాంకేతిక అంశాలలో పరస్పరం సహకరించుకుంటాయి. రాజస్థాన్‌లో 70 మిలియన్ డాలర్ల ఖర్చుతో నెలకొల్పే రియాక్టరుకు కెనడా సహాయం లభిస్తుంది. కెనడా ఈ స్టేషనుకు డిజైన్లు, సమగ్రమైన వర్కింగ్ డ్రాయింగులు, స్పెసిఫికేషన్లను సరఫరా చేస్తుంది. సాధన సామాగ్రి కొనుగోలుకు పరపతి సౌకర్యాలు సమకూరుస్తుంది. యురేనియం ఇంధనాన్ని లభింపజేస్తుంది.

ఈ ఒడంబడిక, అనేక విషయాలలో, తారాపూర్ అణుశక్తి కేంద్రానికి సంబంధించి లోగడ అమెరికాతో కుదుర్చుకున్న ఒడంబడికకంటే మెరుగైనదైనట్లు తెలుస్తున్నది.

భారత దేశం అణుశక్తి రంగంలో [illegible] నార్హం. అణుశాస్త్ర వుపయోగం విషయంలో మన ఉద్దేశాలను స్పష్టీకరించడంలో మనం ఎప్పుడూ కూడా సందిగ్ధత చూపలేదు. ఈ రంగంలో జరిగే ఎట్టి పోటీ లేక అభివృద్ధి కృషికైనా రాజకీయమైన ప్రయోజనాలు వుండవు. ప్రపంచ మంతటా అణు పరిశోధన రంగంలో జరుగగల ఇతోధికాభివృద్ధికి ఇది శుభ సూచకం.

## జర్నలిస్టులకు వేతన నిర్ణాయక సంఘం

మధ్య భారత్ హైకోర్టు మాజీప్రధాన న్యాయాధిపతి శ్రీ జి. కె. షిండీ ఛైర్మనుగా భారత ప్రభుత్వం వర్కింగు జర్నలిస్టులకు రెండవ వేతనాల నిర్ణాయక సంఘాన్ని ఏర్పాటు చేయడంతో పరంపరగా పాత్రికేయులు కోరుతూ వస్తున్న కోరిక ఎట్టకేలకు ఫలవంతమైంది. ప్రతి యజమాని, వద్దనుండి, వర్కింగు జర్నలిస్టులనుండి యిరువురు ప్రతినిధులు, విడిగా మరో యిరువురు స్వతంత్ర ప్రతినిధులు యీ సంఘంలో వుంటారు. దీని ప్రధాన కార్యాలయం ఇండోర్‌లో వుంటుంది.

1955 సం. పు వర్కింగ్ జర్నలిస్టుల (సర్వీసు నియమావళి ప్రకారం), ఇతర సౌకర్యాల చట్టం క్రింద ఏర్పడ్డ యీ సంఘం చట్టం వీలు కల్పించిన మేరకు వర్కింగు జర్నలిస్టుల వేతనాలను నిర్ణయించడం లేదా పునర్వ్యవస్థీకరించడం చేస్తుంది.

ఈ చట్టం క్రింద ఏర్పడ్డ మొదటి వేతనాల సంఘంచేసిన సిఫారసులను వార్తాపత్రికల యజమానులు చేసుకున్న నివేదన ప్రకారం సుప్రీంకోర్టు త్రోసిపుచ్చింది. ఆ తరువాత వర్కింగు జర్నలిస్టుల వేతనాలను నిర్ణయించడానికి ప్రభుత్వమే ఒక అధికార వేతన నిర్ణాయక సంఘాన్ని ఏర్పాటుచేసింది.

వార్తాపత్రికలలో పనిచేసే జర్నలిస్టేతర పనివారలకుకూడా వేతనాలను నిర్ణయించేందుకు పైన తెలియజేసిన శ్రీ జి. కె. షిండీ ఛైర్మనుగా ఒక వేతన నిర్ణాయక సంఘాన్ని ఏర్పాటు చేయాలనికూడా ప్రభుత్వం ఉద్దేశించింది.

## పాకిస్తాను గూఢచారి చర్యలు

భారత రాజధానిలోనూ, దేశంలోని అనేక యితర ప్రాంతాలలోనూ పాకిస్తాను కొనసాగిస్తున్న గూఢచారిచర్యలకు సంబంధించిన వార్తలు తరచుగా వినవస్తుండడంతో పాటు, విదేశ వ్యవహారాల, రక్షణ మంత్రిత్వ శాఖలు రెండింటిలోనూ లోగడ అసిస్టెంటుగా పనిచేసిన బి. కె. భట్టాచార్య అనే వ్యక్తి పాకిస్తాను రాయబారి కార్యాలయంలో పని చేస్తున్న డ్రైవరు వద్దనుండి కొన్ని రహస్య పత్రాలను అందుకొంటూ వుండగా గతనెలలో అరెస్టు కావించబడినట్లు ఢిల్లీనుండి ఒక అధికార ప్రకటన వెలువడింది. మేజిస్ట్రేటుముందు భట్టాచార్య తన నేరాన్ని ఒప్పుకొంటూ తాను ముఖ్యమైన సమాచారాన్ని అందజేసిన పాకిస్తాను రాయబారి కార్యాలయానికి చెందిన సిబ్బందిపేర్లు కొన్ని తెలియజేశాడు. ఈ సంఘటన వల్ల పాకిస్తాను హైకమీషనుకు చెందిన రెండవ కార్యదర్శిని, మరో యిద్దరు సభ్యులను

దేశం విడిచివెళ్ళిపోవలసిందిగా ఆదేశించడం జరిగింది.

ఇందుకు పాకిస్తాను పగతీర్చుకోదలచి పాకిస్తానులోని భారత రాయబారి కార్యాలయానికి చెందిన రెండవ కార్యదర్శిని, మరో యిద్దరు సభ్యులను దేశంనుండి బహిష్కరించింది.

గత మూడు మాసాలలోనూ పాకిస్తాను గూఢచారి చర్యలను కొనసాగించడం యిది రెండవది. ఇంతకుముందు ఒక ఐ. ఎ.ఎఫ్. అధికారి అరెస్టు చేయబడ్డాడు.

తమ రాయబారి కార్యాలయంద్వారా పాకిస్తాను భారత దేశంలో తరచుగా కొన [illegible] పాకిస్తానుకు తమ తీవ్ర ఆక్షేపణను తెలియజేసింది.

భారతదేశం బహిష్కరించినట్టు పాకిస్తానులోని భారత రాయబారి కార్యాలయానికి చెందిన అదే సంఖ్యలో వ్యక్తులను, ఇంచుమించు అవే హోదాలుగల వారిని స్వదేశానికి పిలిపించుకోవాలని పాకిస్తాను కోరడంలో ఏదో ప్రత్యేకత వున్నది దీనివల్ల అర్థం అవుతున్న విషయం ఏమిటంటే పాకిస్తాను పరిపాలకులు తీసుకున్న చర్యలు లోకం నమ్మేటట్టుగా వుండాలని కూడా వారు అనుకోరు.

## ప్రచారం

పాకిస్తాను చైనా సహాయంతో భారత దేశానికి వ్యతిరేకంగా ప్రచారం కొనసాగిస్తూ రెండు దేశాలమధ్యా తీవ్ర ప్రతిష్టంభనను కలిగిస్తున్నదని, పొరుగుదేశంపై అర్థంలేని నిందలను వేసేబదులు పాకిస్తాను ప్రభుత్వం తన స్వంత వ్యవహారాలలో జోక్యం కల్పించుకుని ప్రజల సమస్యలను గురించి ఆలోచించుకోవడం దానికి శ్రేయస్కరమని సలహాయిస్తూ ఐక్యరాజ్య సమితిలో భారత దేశపు శాశ్వత ప్రతినిధి భద్రతాసంఘం అధ్యక్షునికి ఒకలేఖ వ్రాశారు.

భారత దేశంలో కాశ్మీరు విలీనీకరణను గురించి బక్షీగులాంమహమ్మద్ చేసిన ప్రకటనను నిరసిస్తూ యింతకుపూర్వం పాకిస్తాను భద్రతాసంఘానికి అందజేసిన ఉత్తరానికి యిది సమాధానం.

## టోకియో తిరస్కృతి

అయిదురోజుల సుదీర్ఘ చర్చల అనంతరం, చైనాకువెళ్ళే పాకిస్తాను వ్యాపార విమానాలు టోకియోలో దిగడానికి అనుమతించడంలో అనేక 'రాజకీయ సమస్యలు' యిమిడి వున్నాయని జపాను పాకిస్తాను కోరికను తిరస్కరించింది. పాకిస్తాను ప్రతినిధులు యీ విమాన యానాలు 'పూర్తిగా ఆర్థిక, వ్యాపార విషయాలకు సంబంధించినవి' అని ఎంతగట్టిగా నొక్కి చెప్పినా జపానువారు యివి రాజకీయ సమస్యలతో ముడిపేసి వున్నాయని భావించడం వలన పాకిస్తాను కోరికను మన్నించలేక పోయారు.

గత ఆగస్టు 29 తేదీన కరాచీలో జరిగిన చైనా — పాకిస్తాను విమాన ఒప్పందం ప్రకారం పాకిస్తాను ఇంటర్నేషనల్ ఎయిర్ లైన్సు కేంటన్, షాంగ్ హై ద్వారా టోకియో చేరుకునే విషయమై యీ సంభాషణలు ప్రారంభించబడ్డాయి. ఆ విమాన ఒప్పందంవల్ల, ఢాకా విమానాశ్రయాన్ని అభివృద్ధి పరచేందుకు అమెరికా పాకిస్తానుకు యివ్వ సంకల్పించిన ఋణాన్ని నిలిపివేయ వచ్చుననే సందేహాన్ని అమెరికా వ్యక్తపరిచింది. ఒప్పందం జరిగిన అనంతరం పాకిస్తాను ఇంటర్ నేషనల్ ఎయిర్ లైన్సు మేనేజింగ్ డైరెక్టరు ఒక పాత్రికేయుల సమావేశంలో మాట్లాడుతూ టోకియోలో దిగటానికి అనుమతి లభించకపోతే, పాకిస్తాను విమానాలు కేవలం కేంటన్‌కు వెళ్ళే విషయంలో తగు చర్యలు తీసుకోగలమని అన్నారు.

జపాను తిరస్కారాన్ని 'చాలా తెలివి తక్కువ చర్యగా' ప్రెసిడెంటు అయూబ్ ఖాన్ అభివ్యక్తీకరించారు. ఈ సమస్యను ప్రభుత్వ స్థాయిలో చర్చించ దలచినట్టు తెలియజేశారు.

పాకిస్తాను విమానాలు చైనాతో చేసుకున్న ఒప్పందం ప్రకారం భారతదేశం మీదనుండి ఎగిరితే, అది భారత గగనపరిధిని అతిక్రమించినట్టుగానే భావించబడుతుందని భారత పార్లమెంటులో అధికార పూర్వకంగా తెలియజేయ బడింది.

## పాకిస్తాను దళారిచర్య

అమెరికా, చైనాలమధ్య సఖ్యతను పెంపొందించడానికి పాకిస్తాను అధ్యక్షుడు అయూబ్ ఖాన్ తాను 'గౌరవ దళారీ'గా వ్యవహరించగలనని గత నెల [illegible] కొచ్చారు. అమెరికాలోని కొన్ని ప్రధాన వర్గాలవారు కమ్యూనిస్టు చైనాపై తమ ధోరణిని మార్చుకోవాలని కోరుతున్నారని, అందుచేత పాకిస్తాను పాశ్చాత్య దేశాలనుండి రక్షణ సహాయాన్ని పొందుతూ కమ్యూనిస్టు చైనాతో సఖ్యతతో వుండడంలో తప్పు ఏమీలేదని అయూబ్ ఖాన్ అభిప్రాయం. ఆయన అభిప్రాయం ప్రకారం ఆగ్నేయాసియాకు ఏమాత్రం అశాంతి సంభవించినా అది పాశ్చాత్యదేశాల మద్దతువున్న భారత దేశంనుండే తప్ప చైనానుండి మాత్రం కాదు అని.

చైనా తన రాజ్యవిస్తరణ కాంక్ష ధోరణిని విడనాడనంత వరకూ ఎట్టి పరిస్థితులలోనూ తన దేశానికి, చైనాకు మధ్య పొత్తుకుదరడం అనేది అసంభవం అని కెనెడీ పాత్రికేయుల సమావేశంలో నొక్కి చెప్పారు.

అయూబ్ ఖాన్ గౌరవ దళారీగా తాను వ్యవహరించగలనని చేసిన ప్రకటనకు అమెరికా సమాధానాన్ని యివ్వడం కూడా అనవసరం అని భావించింది.

పాకిస్తాను, సైనిక ఒప్పందాల సభ్యత్వం నుండి గౌరవ దళారీగా ఒక మెట్టు పైకి ఎక్కాలని భావించడంలో అర్థం అందరినీ యిట్టే ఆకర్షించాలని. నిజానికి పాకిస్తాను ధరిస్తున్న

యీ కొత్త పాత్రకు యీ వర్గాలవారు సంతోషిస్తున్నట్లేమీ లేదు. దళారీగా వ్యవహరించినందుకు పాకిస్తానుకు చెల్లించే కమీషను తమకు కలిగే లాభాలను మించి వుంటాయని యీ వర్గాలు భావిస్తున్నాయి. అదీగాక దీనివల్ల పాశ్చాత్య కూటమి అసలు గౌరవానికే భంగం వాటిల్లవచ్చు. ఇంత ఉదారబుద్ధితో అయూబ్ ఖాన్ చేయదలచిన సహాయానికి వచ్చిన సమాధానం ఏమిటంటే "చాలా కృతజ్ఞతలు. కాని మీ సహాయం మాకు అక్కరలేదు" అని!

## భారతదేశం - నేపాల్

నేపాల్ రాజు, మంత్రులు, అధికారులు, ప్రజలు హృదయపూర్వకంగా స్వాగతం పలకగా రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ గత నెలలో నేపాలు దేశాన్ని సందర్శించారు. తమ పర్యటన పొడవునా అధ్యక్షులు యిరు దేశాల సన్నిహిత స్నేహ సంబంధాలను గూర్చి నొక్కి చెప్పారు. భారతదేశం నేపాలును స్నేహ, సహకారాల దృష్టితో చూస్తున్నదని తెలియజేశారు. నేపాలు విశ్వవిద్యాలయం వీరికి సాహిత్యంలో గౌరవ డాక్టరేటు బిరుదు యిచ్చి సత్కరించింది. భారత దేశంనుండి సహాయం పొందుతున్న ప్రాజెక్టులతో సహా అనేక స్థలాలను వీరు సందర్శించారు.

కొలంబో ప్రణాళిక క్రింద భారతదేశం ఆర్థికంగాను, సాంకేతికంగాను నేపాలుకు 1952 నుండి సహాయం చేస్తున్నది. 1961-62 సం॥లో యీ సహాయం రూ. 2.3 కోట్లను మించి పోయింది. వారి అభివృద్ధి కార్యక్రమాలలో వారికి సహాయపడటానికిగాను అనేకమంది నిపుణులను, సాంకేతిక పనివారలను యీ దేశంనుండి నేపాలుకు పంపించడం జరిగింది. త్రిశూలీ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టును భారత దేశం నేపాలులో నిర్మిస్తున్న బృహత్తర ప్రాజెక్టుగా చెప్పవచ్చు. మరొకటి 72 మైళ్ళ పొడవుగల త్రిభువన రాజపథం. దీనిని భారత సైనిక యింజనీర్లు నిర్మించారు. ఈ రెండు దేశాలను కలుపుతున్న ప్రప్రథమ జాతీయ రహదారి యిది.

శతాబ్దాలనుండి భారత, నేపాలు దేశాలు స్నేహ వాత్సల్యాలతో మెలగుతున్నాయి. ఉత్తరదిశలో నీతిబాహ్యమైన పొరుగువాడు ఆవర్తించి వుండగా కూడా నేపాలు ప్రస్తుతం వ్యక్తం చేస్తున్న విధానానికి మనం దానిని అభినందించవలసి వున్నది. ఇరు దేశాలకు లాభించే అనేక బృహత్కార్యాలలో భారత దేశంతో చేయి చేయి కలపవలసిన అవసరాన్ని నేపాలు గుర్తించేటట్లు చేయడమే ప్రస్తుతం మనం చేయవలసిన పని. ఈ యిరువురు పాత మిత్రులు ఒకరినొకరు అర్థం చేసుకోవడంలో మరెన్ని అవకాశాలు భవిష్యత్తులో ఏర్పడగలవని, దేశాభివృద్ధి, దేశ జాగృతి సంబంధించిన విషయాలలో ఒకరికొకరు అండదండలు యిచ్చుకోగలరని భావించవచ్చు.

## విమాన విన్యాసాల 'శిక్షణ'

మన విమానబలాల రక్షణను పరీక్షించడానికి, ముఖ్యంగా విదేశ దురాక్రమణను ఎదుర్కోవడంలో రాడారు పరికరాల ఉపయోగాన్ని పరీక్షించడానికి భారత దేశం, ఇంగ్లండు, ఆస్ట్రేలియా, అమెరికా దేశాలు పాల్గొన్న 'శిక్షణ' అనబడే సమిష్టి విమాన విన్యాసాలు గతనెలలో భారత దేశంలో జరిగాయి. భారత విమానదళం విస్తృతాధికారం క్రింద భారత దేశపు తూర్పు, ఉత్తర రంగాలలో జరిగిన శిక్షణ విన్యాసాలలో మొత్తం 136 విమానాలు పాల్గొన్నాయి. రహస్యంగా జొరబడుతున్నట్లు కృత్రిమంగా ప్రవేశించిన విమానాలను రాడారుద్వారా కనుగొనడం, వాటిని నిరోధించే ప్రయత్నాలు చేయడం మొదలయిన విన్యాసాలు జరిగాయి. భారతీయ వైమానికులకు రాడారు పరికరాలను ఉపయోగించడంలోనూ, వాటిసక్రమ నిర్వహణలోనూ శిక్షణ యివ్వడమే యీ విన్యాసాల ముఖ్యోద్దేశమని రక్షణ మంత్రిత్వశాఖకు చెందిన ఒకరు తెలియజేశారు. ఈ విన్యాసాల శిక్షణలో అత్యధిక విజయం లభించింది. ఈ విన్యాసాలు విమానబల రక్షణలోను, ఆకస్మికదాడి సంసిద్ధతలోను ఎంతో ఉపయోగాన్ని కలిగించాయి. ఆపదను తెలియజేసిన వెంటనే ఏమాత్రం వ్యవధిలేకుండా వెనువెంటనే సంసిద్ధులయ్యే విషయంలో మన వైమానికుల ప్రదర్శన ఎంతో ఆశాజనకంగా వుంది.

## పౌర రక్షణ

యుద్ధసమయంలోనూ, శాంతికాలంలోను దేశసేవ అవసరమైనప్పుడల్లా వెంటనే ముందుకువచ్చే కొంతమంది ప్రజలను తయారుచేసే వుద్దేశ్యంతో ఇంగ్లండు పౌర [illegible] ప్రకారం తయారుచేసిన ఒక ప్రణాళిక మేరకు భారతప్రభుత్వం ఒక కొత్తరహా పౌర రక్షణను రూపొందిస్తున్నది. ఈ దీర్ఘకాలిక ప్రణాళిక క్రింద, హోంగార్డులు దేశవ్యాప్తంగా కొనసాగించే కృషిద్వారా అన్నివిధాలైన పౌరరక్షణ చర్యలు తీసుకొనబడతాయి. సుదూర భవిష్యత్తులోనే యీ హోంగార్డుల సంఖ్యను పదిలక్షలకు పెంచడం జరుగుతుంది.

కేంద్ర పౌరరక్షణకు చెందిన డైరెక్టరేటు, రాష్ట్రాలలో వీరిని చేర్చుకొనే విషయంలో వివరంగా కొన్ని లక్ష్యాలను—అంటే చేర్చుకొనే సంఖ్య గరిష్ఠ పరిమితులను నిర్ణయించింది. వీటిలో కొన్నింటిని అప్పుడే సాధించడంకూడా జరిగింది.

హోంగార్డులకు ప్రాథమిక చికిత్స, మంటలలో చిక్కుకున్నవారిని రక్షించడం, విమానదాడి రక్షణ మొదలయిన వాటిలో శిక్షణ యివ్వడమేగాక 'నాయకత్వం'లోనూ తగిన శిక్షణను వారికి యివ్వాలి. మామూలు సమయాలలో వీరు వరదలు, అగ్నిప్రమాదాలు, భూకంపాలు మొదలయిన ప్రకృతిసిద్ధమయిన దుర్ఘటనల్లో పౌర అధికారులకు సహాయపడతారు. అవసరం అయితే రాత్రికి రాత్రే దేశరక్షణకొరకు తరలించ బడతారు.

వీరికి యీ రకపు శిక్షణలో ఎక్కువభాగం నాగపూర్‌లోని జాతీయ అగ్నిమాపక సర్వీసు కళాశాలలోను, ఆ చుట్టుపట్లగల కేంద్ర అత్యవసర సహాయక శిక్షణ సంస్థలలోను యివ్వబడుతుంది.

## నేఫా

తూర్పు రంగంలో మెక్‌మోహన్ లైను వరకు తన బలాలను నడిపించడం భారత దేశం అభిమతం కాదని సింహళ ప్రధాన మంత్రిద్వారా చైనా ప్రభుత్వానికి భారత ప్రధానమంత్రి [illegible] పత్రికలలో వచ్చిన వార్త తప్పుడు సమాచారంగా ఢిల్లీ [illegible] ఆ విధమైన సమాచారం ఎవరికీ పంపించ లేదు.

కొలంబో ప్రతిపాదనల ప్రకారం భారత సైన్యం, యిరు ప్రభుత్వాలు గుర్తించిన ప్రాంతాలలోని వాస్తవ అధీన రేఖ వరకు వున్న ఏ ప్రాంతంలోనికైనా వెళ్ళవచ్చు. ఇదే [illegible] వుంటుంది.

డోలా, లాంగ్జూ — ఈ రెండు కొండపాటి ప్రాంతాలలో తప్ప నేఫాలోని సరిహద్దుల వరకు భారత దేశం తిరిగా తన సైన్యాన్ని నడిపించవచ్చని ప్రధానమంత్రి గత ఫిబ్రవరి నెల 25 వ తేదీన పార్లమెంటులో తెలియజేశారు. ఈ విషయంలో ప్రభుత్వం అంచెలంచెలుగా చర్యలు తీసుకుంటున్నదన్నారు. "ఇప్పుడు మనం మన గస్తీదారులను పంపిస్తున్నాం. అవసరమనుకుంటే అస్సాం రైఫిల్ దళాలను, సైన్యాన్ని అక్కడకు పంపించగలం"

ఈ తప్పుడు సమాచారం వల్ల యితరులు పొరపాటుగా అర్థం చేసుకొనే అవకాశం వుంది. దీనిని శత్రువులు స్వప్రయోజనానికి ఉపయోగించు కొంటున్నారు. ఇప్పుడు యీ వార్తను ఖండించడం వలన సరిగా అర్థం చేసుకోవడానికి వీలు కలుగుతుంది. మెక్‌మోహన్ లైనువరకూ వెళ్ళడం అనేది యిక్కడ ప్రశ్న కాదు. అక్కడ వుండడం అనేదే తలఎత్తే ప్రశ్న. మన భూభాగాన్ని మనం శత్రువునుండి కాపాడుకోవడానికి దేశం యావత్తూ సిద్ధపడి నిలవడంపై స్పష్టంగా యిది ఆధారపడి వుంది. చైనాకుకూడా యిది తెలుసు. అందుకే యీ కేంద్రీకరణ. నిజంగా యిది ఆయుధాల యుద్ధమేగాదు వివేకానికి సంబంధించిన సంగ్రామం కూడానూ.

## విదేశాలలో ప్రచారం

కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన ఆఫ్రికా దేశాలలో భారత దేశపు వాస్తవిక స్వరూపాన్ని ప్రతిబింబింప జేయవలసిన అవసరాన్ని, చైనా [illegible] ఎదుర్కోవలసిన అవసరాన్ని గత నెలలో ఢిల్లీలో పశ్చిమ ఆసియా, ఆఫ్రికాలలోని భారత దౌత్య ప్రతినిధివర్గాల అధిపతులతో జరిగిన అయిదురోజుల సమావేశంలో గట్టిగా నొక్కి వక్కాణించడం జరిగింది. ఈ దేశాలలో దౌత్యవర్గ ప్రతినిధుల సంఖ్యను పెంచడంపై కూడా ఒక నిశ్చయానికి రావడం జరిగింది. భారత దేశం నుండి సాంకేతిక నిపుణులు, యితర నిపుణుల అవసరం ఆఫ్రికా దేశాలకు వున్న మేరకు భారత ప్రభుత్వం వాటిని తనకు సాధ్యమైనంత వరకూ అందజేయాలని కూడా యీ సమావేశం అంగీకరించింది. ఈ దేశంలో వున్న ఆఫ్రికా విద్యార్థులకు యిచ్చే స్కాలర్‌షిప్పుల సంఖ్యను పెంచాలని కూడా భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ప్రస్తుతం ఆఫ్రికా దేశాలతో జరుగుతున్న వర్తకాన్ని అభివృద్ధి పరచడంపై గూడా చర్చించడం జరిగింది. ఈ సమావేశంలో 38 దేశాలకు సంబంధించిన 22 మంది రాయబారులు పాల్గొన్నారు. మనం చేయవలసిన పనులలో ఒకటయిన చైనా ప్రచారాన్ని ఎదుర్కోవడంతోపాటు, కొత్తగా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న ఆఫ్రికా దేశాలతో, ఆయా దేశాల మేలుకోరే, స్నేహ సద్భావాలను పెంపొందింప జేసుకోవలసిన అవసరాన్ని గుర్తించడంకూడా అవసరం. ఆఫ్రికా ముందు ముందు అభివృద్ధి కాదగిన ఖండం గనుక ఆఫ్రికా దేశాలతో భారతదేశం స్నేహసద్భావాలను ఏర్పరచుకోవడానికి, అభివృద్ధి పరచుకోవడానికి ప్రత్యక్ష విధానాలను ఏర్పరచుకోవలసి వుంది. భారత దేశం, ఆఫ్రికా ఖండాలు రెండూ ఒకదాని కొకటి యిచ్చుకోవలసినవి ఎన్నో వున్నాయి. ఈ రెంటి అభివృద్ధికి యివి ఎంతగానో ఉపయోగ పడతాయి.

## రాష్ట్ర శాసనసభల సమావేశం

రాష్ట్ర ఉభయ శాసనసభల శీతాకాలం సమావేశాలు ప్రారంభమయ్యాయి. సంయుక్త సమావేశంలో గవర్నరు ప్రసంగించారు. సమావేశ కాలంలో అనేక ప్రభుత్వ నిర్ణయాలను వెల్లడించడం జరిగింది. గోదావరి నదిపై రెయిలు–రోడ్డువంతెననిర్మాణం ఖర్చులకై రూ. 50 లక్షలు యివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఉపాధి సౌకర్యాలను పెంచడానికి వీలుగా రాష్ట్రంలోని పెలక్టు అయిన ఒకటి లేక రెండు బ్లాకులలో వ్యవసాయ – పారిశ్రామిక పట్టణ పథకాన్ని అమలు చేయడం జరుగుతుంది. పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ రాష్ట్రంలో ఒక దుక్క యినుము ఫ్యాక్టరీని నెలకొల్పుతుంది. ఆంధ్ర పేపరు మిల్లును ప్రైవేటు రంగానికి అప్పగించే ప్రతిపాదన ఉంది. ఆ విధంగా మిగిలిన మొత్తాన్ని, అత్యవసరమైన అభివృద్ధి పథకాలను అమలు జరిపేటందుకు వినియోగించే వీలు కలుగుతుంది. శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టులకు అవసరమైన సాంకేతిక అనుమతిని పొందడానికై రాష్ట్రాధికారులను ఢిల్లీ పంపడం జరిగింది. బావుల సబ్సిడీ పథకాన్ని మరికొన్ని ప్రాంతాలకు విస్తరింప జేస్తారు. రాష్ట్రంలో చిన్న ట్రాక్టర్ల ఉత్పత్తిని ప్రోత్సహించడం జరుగుతుంది.

పంచాయతీలు, సమితులకు రహస్య బ్యాలెటు పద్ధతిద్వారా ఎన్నికలు జరుగుతాయి. రాష్ట్రంలో బ్లాకుల పునర్విభజనకై ఉన్నతాధికార సంఘాన్ని ఏర్పాటుచేయడం జరిగింది.

తమ అధ్యక్షుణ్ణి ఏకగ్రీవంగా ఎన్నుకున్న పంచాయతీలకు రొక్కం రూపంలో బహుమతులు యివ్వడానికి ప్రతిపాదించబడింది. శాసనసభ సమావేశంలో ప్రతిపాదించబడిన ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ బిల్లును సభ ఆమోదించింది.

వరద బాధితులకు, స్వర్ణకారులకు తదితరులకు సహాయక కార్యక్రమాలను త్వరితగతిని అమలుచేయడం జరుగుతుంది. ప్రాథమిక విద్యావ్యాప్తికి భంగంకలుగకుండా ఉండడానికి వీలుగా ఉపాధ్యాయుల తొలగింపును ఆపుచేయడం జరుగుతుంది. పాఠ్యపుస్తకాల ప్రచురణ, ముద్రణకై కార్పొరేషన్ను నెలకొల్పడానికి వీలుగా శాసనసభ సమావేశంలో బిల్లును ప్రతిపాదించారు. యీ సమావేశంలో కార్పొరేషన్, మునిసిపాలిటీలకు సంబంధించిన బిల్లును ప్రతిపాదించడం జరుగుతుంది.

యీ విధంగా శాసనసభ శీతాకాలం సమావేశంలో ముఖ్యమైన శాసనాలను పూర్తి చేయడం జరుగుతుంది.

## దక్షిణాఫ్రికాపై ఆంక్షల విధింపు

నైరుతి ఆఫ్రికా పరాధీన ప్రాంతాలకు స్వాతంత్ర్యాన్ని యివ్వడానికి చర్యలు తీసుకునే విధంగా దక్షిణాఫ్రికాపై ఒత్తిడి తేవడానికై ఆ దేశానికి పెట్రోలు, నూనె సరఫరాలను అన్ని దేశాలు ఆపుచేయాలని నిర్దేశించిన తీర్మానాన్ని ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఆమోదించింది. ఆ దేశానికి ఆయుధాలు, సైనిక పరికరాల సరఫరాను ఆపుజేయాలనికూడా అన్నిదేశాలను కోరడం జరిగింది. నైరుతి ఆఫ్రికాప్రజల స్వయం నిర్ణయాధికారం, స్వాతంత్ర్యాల పట్ల తమ విశ్వాసాన్ని పునః ప్రకటించి, దక్షిణాఫ్రికా సహాయ నిరాకరణ దృక్పథాన్ని జనరల్ అసెంబ్లీ నిరసించింది. కొంతప్రాంతాన్నిగానీ, మొత్తం ప్రాంతాన్నిగానీ దక్షిణాఫ్రికా తన రాజ్యంలో కలుపుకునేందుకు ప్రయత్నించినచో అట్టి చర్యను దురాక్రమణగా భావించడం జరుగుతుందని జనరల్ అసెంబ్లీ హెచ్చరించింది.

నైరుతి ఆఫ్రికా పూర్వం జర్మనీదేశం వలస ప్రాంతంగా ఉండేది. సంయుక్త రాజ్యాల అధికారంతో దక్షిణాఫ్రికా యీ ప్రాంతం పరిపాలనను కొనసాగిస్తున్నది. యీ ప్రాంతంపై పరిపాలనాధికారాన్ని దక్షిణాఫ్రికానుండి పొందడానికి ఐక్యరాజ్యసమితి చాలాకాలంనుండి విఫల ప్రయత్నం చేస్తున్నది. 

---

### సవరణ

ఈ సంచిక 39 వ పేజీలో (7 వ పంక్తి) "ఆహుతులకై" అన్నదానిని "అహూతులకై" అని (16 వ పంక్తి) "మధ్య"ను "మద్య" గాను. (25 పంక్తి) "ఆ తర్వాత" అన్నచోట "అతిథులకు పాలక మీషనర్ స్వాగతం చెప్పిన తర్వాత" అని చదువుకొనవలెను.

---

## రచయితలు

శ్రీ శ్రీరంగపురం కేశవాచార్య గోషామహల్, హైదరాబాదు.

శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ, సమాచార శాఖామంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవి, అశోకారోడ్డు, న్యూఢిల్లీ.

శ్రీ మానాప్రగడ శేషసాయి, సంస్కృత సహాయ అధ్యాపకుడు, ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల, రాజమండ్రి – 3

శ్రీ పి. ఎన్. వి. రావు, ప్రాంతీయ శాఖాధికారి, పంచవర్ష ప్రణాళికా కేంద్రం, హైదరాబాదు.

శ్రీమతి నూర్ షా......

శ్రీ దండమూడి మహీధర్, ఆకాశవాణి కేంద్రం, హైదరాబాదు.

"చిత్రభాను", జర్నలిస్టు, కోరాడవారివీధి, విజయనగరం – 2

డా॥ సి. నారాయణరెడ్డి, అశోక్ నగర్, హైదరాబాదు – 20

డా॥ బి. రామరాజు, తెలుగురీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

'కొలకలూరి' కె. ఇనాక్, ఎమ్. ఎ: సి – బ్లాకు విద్యార్థుల వసతి గృహం, ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల, అనంతపురం.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, అంబర్ పేట, హైదరాబాదు – 13

శ్రీ అలపర్తి వెంకట సుబ్బారావు, అంగలకుదురు, తెనాలితాలూకా, గుంటూరు జిల్లా.

: గ్రంథ సమీక్ష :

శ్రీ ఎ. ఎల్. నరసింహారావు, సబ్ ఎడిటర్, ఆంధ్ర జనత, హైదరాబాదు.

# బైజాంటైన్ చిత్రకళ



— కె. దివ్యజ్ఞాన సరోజినీదేవి

చిత్రకళచరిత్రలో బైజాంటైన్ చిత్రకళొక మైలురాయి. ప్రాచీన చిత్రకళలకు ఆదిమ చిత్రకళ నాంది కాగా బైజాంటైన్ చిత్రకళ ముగింపైనది. అటుపిమ్మట చిత్రకళలో మరొక నూతన శకమారంభమైనది. అంతేకాకుండ బైజాంటైన్ చిత్రకళ ప్రాచీన చిత్రకళలన్నిటి సమ్మేళనమని కూడ అనవచ్చును. ఈజిప్షియన్, మెసపొటేమియన్, పర్షియన్, సిరియన్, ఆసియన్, గ్రీకు, రోమన్ చిత్రకళలన్నింటి సమ్మేళనమువల్ల జనించినదీ బైజాంటైన్ చిత్రకళ. ప్రాచీన నూతన చిత్రకళల తూర్పుపశ్చిమ చిత్రకళల మిశ్రమ రూపమే ఈ చిత్రకళ. ఈ మేళనములోనే వున్నది దీని ప్రత్యేకత. అన్ని చిత్రకళలను మిళితపరచి తమదైన ఒక ప్రత్యేక చిత్రకళను రూపొందించగలిగిన ఆనాటి బైజాన్షియమ్ చిత్రకారులు ధన్యులు.

ఈ బైజాంటైన్ చిత్రకళలో మరియొక ప్రత్యేకత కూడా వున్నది. క్రైస్తవమతారంభము తరువాత మొదటి ఉత్కృష్టమైన చిత్రకళ యిదేనేమో — అందుచేతనే దీనికి 'ప్రాచీన క్రిస్టియన్ చిత్రకళ' అని మరియొక నామముకూడ వచ్చియుండవచ్చును.

ఇవ్విధముగా ఈ చిత్రకళ ప్రాచీన చిత్రకళల నొండొంటి సంయోగ ఫలితముగుటచే ఇది ఎప్పుడు రూపొందినదీ మనము యిదమిద్ధముగా చెప్పలేము. కొందరీ చిత్రకళ క్రీ. శ. 1 వ శతాబ్దమునుండి 13 వ శతాబ్దము వరకే అలరారినదని అభిప్రాయ పడగా మరికొందరు క్రీ. శ. 9 వ శతాబ్దము పిమ్మటనే రూపొందినదనియు, అంతకు పూర్వపు చిత్రకళను బైజాంటైన్ చిత్రకళగా పేర్కొనుటకు వీలు లేదనియు అభిప్రాయ పడుచున్నారు. కాని నేడనేకులు ఈ చిత్రకళ క్రీ. శ. 4 వ శతాబ్ది ఆరంభము నుండి క్రీ. శ. 15 వ శతాబ్దము వరకుగల మధ్య కాలమున అలరారినదని నిర్ధరించియున్నారు. అయినను క్రీ. శ. 4 వ శతాబ్దమునకు పూర్వమే అనగా క్రీ. శ. 1 వ శతాబ్ది కాలము నాటికే చిత్రకళ చరిత్రలో దీని ఛాయలను మనము చూడగలము. అంతే కాకుండా గ్రీసు, రష్యాలలో 17 వ శతాబ్దపు తుదివరకు ఈ చిత్రకళ నిలచియున్న నిదర్శనములుకూడ అగుపడుచున్నవి. ఏది ఎట్లున్నను క్రీ. శ. 7 వ శతాబ్దమునుండి క్రీ. శ. 12 వ శతాబ్దమువరకు గల మధ్య కాలముననే ఈ చిత్రకళ మహోన్నత దశలో నున్నదన్నది మాత్రము స్పష్టము. మరియు, క్రీ. శ. 6 వ శతాబ్దమున జస్టీనియన్ చక్రవర్తి అధ్వర్యముననే ఈ వివిధ చిత్రకళల సంయోగము సంపూర్తి అయినదన్నది కూడా స్పష్టమే.

ఈ విధముగా బైజాంటైన్ చిత్రకళ ఎప్పుడు వర్ధిల్లినదన్న విషయమేగాక ఎక్కడ అలరారినదన్న విషయము సైతము చర్చనీయాంశమైనది. కొందరీ చిత్రకళ కాన్‌స్టాంటినోపుల్‌కు, దాని పరిసర ప్రదేశములకు మాత్రమే చెందినదని అభిప్రాయపడగా, మరికొందరీ చిత్రకళ యిటు ఇటలీవరకే గాక, అటు సిరియా, ఆర్మేనియాల వరకు కూడ వ్యాపించినదని అభిప్రాయపడుచున్నారు.

బైజాంటైన్ చిత్రకళ ప్రప్రథమములో క్రైస్తవ మత సంబంధమైన చిత్రకళ. ఈ చిత్రకళలో సామాన్య చిత్రకళకు కూడ అప్పుడప్పుడు స్వల్ప స్థానము లభించినప్పటికిని, మత సంబంధమైన చిత్రకళ చేరుకొన్న మహోన్నత స్థాయిని



'రవెన్నా' (6 వ శతాబ్ది) కుడ్య చిత్రం.

మాత్రమిది చేరుకొనలేక పోయినదని పలువురి అభిప్రాయము.

ఇటలీ చిత్రకళను చరిత్రకారులు మూడు దశలగా విభాగించి యున్నారు. ఇందలి మొదటి దశ ఆరవ శతాబ్దమున నారంభమైనది. ఈ దశయందే విగ్రహారాధన కూడదనే ఆందోళన కూడ ప్రారంభమైనది. కానీ ఆందోళన ఒకటి రెండు శతాబ్దముల కాలముననే అణిగిపోయినది. ఈ ఆందోళన వున్నప్పుడు సైతము బైజాంటైన్ రాజ్యములోను, అందును ముఖ్యముగా మారుమూల ప్రదేశములలోను, చిత్రకళా విధానములో పెద్ద మార్పులు రాలేదు. జరిగిన మార్పల్లా దైవ చిత్రపటముల స్థానే వేటచిత్రములు, ప్రకృతి చిత్రములు చిత్రించుటలోనే.

ఈ ఆందోళన అంతముతో అనగా 9 వ శతాబ్దముతో బైజాన్టైన్ చిత్రకళలో 'స్వర్ణయుగము'గా పేర్కొనబడుచున్న రెండవ దశ ఆరంభమైనది. ఈ నాటికీనీ నిలచి యున్న బైజాన్టైన్ చిత్రవర్ణపు పని (Mosaics), దంతపు పని, లోహపు పని, ఎనామిల్ పని, నేత పని మొదలగువన్నియు ఆ కాలమునాటికి చెందినవే. ఇందులకు మొదటి దశకు చెందిన చిత్రకళలన్ని విగ్రహారాధనను ధ్వంసము చేయవలయునన్న అలజడిలో రూపుమాయుటయే కారణము. అందుచేత మనమీ మొదటిదశను గురించి విపులముగా తెలుసుకొనలేకుండా యున్నాము. కొందరు దీనిని మొదటి స్వర్ణయుగముగాను, రెండవ దశను రెండవ స్వర్ణయుగముగాను కూడ పేర్కొని యున్నారు. 13 వ శతాబ్దమునుండి బైజాన్టైన్ చిత్రకళలో ఆఖరిదశ ఆరంభమైనది. ఆనాటి చిత్రకళ కొంతవరకు మతసంబంధమైన కాఠిన్యమును విడనాడి సజీవమైనది. నాటి ప్రజలు తమ పూర్వీకులంతటి ఐశ్వర్యవంతులు కాలేపోవుటచే వారు బంగారువెండి పాత్రలకుబదులు మృణ్మయ పాత్రలతోనూ, యెనామిల్, చిత్రవర్ణపు పని చిత్రములకు బదులు చిత్రపటములతోను, కుడ్య చిత్రములతోను సంతృప్తి చెందవలసి వచ్చినది.

బైజాన్టైన్ చిత్రకారులు తమ చిత్రములందెక్కువగా దైవ మానవ ప్రతిమలనే చిత్రించెడివారు. మరియు ఆ ప్రతిమలనెప్పుడును ముందువైపు నుండే చిత్రించెడివారు. దీనికి కారణము లేక పోలేదు. ఇట్టి ప్రతిమలు చూచువారియందు భక్తిభావము కలిగింప జేయునని వారు నమ్మియుండిరి. ఈ ప్రతిమలందు క్రీస్తుకు, పుణ్యపురుషులకు తలచుట్టు కాంతివలయము చిత్రించెడివారు. చిత్రము నందలి ముఖ్యమైన ప్రతిమల దేహములను, ముఖములను పొడుగుగా చిత్రించెడివారు. వారు క్రీస్తు భగవానుని మొట్టమొదట తేజోవంతుడైన నవయువకునివలెను, అటుపిమ్మట కొంతకాలమునకు పొడుగు వెంట్రుకలును, గడ్డమునువున్న మధ్య వయస్కునిగాను చిత్రించెడివారు. ముఖము పసుపు వన్నెలోవుండి గంభీరముగా ఉండెడిది. ఈ రెండవదే స్వచ్ఛమైన బైజాన్టైన్ క్రీస్తురూపము. మేరీమాతను కోలమొగముతోను, గంభీర వదనముతోను చిత్రించెడివారు. ఇంకను సెంట్ జాన్ ని పొడుగైన గిరజాలతోను, నల్లగడ్డముతోను, సెంట్ పాల్‌ను పొడుగైన తెల్లని గడ్డముతోను, బట్టతలతోను చిత్రించెడివారు. ఆ నాటి చిత్రకారులు వర్ణములను సైతము, చిత్రింపబడే ఆయా వ్యక్తులను బట్టి వాడెడివారు. వారు క్రీస్తు భగవానుని చిత్రించునప్పుడు నీలము, కెంపు, బంగారు వర్ణములను, మేరీ మాతను చిత్రించునప్పుడు నీలి వర్ణమును, సేంట్ పాల్‌ను చిత్రించునప్పుడు ఒక విధమైన ఎఱుపును, నీలి వర్ణమును వుపయోగించెడివారు.

వీరి కుడ్యచిత్రములందలి వెనుక ప్రక్కనున్న ప్రతిమలు ముందున్న ప్రతిమలకన్న నేమాత్రమును చిన్నవిగా వుండెడివికావు. కాకపోతే అవి గోడపైన ముందటి ప్రతిమల కన్నను కొలది ఎత్తులో మాత్రము చిత్రింపబడెడివి.

బైజాన్టైన్ శిల్పులు వాస్తుశాస్త్రమునందు బహు నేర్పరులు. వీరు తమ మందిరములనెక్కువగా యిటుకతోనే నిర్మించినప్పటికిని, రాతిని గూడ వాడిన నిదర్శనములున్నవి. ఒకొక్కక్క సమయమునందు

వారొక్క గోడనే కొంత యిటుకతోను, కొంత రాతితోను కూడ వివిధ నిష్పత్తులలో కట్టెడివారు. ఇంకను వారప్పుడప్పుడు చదురముగా గాని, త్రికోణముగా గాని, డైమెండాకారముగా గాని నున్న చలువ రాతి బండలను కూడ ఈ గోడల నిర్మాణము నందు వుపయోగించెడి వారు.

వీరి గృహములు. రాజసౌధములకన్నను వీరి చర్చీలే, ఎక్కువ ప్రసిద్ధి చెందినవి. ఇందుకు వీరి గృహములు, రాజసౌధములు నేటికి చాలావరకు శిధిలమై పోవుటయు కారణమై యుండవచ్చు, లేదా ఆ నాటి శిల్పులు, వాస్తుశాస్త్రజ్ఞులు తమ నేర్పంతటిని ఈ చర్చీల నిర్మాణములోనే వినియోగించుటయు కారణమై వుండవచ్చు.

వీరి చర్చీలు కేవలము దేవతా మందిరములే గాక, ప్రజలందరు గుమిగూడి ప్రార్థించు స్థలములు కూడ నగుటచే అతి విశాలముగా నుండెడివి. ఈ బైజాన్టైన్ చర్చీల ప్రత్యేకత యేమన క్రింది కట్టడము నలుచదురపు లేదా దీర్ఘ చతురస్రపు ఆకారములో కట్టబడి పైకప్పు మాత్రము గుండ్రటి ఆకారములో నిర్మింపబడెడిది. ఈ విధముగా చదరపు కట్టడములపై గుండ్రని కప్పులను నిర్మించుట సామాన్యముకాదు. ఇట్టి కట్టడములు కట్టుటకు వారు 'పెన్‌డెన్‌టివ్' లను కొద్దిగా వంపుగల త్రికోణములను యిటుకతోగాని, రాతితోగాని కట్టడపు గోడలకును, కప్పునకును మధ్య నిర్మించెడివారు. ఇట్టి 'పెన్‌డెన్‌టివ్'ల నిర్మాణమునందు వీరు ప్రప్రథములు కాక పోయినప్పటికిని, వీటి నింత పెద్దెత్తులో వాడిన వారిలో వీరే ప్రథములు. ఈ గుండ్రటి కప్పులు రెండు విధములుగా వుండెడివి. కొన్ని మరీ ఎత్తుగా బురుజుల వలెను, మరికొన్ని పొట్టిగా గుమ్మటముల వలెను వుండెడివి. ఒక్కొక్కప్పుడు వీరు తమ కట్టడములందు ఒక్క గుమ్మటమునే గాక అయిదు గుమ్మటములను కూడ వాడెడివారు. ఈ గుమ్మటములు శిలువాకారములో నిర్మింపబడెడివి.

బైజాన్టైన్ కట్టడములందు స్తంభములు విరివిగా వాడబడెడివి. ఇవి చలువరాతితో నిర్మింపబడెడివి. వీరు మొట్ట మొదట వీటిని గ్రీకు కొరింథియన్ స్తంభములను పోలి యుండునట్లు నిర్మించెడివారు. కాని కొంత కాలము పిమ్మట వారీ స్తంభముల పైభాగమును అనేక ఆకారములలో చెక్కసాగిరి. ఈ ఆకారములందు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన 'సాంక్‌టో సోఫియా' చర్చియందలి స్తంభములపైన చెక్కబడిన బుట్ట ఆకారము మిగుల ప్రసిద్ధిచెందినది. ఈ చర్చియందలి స్తంభములకు బాగుగ దృఢముగా నుండుటకై క్రిందా పైనా కంచు పట్టీలు కూర్చియున్నారు.

బైజాన్టైన్ చిత్రకళలోని మొదట దశలో ఈ భవనములు అర్ధ చంద్రాకారపు

కిటికీలు కలిగివుండెడివి. ఇట్టి కిటికీలు ఒకొక్కప్పుడు రెండు మూడు ప్రక్క ప్రక్కనే వుండెడివి. అవి ఒకటినుండి మరొకటి మూడంగుళములు వెడల్పుగల సన్నని చలువఱాతి బద్దీలతోగాని, సన్నని స్తంభములతో గాని విడదీయబడేవి. ఈ కిటికీలను వీరు చలువఱాతితోనో, చంద్రకాంతపు ఱాతితోనో, సిమెంటుతోనో, మామూలు రాతితోనో మూసి వాటిపై గుండ్రము, చదరము మొదలగు వివిధాకృతుల ఖాళీలు వచ్చునట్లు చెక్కెడివారు. ఈ ఖాళీలలో ఒక్కొక్కసారి గాజు బిగించెడివారు. పదవ శతాబ్దము పిమ్మట ఈ కిటికీల నిలువు కొలతలు హెచ్చింపబడినవి.

బైజాన్‌టైన్ చిత్రకారులు మొట్టమొదట (మొదటి) రెండు దశలలో తమ చర్చిగోడలను, పైకప్పును వెలుపలి వైపునగాక లోపలి వైపున నలంకరించెడివారు. వీరు చర్చిని దేవుని గృహముగా భావించెడివారు. అందుచేతనే ఈ చర్చిల లోపలిభాగమును ఎంత సుందరముగా నిర్మింపవీలగునో అంత సుందరముగా నిర్మించెడివారు. ఈ విధముగా చర్చిల లోపలి భాగమునే అలంకరించుటకు మరియొక కారణముకూడ కలదు. నిరక్షరాస్యులీ చర్చిలలోపల ప్రార్థనకై గుమిగూడినప్పుడు అక్కడగల చిత్రముల ద్వారా వారు బైబిల్ కథలను బోధనలను క్షుణ్ణముగా తెలుసుకొనుటకు వీలయ్యెడిది.

ఆ కాలపు చర్చిల లోపలి గోడల క్రింది భాగములు కొంత ఎత్తువరకు మెరుగు పెట్టబడిన చలువఱాతి పలకలతో కప్పబడెడివి. అటుపై మిగిలియున్న గోడ భాగములు, కప్పు, వివిధ వర్ణముల గాజు చిత్రవర్ణపు పనితోను, బంగారు పూతతోను అలంకరింపబడెడివి. గుండ్రని కప్పుపై ఈ గాజు చిత్రవర్ణపు పని కాంతి రేఖలను ప్రతిబింబించుచు అతి మనోహరముగా నుండెడివి. ఈ చిత్రములన్నియు మత సంబంధమైన చిత్రములే. పదునైదవ శతాబ్దమునుండి బైజాన్‌టైన్ చిత్రకారులు తమ చర్చిల వెలుపలి భాగమును కూడ టెంపరా చిత్రములతోను, తైలవర్ణ చిత్రములతోను, చెక్కడపు పనితోను అలంకరించసాగిరి. ఈ చిత్రములు కూడ మత సంబంధమైనవే. ఒక్కొక్కసారి గోడలయందు అందముగా నుండుటకై మెరుగు పెట్టబడిన మృణ్మయ పాత్రలను కూడ బిగించెడివారు.

గ్రీకు చిత్రకళలో శిల్పమునకున్న స్థానము బైజాన్‌టైన్ చిత్రకళలో చిత్రవర్ణపు పనికి కలదు. క్రీ.శ. 4 వ శతాబ్దినుండి క్రీ. శ 14 వ శతాబ్దము వరకు వీరు తమ మందిరములను, అందును ముఖ్యముగా చర్చిలను అలంకరించుటకు ఈ చిత్రవర్ణపు పనినే ఎక్కువగా వాడెడివారు. ఈ పనియందు చిన్న చదరపు గాజుముక్కలుగాని, ముత్యపుచిప్ప బిళ్ళలుగాని, సున్నము, యిసుక (నీటితో) కలిపి చేయబడిన సిమెంటులో చక్కటి చిత్రములేర్పడునట్లు బిగింపబడెడివి. ఈ చిత్రములన్నియు బైబిలులోని కథలకు సంబంధించినవిగా వుండెడివి. అక్కడక్కడ వేట చిత్రములు చిత్రింపబడినను అవి కూడ మతసంబంధమైన సాంకేతిక చిత్రములే అయి వుండవచ్చని పలువురి అభిప్రాయము. ఆనాటి చిత్రకారులు ప్రాచీన చిత్రకారులవలె గాక తమ చిత్రములందు జంతువుల కెన్నడును ప్రాముఖ్యతనివ్వలేదు. అవి కేవలము సాంకేతిక చిత్రీకరణకే వుపయోగపరచ బడెడివి. కడకు వారు తమ చిత్తరువులందలి పరిసరములను, ప్రకృతిని కూడ మత సంబంధమైన సాంకేతిక చిత్రీకరణ కొరకే వుపయోగించెడివారు. ఇంకను వారొక్కొక్కసారి, యీ చిత్రవర్ణపు పనితోనే మనుష్యుల యథాతథ రూపములను (Portraits) సైతము చిత్రించెడివారు. ఇట్టి పెద్ద చిత్రములు చిత్రించుటకు వీలులేని చర్చిలందలి మరీ చిన్న స్థలములను ఈ చిత్రవర్ణపు పనితోనే అనేక చిత్ర విచిత్రమైన మాదిర్లతో అలంకరించెడివారు. ఈ విధముగా వారు చర్చిలందలి ప్రతి గోడను ఈ చిత్రవర్ణపు పనితోనే నింపెడివారు.

సాధారణముగా పుణ్యపురుషులను చర్చి గోడల పైభాగమునను, క్రీస్తు భగవానుని నడికప్పునను, క్రైస్తవ మతమును వ్రాసిన నలుగురు యివాన్‌జిలిస్టులను నాలుగు పెన్‌డిన్‌టివ్‌ల పైనను, బైబిలుకథలను గోడల మధ్య భాగమునను, సాధువుల జీవిత చరిత్రలను గోడల క్రింది భాగములందును చిత్రించెడివారు. మరియు ఈ బైజాన్‌టైన్ చిత్రకారులు మొట్టమొదటి చిత్రవర్ణపు పనిని తెల్లగోడలమీదనే చేసెడివారు. అటుపిమ్మట కొంత కాలమునకు నీలివర్ణపు గోడలమీద చిత్రింప సాగిరి. ఇంకను కొంతకాలమునకు ఈ నీలివర్ణపు గోడలస్థానే (ఈ చిత్రవర్ణపు పని చేయబడిన) బంగారు ఛాయగోడలు వాడుకలోనికి వచ్చినవి. ఈ బంగారువన్నె, దానిపై చిత్రింప బడిన వివిధ వర్ణముల చిత్రవర్ణపు పని కనులు మిరుమిట్లు గొలిపేటట్లువుండి, నాటివారికి వర్ణము లందుండు ప్రీతిని వేనోళ్ళ చాటుచుండును.

బైజాన్‌షియమ్‌లో కుడ్యచిత్రముల చిత్రీకరణ రోమ్‌నందలి శవములు పాతిపెట్టు 'లోవల' చిత్రీకరణతో ప్రారంభమైనదని చెప్పవచ్చు.(కాని ఈఆచారము బైజాన్‌టైన్ రాజ్యములో ఎక్కువకాలము వాడుకలో నుండలేదు) ఈ చిత్రములు ఫ్రెస్కో విధానమున చిత్రింప బడినవి. ఈ చిత్రములు సాధారముగా సాంకేతిక చిత్రములే అయి వుండెడివి. వీరు క్రీస్తు భగవానుని తెలుపుటకు పడవను, లేదా ద్రాక్ష తీగెను, ఆశ, నమ్మకములను తెలుపుటకు లంగరును, ఆత్మను తెలుపుటకు పావురమును, శాశ్వతత్వమును తెలుపుటకు నెమలిని, విజయ చిహ్నముగా తాళవృక్ష కొమ్మను ఈ చిత్రములందు చిత్రించి యున్నారు. కానీ యీ చిత్రములందలి చిత్రకళ అంత వున్నతమైనది కాదు. ఇందులకీ చిత్రము లెట్లును చీకటిలో పడివుండేవే గదా ! అనవసరశ్రమ యెందులకు ? అన్న ఆనాటి చిత్రకారుల తలంపే కారణమై వుండవచ్చు. ఈ చిత్రములు తప్ప బైజాన్‌షియమ్‌లోని చిత్రము



సేన్ టొమ్మసో అంతర్భాగం (క్రీ. శ. 5, 6 శతాబ్ది)

లన్నియు 'టెంపరా' చిత్రములో, తైలవర్ణ చిత్రములోనై వున్నవి. ఈ 'టెంపరా' విధానమందు చిత్రించుటకు ముందు గోడను గచ్చుచేయు విధానము ఒకొక్క ప్రాంతమందు ఒకొక్క మాదిరిగా వుండెడిది. ఈ కుడ్యచిత్రములందుకూడ మానవ ప్రతిమలకే ఎక్కువ ప్రాముఖ్యత నివ్వబడినది. మృగములు కేవలము సాంకేతిక చిత్రీకరణకు వుపయోగపరచ బడినవి. ఒకొక్కప్పుడు ఈ చిత్రములందు మానవ ప్రతిమల వెనుక వైపున పలువిధ భవనములు చిత్రింప బడెడివి. ఈ చిత్రములందు ప్రాచీన చిత్రములందువలెగాక వెలుగు నీడల చిత్రీకరణ విధానముకూడా అవలంబింప బడినది.

బైజాన్‌టైన్ వ్రాతప్రతులు రెండువిధములగా వుండెడివి. కొన్ని ఒకచే పొడువుగా చుట్టుటకు వీలగు నట్లును, మరి కొన్ని బైండు చేయబడిన పుస్తక రూపములోను వుండెడివి. ఈ మొదటిరకపు వ్రాతప్రతులు బైజాన్‌టైన్ రాజ్యములో మొదట వాడుకలో వున్నను రాను రాను రెండవరకపు వ్రాతప్రతులే ఎక్కువగా వాడుకలోకి రాసాగినవి. వారి వ్రాతప్రతులకు మొట్టమొదటచర్మముతో చేయబడిన కాగితమునే వుపయోగించెడివారు. అటుపిమ్మట అనగా యెనిమిదవ శతాబ్దములో మామూలు కాగితము వాడుకలోకి వచ్చినది. పదవ శతాబ్ది అనంతరమిది విరివిగా వాడబడెడిది.

ఇట్టి వ్రాతప్రతులందు ఆనాటి చిత్రకారులు అందు వ్రాయబడినదానిని విపులీకరించుచు చిత్రములు గీయుటయేగాక, ఆ ప్రతులందలి ప్రధాన వాక్యములను సైతము తమ చిత్రలేఖనముతో చక్కగా అలంకరించెడివారు. ఈ వ్రాతప్రతుల చిత్రములు చాలావరకు నేటికింకను నిలచియున్నవి. ఈ చిత్రములందింకను ఆనాటి చిత్రకారులప్పుడప్పుడు మనుష్యుల యథాతథ రూపములను కూడ చిత్రించెడివారు. విగ్రహారాధన కూడదన్న రోజులలో ఈ వ్రాతప్రతి చిత్రములు చిన్న చిన్న రేఖాచిత్రముల రూపములో నుండెడివి.

క్రీ. శ 5 వ శతాబ్దినాటి వ్రాత ప్రతులు సాధారణముగా ధూమ్రవర్ణములో వుండెడివి. వీటిపై ఆనాటివారు బంగారక్షరములతో చక్కగా వ్రాసెడివారు. చిత్రములను పుటల క్రిందిభాగమున పలు వర్ణములలో చిత్రించెడివారు. చిత్రములందలి మానవ రూపములు స్థలాభావముచే పొట్టిగా చిత్రింప బడెడివి. కాని కొన్ని శతాబ్దముల పిమ్మట వ్రాతప్రతులందు వాడబడే వర్ణములలో కొన్ని మార్పులువచ్చినవి. చిత్రకారులీ చిత్రములను ధూమ్రవర్ణము మీదగాక బంగారు వర్ణముమీద చిత్రింప సాగిరి. బంగారు వర్ణము దీనికేగాక, ఆ చిత్రములందలి మానవ ప్రతిమల వస్త్రములకు, నగలకు సైతము వుపయోగ పరచ బడెడిది.

ఈ బైజాన్‌టైన్ చిత్రకారులు చాటములలో బిగింపబడిన చిత్రపటములను

(Panels) కూడ చక్కగా చిత్రించెడివారు. కానీ యీ చిత్రకళ క్రీ. శ 12 వ శతాబ్దము నకు పూర్వము అక్కడ వాడుకలో నున్న నిదర్శనములు లేవు. ఇందుల కంతకు మునుపు చిత్రంపబడిన చిత్రములన్నియు రూపు మాయుటయైన కారణమై వుండవచ్చు. లేదా పండ్రెండవ శతాబ్దిపూర్వము బైజాన్ టైన్ ప్రజలు అపార సిరి సంపదలతో తులతూగు చుండుటచే వారీ రకపు చిత్ర ములకన్న చిత్రవర్ణపు పనికల చిత్రముల పైననే యెక్కువ మోజుచూపుట కారణమై వుండవచ్చు. ఆనాటి చిత్రకారు లీ చిత్రము లను చట్రములలో బిగించి, గార రుద్దబడిన [illegible] గుడ్డపై '[illegible]' [illegible] మరి అటువంటిదే మరియొక విధానమునో చిత్రించెడివారు.

బైజాన్ టైన్ చిత్రకళలో చిత్ర కళకున్న ప్రాధాన్యత శిల్పమునకు లేదేమో. ఏది ఎటు లైన ఈ నాటికింకను నిలిచియున్న శిల్పములు బహు కొద్ది. ఆనాటి శిల్పులు విగ్రహ ముల మలచుట కన్నను చెక్కడపుపననే యెక్కువగా చేసెడివారు. జాతిపై అందును ముఖ్యముగా చలువజాతి స్తంభములపై మానవమృగ, పక్ష్యాదుల ప్రతిమలనే గాక లతలను, పుష్పగుచ్ఛములను, కడకు రేఖా చిత్రములను సైతము చక్కగా చెక్కెడి వారు. ఈ బొమ్మలు సాధారణముగా పర్షియా నుండి దిగుమతి చేయబడిన వస్త్రములందలి బొమ్మలను మాదిర్లను పోలియుండెడివి. ఒక్కొక్క పర్యాయము ఆనాటి శిల్పులీ చిత్ర ములను లోతుగాచెక్కి, చెక్కి వేయబడిన ప్రదేశమును పలువర్ణపు రాళ్ళతోగాని వర్ణపు చూర్ణములతోగాని పొదిగెడివారు.

ఈ శిల్పులు చెక్కపై కూడ చక్కగా చెక్కెడివారే గానీ నేడవి కూడ చాలవరకు రూపుమాసి యున్నవి. వీరు ముఖ్యముగా చెక్క తలుపులమీద, చర్చిసామాను మీదను చెక్కెడివారు. ఇప్పటికిని నిలచియున్న రోమ్‌నందలి 'సాంటాసబీనా' (క్రీ.శ. 5వ శతాబ్దమునకు చెందినది) గవాక్షములపై బైబిలు కథలు చక్కగా చెక్కబడియున్నవి.

వీరు దంతముపై కూడ చక్కగా చెక్కెడివారు. వీరీ దంతమును కుర్చీ బల్లలపైన బిగించుటకు, ఆభరణములకు, విలువైన వస్తువులు పెట్టుకొనే చిన్న పెట్టెలు, కొమ్ముల తయారీకినీ, పుస్తకపు అట్టలకును వాడెడివారు. వీటిలో దీర్ఘ చతురస్రాకారపు పెట్టెలు (విలువైన వస్తు వులు పెట్టుకొనుటకు) యెక్కువగా వాడుకలో నుండెడివి. వీటిపై గూడ ఆనాటి చిత్రకారులెక్కువగా మత సంబంధమైన చిత్రములనే చిత్రించినప్పటికి అప్పు డప్పుడు సామాన్య చిత్రములను సైతము చిత్రించెడివారు. బహుశః మతసంబంధమైన చిత్రములుగల దంతపు పెట్టెలు చర్చిల వాడుకకును, సామాన్య చిత్రములుగల దంతపు పెట్టెలు సామాన్య ప్రజల పెండ్లి పేరంటములలో వాడుకకును నై వుండ వచ్చు. వీటిలో సామాన్య చిత్రములెక్కువగా పర్షియన్ వస్త్రములందలి బొమ్మలను పోలి యుండెడివి.

వీరు దంతముతో చేయబడిన కొమ్ములపై కూడ మత సంబంధమైన చిత్రములనేగాక, సర్కస్ చిత్రములు, మృగముల చిత్రములు (ఇవి పెద్ద వలయముల లోపల చిత్రింప బడెడివి), మొదలగు సామాన్య చిత్రములను కూడ చిత్రించెడివారు. ఇందలి మత సంబంధమైన చిత్రములు గల కొమ్ములు చర్చిలలో వాడుకకు, సర్కస్ బొమ్మలు గల కొమ్ములు సర్కసు వాడుకకు మృగముల చిత్రములుగల కొమ్ములు వేటకు వుపయోగ పరచబడి యుండవచ్చు. ఈ విధముగా ఈ దంతములపై చెక్కినపిమ్మట వాటి కానాటి చిత్రకారులు వర్ణములు కూడ పూసిన నిదర్శనములున్నవి.

క్రీ. శ 11వ శతాబ్ది అనంతరము బైజాన్ టైన్ శిల్పులు యెముక మీద కూడ చక్కగా మృగపక్ష్యాదులను రేఖాచిత్రములను (Geometrical designs) చెక్కసాగిరి. ఇవి సాధారణముగా చిన్న చెక్కపెట్టెలకు కూర్చబడెడివి. ఆనాటి శిల్పులింకను 'వాల్ రస్' (ఒకవిధమైన సముద్రపు జంతువు) దంతములపై కూడ చక్కగా చెక్కెడివారు. సాధారణంగా శిలాకారములో చెక్కబడి గొలుసులకు పతకములుగా నుపయోగ పరచ బడెడివి. పదవ శతాబ్ద్యనంతరము ఖరీదైన రత్నములపై సైతము చెక్కడపుపని చేయ బడెడిది.

బైజాన్‌షియంలో క్రీ. శ 6, 7 శతాబ్ద ములకు పూర్వమునుండే లోహపు ప్రతిమలు, పాత్రలు తయారు చేయబడుచున్నను, [illegible] (క్రీ. 7 [illegible]) యివేగాక పుస్తకములకు లోహపు అట్టలు, ఆభరణములందుపయోగింపబడే లోహపు రేకులు, కంచు తలుపులు మొదలగునవి అనేకములుకూడ తయారుచేయబడసాగినవి. వీటన్నిటిని ఆనాటి శిల్పులు మత సంబంధ మైన చిత్రములతోను, (శిలువ ఆకారము తరచుగా వాడబడెడిది) చక్కటి మాదిర్ల లోను, అలంకరించెడివారు.

వీరు వెండితో చక్కటి పాత్రలను, పళ్ళెరములను, గరిటెలను, కప్పులను చేసెడివారు. వీటిని మామూలు నగిషీ పని తోనేగాక, అప్పుడప్పుడు ఖరీదైన రాళ్ళ తోను, యెనామిల్‌తోను కూడ అలంక రించెడివారు.

బైజాన్ టైన్ ప్రజలకు ఆభరణము లందు పెద్ద మోజు లేకపోయినను బంగారు, వెండి, రాగి, కంచు మొదలగు లోహ ములతో చక్కటి ఆభరణములనే చేసెడి వారు. వీటిని రాళ్ళతో శిలువవంటి మత సంబంధమైన సాంకేతిక ఆకారములలో పొది గెడివారు. ఆనాటి నాణ్యములపై సైతము వారొకప్రక్క యిటువంటి మతసంబంధ మైన సాంకేతిక చిత్రములను, మరియొక ప్రక్క ఆనాటి చక్రవర్తుల రూపములను చెక్కెడివారు. ఇంకను వారు సీసపు ముద్రలపై గూడ క్రీస్తు భగవానునో, మేరీ

మాతనో, సాధువులనో, లేదా లిపినో అందముగా చెక్కెడివారు.

క్రీ. శ 4 వ శతాబ్దినాటికే బైజాన్‌టైన్ చిత్రకారులు యెనామిల్ పనియందు సైతము బహునేర్పు గలిగి యుండిరి. ఆనాడు నగలే గాక చిత్రములు సైతము యెనామిల్ పూత చేయబడుచుండెడివి. ఈ యెనామిల్ పని చేయుటకై వారు దళసరి బంగారు రేకులపై సన్నని బంగారు తీగెలతో గదులవలె విభజించెడివారు. ఈ బంగారు తీగెలను కావలసిన ఆకారములలో వంచెడివారు. పదకొండవ శతాబ్దిలో ఈ తీగెలు ఒక మిల్లీ మీటరు ఎత్తున వుండేవి. కాని పదమూడవ శతాబ్దము నాటికి వీటి ఎత్తు రెండు మిల్లీ మీటర్లు పెరిగినది. పైన చెప్పబడిన విధముగా చిన్నగదులు యేర్పరచిన తరువాత వాటిని గాజుపొడితో చేయబడిన ఎనామిల్‌తో (వేడి సహాయముతో) నింపెడివారు. ఈ యెనామిల్ పూత వివిధ వర్ణములలో వుండెడిది. 8 వ శతాబ్దమునకు పూర్వము వారీ పనియందు నిండునీలము, పచ్చధూమ్ర వర్ణము మొదలగు ముదురు వర్ణములనే వుపయోగించెడివారు. వీరు వెంట్రుకలకు ధూమ్రవర్ణమును, శరీరమునకు కొద్దిగా పచ్చకలిసిన ఛాయనో, మైనపు ఛాయనో వాడెడివారు. కాని క్రీ. శ 10 వ శతాబ్దానంతరము వీ రింకను చక్కటి వర్ణముల నుపయోగించ సాగిరి. లేత నీలము, వైడూర్య నీలము, వూదా, పాటు వర్ణము మొదలగు వర్ణము లన్నియు వాడుకలోనికి వచ్చినవి. పండ్రెండవ శతాబ్దము నాటికి తెలుపు, వైడూర్య నీలము యెక్కువగా వాడబడుచుండెడివి. మిగిలిన లేతవర్ణములు, ఎఱుపు అతి స్వల్పముగా వాడబడుచుండెడివి. ఈ కాలమునందే యెనామిల్ పూత చేయుటకు బంగారు రేకు బదులు రాగి రేకు వాడుకలోకి వచ్చినది. కాని నాటి పనితనమంత చెప్పుకోతగినది కాదు.

ఈ యెనామిల్ పూతను సైతమానాటి వారు యెక్కువగా మత సంబంధమైన చిత్రములకే వుపయోగించినను, అప్పుడప్పుడు సామాన్య అలంకరణకు కూడ వుపయోగించెడివారు.

బైజాన్‌టైన్ నేతవస్త్రములు సైతము కళాత్మక వస్తువులే. వీటి యందు మత సంబంధమైన చిత్రములేగాక పలురకముల పక్షులు, (ముఖ్యముగా డేగ) వింత మృగములు, మీనములు, గుఱ్ఱపుసవారీలు, పుష్పములు, పలువిధ పండ్లబుట్టలు, రేఖా చిత్రములు కూడ నేయబడుచుండెడివి. ఒకొక్కప్పుడీ చిత్రములనే వీరు తమ వస్త్రములపై కుట్టెడివారు కూడ. బైజాన్‌టైన్ చిత్రకళలో ఈ వస్త్రముల ప్రాముఖ్య మెట్టిదన ఆనాటి చిత్రకారులు, శిల్పులు సైతము ఈ వస్త్రములందలి చిత్రములను తరచుగా తాము కూడ అనుకరించెడివారు.

బైజాన్‌టైన్ ప్రజలు మొట్టమొదట నేత పనిగాని, కుట్టుపనిగాని నార పట్టుపై వున్నితో చేసెడివారు. అటుపిమ్మట కొంత కాలమునకు పట్టు వాడుకలోకి వచ్చినది. మొట్టమొదట ఈ పట్టులో ధూమ్రవర్ణమునే యెక్కువగా వాడెడివారు. కాని త్వరలోనే యితరవర్ణములుకూడ వాడుకలోనికి వచ్చినవి. వీరీ వస్త్రములందు కూడ బంగారు వన్నె నెక్కువగా వాడెడివారు. ఈ విధముగా నేయబడిన ఈ వస్త్రములను ధరించుటకేకాక రాజసౌధములలోను, చర్చీలలోను పరదాలవలె వాడుటకు కూడ నుపయోగించెడివారు. ఇంకను నాటివారు ధనవంతులు ధరించే వస్త్రములపై పలువర్ణముల ఖరీదైన రాళ్ళతో యెంతో అందముగా అనేక ఆకారములలో కుట్లు కుట్టెడివారు.

వీరు వస్త్రములపై సద్దకముకూడ చేసెడివారు. కావలెననుకొన్న ఆకారములను మొదట వస్త్రములపై చిత్తుగా గీసి వాటిపై మైనము పూసెడివారు. అటుపైన ఆ వస్త్రములను ఎఱుపు వర్ణములోనో, ధూమ్ర వర్ణములోనో ముంచెడివారు. మైన మున్న చోటున మాత్రము బట్టకారంగు పట్టెడిది కాదు. అటుపిమ్మట మైనమునంతటిని గోకివేసెడివారు. ఈ విధముగా తయారైన వస్త్రము, కొంత మేర ఆ వస్త్రపు పూర్వపు రంగులోను మరికొంత మేర ఎఱుపు లేక ధూమ్రవర్ణములోను వుండి చూచుటకతి సుందరముగా నుండెడిది.

వీరు గాజు సామానును, మృణ్మయ పాత్రలనుకూడ చేసెడివారు. బైజాన్‌టైన్ రాజ్యములో మృణ్మయ పాత్రలకన్నను ముందు గాజు సామానే వాడుకలో నుండెడిది. వారు పాత్రలు, గ్లాసులు, సెంటుపోయుటకై అతి సన్నని మూతిగల సీసాలు, దీపములు మొదలగు వాటిని తెల్ల గాజుతోనేగాక నీలము, ఎఱుపు మొదలగు పలు వర్ణముల గాజుతో కూడ చేసెడివారు. ఈ గాజు సామాను రెండు విధములుగా వుండెడిది. కొన్ని మందమైన గాజుతో చేయబడెడివి. వాటిపై చిత్రము లుండెడివి. మరికొన్ని గాజు సామానులకు పీఠములు మాత్రము మందముగా వుండెడివి. అందుచే ఈ రకపు గాజుపాత్రలందు పీఠముల మీద మాత్రము చిత్రములుండెడివి. ఈ బొమ్మలు సాధారణముగా చిన్న చిన్న మానవ జంతు పక్ష్యాదుల బొమ్మలై వుండెడివి. ఇట్టి గాజు సామాను క్రీ. శ 4 వ శతాబ్దమునుండి 8 వ శతాబ్దము వరకు ఎక్కువగా వాడుకలో వుండెడివి. ఆ కాలమునాటికే కొద్దిగా అక్కడక్కడ ఎట్టి మృణ్మయ పాత్రలు వాడుకలోనున్న నిదర్శనము లున్నప్పటికిని తొమ్మిదవ శతాబ్దానంతరమే పలువిధ మృణ్మయపాత్రలు వాడుకలోకి వచ్చినవి.

వీటిలో మొట్టమొదటి మృణ్మయ పాత్రలు ఒకరకమైన తెల్లటి మట్టితో చేయబడి మెఱుగు పెట్టబడెడివి. ఈ మెఱుగుపెట్టే పదార్థము ఆ మృణ్మయ పాత్రలపై తరుచుగా లేత పసుపుపచ్చరంగులోకి మారెడిది. ఈ పదార్థ మొకొక్కసారి ముదురుపచ్చ వర్ణములో కూడ వుండెడిది. ఈ పాత్రలపై మెఱుగు పెట్టకముందే వాటిపై కావలసిన చిత్రములు చిత్రింపబడెడివి. ఈ చిత్రింపు విధానము మూడు విధములుగా వుండెడిది.

ఇందు మొదటి విధానము ప్రకారము వారు వేయదలచుకొన్న చిత్రములను ఈ తెల్లని పాత్రలపై తడి యారక ముందే యేదైన పనిముట్టుతో గీసెడివారు, లేదా ఆ పాత్రలపై ఆ చిత్రములను ముద్రించెడివారు. ఇక రెండవ విధానము ప్రకారము చిన్ని తడి మట్టి ముద్దలను కావలసిన ఆకారములలో ఈ పాత్రలపై విడిగా అతికించెడివారు. ఇవి నేడు 'పూరేకుల' పాత్రలగా పేర్గొన బడుచున్నవి. వర్ణములతో ఈ మృణ్మయ పాత్రల మీద చిత్రించుట మూడవ విధానము. వీరు వాడిన మొట్టమొదటి వర్ణములు మట్టిరంగు, పచ్చ వర్ణములు. క్రీ. శ 10 వ శతాబ్దానంతరము ఈ వర్ణములే గాక నిండు [illegible] ఎఱ్ఱటి ఎఱుపు, కడకు బంగారు, వెండి ఛాయలు సైతము వాడుకలోకి వచ్చినవి. వీరు వెండి బంగారు ఛాయలను మాత్రము రెండిటినే ఒకే పాత్రపై వాడెడివారు కాదు.

క్రీ. శ 12 వ శతాబ్దమునాటికి వీరి తెల్ల మృణ్మయ పాత్రలతోపాటు యెఱ్ఱమృణ్మయ పాత్రలను కూడ చేయ మొదలిడిరి. పదునాలుగవ శతాబ్దము నాటికి తెల్లమృణ్మయ పాత్రల స్థానమును పూర్తిగా ఆక్రమించుకొన్నవి. ఈ పాత్రలపై ఆ నాటి వారు ముందు తెల్లటి వర్ణముగల ఒక పదార్థమును పూసి, దానిపై చిత్రింపదలచుకొన్న ఆకారముల ప్రకారము ఆ బొమ్మల మేరకు అవసరమును బట్టి సన్నని పనిముట్టుతోగాని, మందమైన పనిముట్టుతోగాని గోకివేసెడివారు. దీనితో తెలుపు వర్ణము పూయబడిన ఆ పాత్రలపై ఎఱ్ఱటి చిత్రము తేర్పడెడివి. ఒకొక్క సారి ఆకారములను (చిత్రములను) తెలుపులోనే వుంచి మిగిలిన తెల్లటి భాగమునంతటిని గోకి వేసెడివారు. అప్పుడు ఎఱ్ఱటి [illegible] డెడివి. ఈ విధముగా పాత్రలపై బొమ్మల చిత్రీకరణానంతరము వాటిని మెఱుగుపెట్టెడివారు. ఈ మెఱుగుపెట్టెడి పదార్థములుగూడ పలు వర్ణములలో వుండి పాత్రలందలి ఎఱుపు భాగముపై ఒక ఛాయలోను, తెలుపు భాగముపై మరియొక ఛాయలోను కనపడెడివి. వీ రెక్కువుగా వాడిన ఒక వర్ణపు మెరుగులో ఈ పాత్రల తెలుపు భాగము లేత పసుపురంగులోకి, ఎఱ్ఱటి భాగము ముదురు మట్టిరంగులోకో, నలుపు వర్ణములోకో మారెడిది.

ఇట్టి బైజాన్టైన్ మృణ్మయ పాత్రలపై మానవ రూపములేగాక, జంతు పక్ష్యాదుల రూపములు, పుష్పములు, లతలు, కడకు 'కూఫిక్' లిపి సైతము చిత్రింపబడెడిది. ఇంకను నాటివారీ పాత్రలపై మరియొక చిత్రమైన అలంకరణకూడ చేసెడివారు. వీరా పాత్రలపై పలు వర్ణములు పోసి తడియారకముందే బాగుగా కుదించెడివారు. దానితో వర్ణము లన్నియు నందు [illegible]టితో నొకటి మిళితమైపోయి చూచుట కతి రమ్యముగా నుండెడివి. నేడవి 'చలువరాతి' పాత్రలుగా పేర్గొనబడుచున్నవి.

బైజాన్టైన్ ప్రజలు మట్టితో పాత్రలనే గాక చిన్న చిన్న పెంకులను కూడ చేసెడివారు. ఇవి కొన్ని ఒక అంగుళపు చదరములో నుండెడివి. మరికొన్ని 10″ పొడవు 4″ వెడల్పు కలిగి కొద్దిగా వంగియుండెడివి. ఆ నాటి వారీ మట్టిపెంకులను కట్టడములకు చిత్రముల చట్రములకు వుపయోగించుటయేగాక, కేవలము వాటితోనే చిత్రములను సైతము తయారు చేసెడివారు. ఇది ఎట్లన ఒకొక్క పెంకుపైన చిత్రింపదలచుకొన్న చిత్రపు భాగములను చిత్రించి, ఆ పెంకులన్ని క్రమ ప్రకారము కూర్చి చక్కటి చిత్రములను తయారు చేసెడివారు.

ఇట్టి చిత్రకళను, కేవలమది మత సంబంధమైన చిత్రకళన్న ఒక్క విషయము మాత్రము మరచి పరీక్షించిన వారెవరికైన దాని యందలి విశిష్టత గోచరింపక మానదు.



పక్షి ఆకారంలోవున్న మృణ్మయపాత్ర (క్రీ. శ. 11 వ శతాబ్దం)



# వెలుగు బాటలు

ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్నం జిల్లా షెడ్యూలు ప్రాంతాలలో పోడు వ్యవసాయం విస్తారంగా జరుగుతుంది. క్రీస్తు పూర్వం మూడువేల సంవత్సరాలనుంచే ఈ పద్ధతి ఆచరణలో వున్నట్లు తెలుస్తున్నది. ఆఫ్రికా, ఆస్ట్రేలియా, చైనా, ఇండోనీషియా, గ్వినియాదేశాలలో ఈ సేద్య విధానం అమల్లో వున్నట్లుకూడా ఆధారాలు వున్నాయి. ఈ సేద్యవిధానం కొండజాతుల వారికి ఒక జీవనమార్గం, వారి సంస్కృతిని వెల్లడించే ఒక అంశం. భారతదేశంలోని బైగ, నాగా, భేరియా, మురియా, గోండులు మొదలైన కొండజాతులవారు దీనినే దవా, [illegible] అని అంటారు. అనేక సంవత్సరాలుగా ఈ వ్యవసాయ విధానం వివాదగ్రస్తమైన అంశంగా వుంటున్నది. అటవీ విషయాలకు సంబంధించిన జాతీయ విధానం, నదీలోయ ప్రాజెక్టులదృష్ట్యా ఈ అంశానికి గొప్ప ప్రాధాన్యత లభించింది. పోడు వ్యవసాయం కొండజాతి ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు సంబంధించిన సమస్య. నాగరికత అనేది మొదట వ్యవసాయంనుంచే ప్రారంభమైందనీ, పరిసరాలు, అలవాట్లు మానవసమాజం వికాసంపై చెప్పుకోదగినంత ప్రభావం పడనిస్తాయనే విషయం అందరికీ తెలిసిందే. బ్రిటిష్‌వారి పరిపాలనా హయాములో కొండజాతులవారు ఒంటరి జీవితం గడిపినట్లూ, మార్పుల ప్రభావం ఈ ప్రాంతాలపై అంతగా ప్రసరిల్లనట్లూ వీరి చరిత్ర వెల్లడిస్తుంది.

గిరిజనులకు భూమి దున్నడానికి ఎద్దులు వుండవు. నీటిపారుదల సౌకర్యాలు సరిగా వుండవు. ఎరువులు మొదలైనవికూడా వారికి అందుబాటులో వుండవు. అందుచేత ప్రకృతిసిద్ధమైన కొండవాలులను ఆధారం చేసుకొని తదనుగుణ్యంగా తమ ఊహతో వారు ఒకవిధమైన వ్యవసాయం సాగిస్తారు. దీనికే "పోడు" వ్యవసాయం అని పేరు. ఏజెన్సీ ప్రాంతాలలోని ఇబ్బందికరమైన పరిస్థితులలో ఆచరణయోగ్యమైన విధానం ఇది ఒక్కటే. వారు కలుపుమొక్కలను, చిన్న చిన్న చెట్లను కాల్చివేస్తారు. అయితే మొదళ్ళను మాత్రం పెకిలించివేయరు. చెట్లు చేమల బూడిద నేలకు మంచి బలమనీ, అది భూసారాన్ని పెంచుతుందనీ వారి నమ్మిక. వర్షపు నీటికి కొట్టుకొనిపోకుండా వుండడానికి వర్షాకాలం ఆరంభంకావడానికి పూర్వమే విత్తనాలు వేస్తారు. వర్షాలు ఆరంభం కావడంతో గింజలు మొలకెత్తడం ప్రారంభమవుతుంది. ఖరీఫ్ ఋతువులో 'సమాయ్' అనే ఒకరకం జొన్నను విరివిగా పండిస్తారు. కొండజాతివారికి ఈ ధాన్యమే ముఖ్యమైన ఆహారం. వాసియాలు తయారు చేయడానికికూడా దీనిని కొండజాతి ప్రజలు ఉపయోగిస్తారు. ఖరీఫ్ ఋతువులో జొన్న, రాగి, కందులు మొదలైన ఇతర ధాన్యాలను కూడా పండిస్తారు.

ఎక్కువ ఏటవాలుగా వుండి 'పోడు' సేద్యానికి అనువుగాలేని స్థలాలలో కొండ జాతులవారు రాళ్ళను కట్టలుగా పేర్చి పైమన్ను కొట్టుకొనిపోకుండా చేస్తారు.

మూడుసంవత్సరాలు గడిచాక వీరు తాము సేద్యంచేస్తున్న స్థలాలను వదిలిపెట్టి కొత్త స్థలాలకు వెళ్తారు. ఈ ప్రకారం వీరు ఒక స్థలంనుంచి మరోస్థలానికి తరలివెళ్తూ సేద్యం సాగిస్తుండడంవల్ల అనేక కొండలు వృక్షాలు లేకుండా మోడివిగా రూపొందాయి. కొండ జాతివారు వేసిన కొద్దిపాటి పైర్లలోమాత్రమే అవి కనిపిస్తాయి. ఈ విధంగా కొండల శోభ ధ్వంసంకాసాగింది.

'పోడు' వ్యవసాయ పద్ధతి కొనసాగడానికి కారణభూతమైన మరికొన్ని అంశాలు కూడా వున్నాయి. స్థానిక తిరుగుబాట్లను అణిచి వేయడానికి, శాంతిభద్రతలను పరిపోషించడానికి బ్రిటిష్‌వారు ముత్తాదారు పద్ధతిని ప్రవేశపెట్టారు. ఈ ముత్తాదార్లు తమ తమ ప్రాంతాలలో భూస్వాములుగా, అధిపతులుగా రూపొందారు. వీరికి సహాయకులుగా ప్రతి గ్రామంలోనూ ఒక ఊరమున్సిఫ్ వుంటుండేవాడు. ఈ పెత్తందార్లు క్రమేపీ గిరిజనులపై సర్వాధికారాలూ సాగించ నారంభించారు. వీరు మామూలు సేద్యం చేయడానికి యోగ్యమైన భూములన్నింటినీ ఆక్రమించుకున్నారు. తత్ఫలితంగా పలుకుబడి లేని సాధారణ ప్రజలు సేద్యం చేసుకోవడానికి మంచి భూములు లేక కొండ ప్రాంతాలలో జీవితం గడుపుకోవడానికై 'పోడు' సేద్యం చేసుకోవలసిన ఆవశ్యకత కలిగింది.

'పోడు' వ్యవసాయం ప్రబలడానికి చిన్న చిన్న వ్యాపారస్థులు కూడా కారకులే. వీరిలో అరకు ఏజన్సీ ప్రాంతంలోని సోంధీలు ముఖ్యులు. వీరు కొండ జాతుల వారికి అరువుకు సారాయి సరఫరాచేస్తారు. కొంత కాలానికి ఋణపరిష్కారంగా వారి వద్దనుంచి భూఖండాలను స్వాధీన పరుచుకుంటారు. ఈ విధంగా తమ తాగుడు అలవాటు వల్ల వారు ఎంతో నష్టపోవడం జరుగుతున్నది.

భూముల హక్కుల రికార్డులు లేకపోవడంవల్ల, భూస్వామ్యంపై పరిమితులు లేకపోవడంవల్ల పెత్తందార్లు మంచి మంచి భూములను చాలావరకు ఆక్రమించుకోవడానికి వీలు కలిగింది. తత్ఫలితంగా పేద గిరిజనులు కొండ ప్రాంతాలకు వెళ్ళిపోవల్సి వచ్చింది. 1917 వ సం. పు 1 వ చట్టం అమల్లోకి రావడంతో ఏజెన్సీ ప్రాంతంలో తగు అనుమతి పొందకుండా కొండజాతుల వారినుంచి కొండజాతులకు చెందనివారు భూములు స్వాధీనం చేసుకోవడంపై ఆంక్షయేర్పడింది.

దీనికి కారణభూతమైన మరో అంశం బహు భార్యాత్వం. వధువు మూల్యానికి సంబంధించిన గిరిజనుల సాంఘికాచారాలు. వధువు మూల్యాన్ని సాధ్యమైనంత స్వల్ప వ్యవధిలో చెల్లించాల్సి వుటుంటుంది. ఈ కారణంగా గిరిజనులు వడ్డీ వ్యాపారులను ఆశ్రయించడం తప్పనిసరి అవుతుంది. ఈ వ్యాపారులు తన భూములను స్థానిక కొండ జాతుల పెద్దల సహాయంతో స్వాధీనం చేసుకుంటుంటారు.

## రెండు రకాలు

'పోడు' సేద్యాన్ని స్థూలంగా చిల్కపోడు, కొండపోడు అనే రెండు వర్గాల క్రింద విభజించవచ్చు.

*చల్కపోడు :–* ఈ పద్ధతి సేద్యం అంతగా ఏటవాలుగా గాక సమతలంగావున్న భూములలోనేజరుగుతుంది. కనుక ఈ విధమైన వ్యవసాయం పోడువ్యవసాయమంతటి అభ్యంతర కరమైనదికూడా కాదు. ఈ సేద్యం జరిగాక కొన్నిసంవత్సరాలపిమ్మట, భూమి తిరిగి బలం పుంజుకునే నిమిత్తం బీడుగా వుంచబడుతుంది.

*కొండపోడు :–* కొండ వంపులలో ఈ సేద్యం చేస్తారు. ఇది ప్రస్తుతం వివాదగ్రస్తమైన అంశంగా వుంది. అభ్యంతరకరమైనదిగా కూడా ఇది పరిగణించ బడుతున్నది. అరకు ప్రాంతంలోనూ, ఆ చుట్టు ప్రక్కలా సాధారణంగా విశాఖపట్నం జిల్లాలో కొండజాతులవారు ఈ విధమైన పోడు వ్యవసాయాన్ని విస్తారంగా చేస్తారు. రంప, గోలకొండ ఏజెన్సీ ప్రాంతాలలోని రిజర్వుకాని భూముల నిర్వహణకై మద్రాసు అడవుల చట్టం (12) 26వ సెక్షను క్రింద జారీచేయబడిన నియమావళి భూమిమట్టం నుంచి ఏటవాలు మూడవవంతు కంటెఎక్కువ ఎత్తున వున్న కొండవంపులలో చెట్లు చేమలను కొట్టివేసి సేద్యం చేయడాన్ని నిషేధిస్తున్నది. మాచ్‌ఖండ్ ప్రాజెక్టు ఆరగాణి ప్రాంతంలో 10 శాతం కంటె ఎక్కువగా ఏటవాలుగా వున్న ప్రాంతాలలో పోడు వ్యవసాయం సాగించడాన్ని అభ్యంతర కరంగా ఒరిస్సా విద్యుచ్ఛక్తి శాఖ చీఫ్ ఇంజనీరు పరిగణించారు. మాచ్‌ఖండ్‌నది ఆరగాణి ప్రాంతంలో రిజర్వు కాని భూములలో తిరిగి అడవులను పెంచే కార్యక్రమాన్ని చేపట్టడానికై ఈ విధానం అనుసరించ బడుతున్నది.

## దుష్ఫలితాలు

'పోడు' వ్యవసాయంవల్ల (1) విలువైన కలప ధ్వంసమైపోతుంది కాబట్టీ, (2) కొండ చెలమలు ఇంకిపోతాయి కాబట్టీ, (3) భూసారం క్షీణిస్తుంది కాబట్టీ, (4) ప్రస్తుత వ్యవసాయాభివృద్ధికి ఇది అనువైనదికాదు కాబట్టీ, (5) వర్షపాతం దెబ్బ తింటుంది కాబట్టీ ఈ విధమైన సేద్య విధానాన్ని మాన్పించాలని కొందరు అభిప్రాయపడ్డారు.

వివిధ అభిప్రాయాలకు, సూచనలను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే దిగువ అంశాలు స్ఫురిస్తాయి :–

(1) పోడు వ్యవసాయం కొండజాతుల వారి సంస్కృతికి సంబంధించిన ఒక అంశం. ఇది వారికి ఒక జీవన మార్గం.

(2) వారిపట్ల సానుభూతితో వ్యవహరించడం అవసరం.

(3) పెద్ద మార్పులను వేటినైనా ప్రవేశ పెట్టడానికి పూర్వం వారి సాంఘికాంశాలను పరిశీలించాలి.

(4) కొండజాతులవారికి తగు విధంగా పునరావాసం కల్పించాలి.

(5) కొండజాతులవారు పోడు సేద్య విధానాన్నిమాని, మామూలు వ్యవసాయ పద్ధతులను అనుసరించేలా చేయడం క్రమంగా, మెల్లగా జరగాలి. వారి అభీష్టానుసారం వారి ఆమోదంతో ఈ విషయంలో ముందుకు సాగాలి.

పోడు సేద్యం నుండి మాన్పించబడిన కొండజాతులవారి పునరావాసం కొరకు ఎల్విన్ కమిటీ వివిధ సూచనలు చేసింది. చెరువులు లేక ఇతర నీటి వనరుల పథకాలు వున్న చోట్లలో నీటి పారుదల జరుగగల భూమిని కొండజాతుల వారికి మాత్రమే తక్షణమే కేటాయించాలనీ, గృహ నిర్మాణ పథకాల నిమిత్తం కలప కొట్టుకోవడానికి అనుమతించాలనీ, కుటీర పరిశ్రమలను ప్రోత్సహించడానికై కొయ్య, వెదురును తీసుకొని వెళ్లడానికి కూడా ఇదే విధంగా అనతి నివ్వాలనీ, పట్టాలులేని కొండజాతుల వారికి తక్షణమే పట్టాలు జారీచేయాలనీ ఈ కమిటీవారు సిఫార్సు చేశారు.

మలయప్పన్ కమిటీ దిగువ పేర్కొన్న సిఫార్సులు చేసింది :–

(1) 10 శాతం కంటే ఎక్కువ ఏటవాలుగా వున్న రిజర్వుకాని ప్రాంతాలలోగల కొండ వాలులలో పోడుసేద్యం అంభ్యతర కాలంగా ప్రకటించబడాలి. 5 ఏళ్ళ లోగా అంటే అయిదు సంవత్సరాలలోగా పోడువ్యవసాయాన్ని మానివేయాలని ప్రకటించాలి.

(2) ఈ అలవాటును మాన్పించడానికి ప్రచారం జరపాలి.

(3) ఉదారంగా ఋణాలు మంజూరు చేయాలి.

(4) విత్తనాల గింజలు, వ్యవసాయ పనిముట్లు మొదలైన వాటిని సరఫరాచేయాలి.

(5) సేద్యపునీటివనరులను కల్పించాలి.

అన్నిటికంటే చాలా ముఖ్యమైన సూచన ఏమిటంటే, పోడువ్యవసాయం చేసే ప్రజలకు కేటాయించే నిమిత్తం గ్రామాల సమీపంలో ఖాళీమైదాన భూములు లభించనట్లయితే అనుమతించదగినంత వంపు ప్రదేశంలోగల భూములను ప్రతి కుటుంబానికీ సాధారణంగా పోడు సేద్యం చేసుకునే భూమికంటే పదివంతుల చొప్పున ఇవ్వాలని ఆయన పేర్కొన్నాడు.

ఇందువల్ల పోడు వ్యవసాయం చేసే కొండజాతి ప్రజలు స్థిరపడడానికి కాలనీలను ఏర్పాటు చేసే ప్రశ్న ఉదయిస్తుంది.

భూవసతిలేని బీద ప్రజల కొరకూ, పోడు వ్యవసాయం చేసే వారి కొరకూ కాలనీలను

నిర్మించాలని శ్రీ ఎస్. మలయప్పన్ సూచించారు.

## అరకులోయ

అరకులోయ బ్లాకులో కొండజాతులవారు పోడువ్యవసాయం విస్తృతంగా చేస్తారు. కనుక అక్కడి పరిస్థితులు దిగువ ప్రత్యేకంగా వివరించ బడినవి. మాచ్‌ఖండ్‌నది ఆరగాణి ప్రాంతంలో ఈ బ్లాకు కూడుకొని వుంది. మాచ్‌ఖండ్‌నదిపై జలవిద్యుత్ పథకం ఒకటి చేపట్టబడింది. అరకు ప్రాంతంలోగల మాచ్‌ఖండ్‌బేసిన్ పూర్తి విస్తీర్ణం 858 చదర పుమైళ్ళు. నీటిని నిలువ చేసేనిమిత్తం జాలాపుట్ వద్ద మాచ్‌ఖండ్ నదికి అడ్డంగా ఒక ఆనకట్ట నిర్మించబడింది. మాచ్‌ఖండ్ ముఖ్య ఉపనదిఅయిన పాతాళగడ్డ అరకులోయగుండా ప్రవహిస్తుంది. ఆరగానిలో వర్షపాతం 50అంగుళాలనుంచి 100 అంగుళాల వరకు వుంటుంది. రాష్ట్ర భూసార సంరక్షణ బోర్డు 25–6–63 తేదీన అరకులో వ్యవసాయ మంత్రి అధ్యక్షతన సమావేశమైన సందర్భంలో, 10 శాతంకంటే ఎక్కువ ఏటవాలులో నున్న రిజర్వుకాని ప్రదేశాలలో అడవులు పెంచే కార్యక్రమాన్ని గూర్చి చర్చించింది. పోడు వ్యవసాయం చేసే వారిని దండించడంవల్ల ప్రయోజనం వుండదనీ, ఆటువంటి వారికి మంచి భూములు ఇవ్వడం, నీటి పారుదల సౌకర్యాలు పరపతి సౌకర్యాలు కల్పించడం, ఎరువుల సరఫరా చేయడం మొదలైన సదుపాయాలు కలుగ జేయడం ద్వారా వారి ఆ అలవాట్లను మాన్పించడం అవసరమని బోర్డు అభిప్రాయ పడింది. అరకు ప్రాంతాలలోని అయిదు గ్రామాలకొరకు ఒక పైలట్ పథకం సిద్ధం చేయబడింది. ఈ అయిదు గ్రామాలలో 67 కుటుంబాలకు ఈ పథకం వర్తింపజేయబడింది. ఈ గ్రామస్థులు 277 ఎకరాల విస్తీర్ణంలో పోడు వ్యవసాయం చేస్తారు. ఈ పైలట్ పథకం ఏవిధ కమిటీల సిఫార్సులకు అనుగుణ్యంగా, ప్రజల అభీష్టాల ననుసరించి రూపొందించబడింది. ప్రజల భావాలను ఇది ప్రతిబింబిస్తుంది. కట్టలు కట్టడం, విత్తనాలు, మేలురకాల కూరగాయల మొక్కలు, ఎద్దులు మొదలైన వాటిని సరఫరా చేయడాన్ని ఈ పథకం ఉద్దేశిస్తుంది. పండ్ల మొక్కలు కూడా సరఫరా చేయబడతాయి. పండ్లచెట్లు, ముఖ్యంగా కాఫీ తోటలు ఈ ప్రాంతంలో చక్కగా ఎదుగుతాయి.

కొండజాతులు : విశాఖపట్నం జిల్లా ఏజెన్సీ ప్రాంతాలలో దిగువ పేర్కొన్న కొండజాతులవారు నివసిస్తారు: భగతలు, ఖోండులు, కొండదొరలు, సామంతులు, జాతపులు, డొంబులు, పైడిలు వగైరా. భగతాలు, జాతపులు మంచి వ్యవసాయదారులు. నికరమైన సేద్యం చేస్తారు. ఇతర కొండజాతుల వారి కంటే వీరు ఆర్థికంగా మంచి స్థితిలో వున్నారు. వాల్మీకులు ఇతరులకంటే అభివృద్ధి జెందిన వారు. వారిలో చాలా మంది కొద్ది ఎత్తున వర్తకం చేసుకుంటారు. పోతే సామంతులు, కొండదొరలు, ఖోండులు మొదలైన వారు కొండ వంపులలో పోడు వ్యవసాయం జేసుకొని జీవిస్తారు. ముఖ్యంగా సామంతులు మైదాన ప్రదేశాలలో నివసించడానికి అంతగా ఇష్టపడరు. కొండ శిఖరాలమీద వారు గడపదలుస్తారు. పరుల జోక్యాన్ని కూడా వారు సహించరు.

ఈ ప్రాంతంలో సంవత్సర వర్షపాతం 56 అంగుళాలు. జూన్‌నుంచి అక్టోబరు వరకు వర్షాలు కురుస్తాయి. నవంబరు నుంచి ఫిబ్రవరి వరకు దట్టంగా మంచు కురుస్తుంది. మార్చి, ఏప్రిల్ నెలలో వడగండ్ల వానలు పడతాయి. మేలో విపరీతంగా గాలులు వీస్తాయి. అరకు బ్లాకులో 2022 కుటుంబాలు — అంటే మొత్తం కుటుంబాలలో 25 శాతం కన్న కొద్దిగా ఎక్కువ — పోడు వ్యవసాయం సాగిస్తున్నట్లు పరిశీలనలో వెల్లడైంది. కాగా వీరిలో 250 కుటుంబాలకు వేరేభూములువున్నాయి. మిగతా 1,750కుటుంబాలవారుపూర్తిగాపోడు వ్యవసాయంమీదనే ఆధారపడి వున్నారు. వీరంతా 217 గ్రామాలలో వ్యాపించి వున్నారు. వీరికి పనిపాటలు చేసుకోవడానికి ఎద్దు వుండవు. అందుచేత ఈ సమస్య జటిలమైనది. పైలట్ పథకాల పద్ధతిలో ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. నిరకమైన సేద్య విధానాన్ని కొండజాతులవారిలో ప్రోత్సహించే విషయంలో ఈ బ్లాకులో [illegible] తరహా నీటి వనరుల అభివృద్ధి ఈ కార్యక్రమంలో ముఖ్యమైనది. 2125 ఎకరాలకు నీటి పారుదల చేయగల 46 చిన్న తరహా నీటి వనరుల పథకాలు రూపొందించబడినవి. వీటిలో చాలా పథకాలు చురుగ్గా అమలు పరచపడుతున్నవి.

## సూచనలు

సేద్యపునీటి వనరులకు, వ్యవసాయానికి ప్రాధాన్యత నివ్వాలి. వీటికిగాను అవసరమైతే గ్రామీణ గృహనిర్మాణం, సాంఘిక విద్యా కార్యక్రమాలకు చేసిన కేటాయింపులను తగ్గించవచ్చు. ఏజెన్సీ ప్రాంతాలను సర్వేచేసి, కొండజాతుల వారు దోపిడీ విధానాలకు గురికాకుండా వుండేందుకై వారికి పట్టాలను మంజూరు చేయాలి. ఇది మొత్తం సమస్యకు కీలకమైనది. బ్లాకు కార్యకలాపాలలో భూసార సంరక్షణ విధానాలు ముఖ్యంగా వ్యవసాయ కార్యక్రమాలకు ప్రాధాన్యత నివ్వాలి. మొత్తం మీద గిరిజనాభివృద్ధి బ్లాకులకు చేసే బడ్జెటు కేటాయింపులు, పథకాలు ఈ మానవ సమస్యను పరిష్కరించేవిగా వుండాలి. ఇవికూడా అమలు జరిగిన నాడు 'పోడు' వ్యవసాయం మరో కొత్త రూపు తాలుస్తుంది.

# ఆ వే ద న ★

మానాప్రగడ శేషశాయి

ఎవడురా ! తల్లికంతుద కింత ఎఱుపు
కూర్పగా సాహసించిన కుటిలబుద్ధి !
ఎవడురా ! తల్లి కన్బొమ లిట్టు బిట్టు
ముడివడగ జేయబూనిన ముష్కరుండు !

అలిగి నా తల్లి చూచెనా ! ఆ దురాత్మ
డెగిరి పడిచచ్చు శలభమై ఈ క్షణాన !
ఎఱిగి ఎఱిగియు నౌర ! తా నీ పవిత్ర
భారతమ్మును చీకాకుపఱచు పఱచ !

శాంతి నుజ్జగింప సమ్మతింపదు భార
తీయమైన మనసు తీయ మెఱుగ
నేరనట్టి మొఱకు తోరణం బది వచ్చె
దైవ మొకడు కలడు దాని దీర్ప !

ఆవగింజ పెద్దదనిపించు తనకంటె
"ఆబ" మంచుకొండ నంటి పెరుగు ;
తగును తగ దటంచు వగవక మితిమీరె
తగరు బలిసి కొండ తాకినట్లు.

తగవుమాలి తనకు దా వేరిమిం గొని
పరుల నెపుడు కీడుపఱచు నెవడు ;
వా డిహమ్ము పరము పాడుగా రూపఱు
నంచ్రు కాలవేదులైన మునులు.

మగని చావగొట్టి మొగసాల వాపోవు
టక్కులాడి వగల ఉక్కివుండు ;
కీ లెఱింగి భవ్యశూలమ్ముతో ధర్మ
రక్ష వీని కిడుట రాజనీతి.

కడుపులోన చల్ల కదలకుండగ నున్న
మా కిదేల దిక్కుమాలి మాయ
పోరు సిద్ధమయ్యె బొడ్డూడ నట్టి అ
ర్భకులతోడ ; పోరుగువారితోడ ;

కాదు కయ్యమునకు కాలుదువ్వదమన్న
నీతి చచ్చు - జాతి నిగ్గు తగ్గు ;
నీతిలేనివాడు కోతికంటెను పాడు
కాన పొంది మనుట కాదె మేలు.

భారతీయ శాంతి పరమార్థమును చచ్చు
దనముగా పరుండు తలచి పెరిగె,
తాల్మిచేత గాని తన 'మనిపించుకో
దగిన పాడురోజు దాపురించె.

మనము తగ వెఱింగి మన్నింతుమా భయం
పడితిమంచు చూపు పౌరుషంబు
కుట్టనేని తేలు, కుట్టదో కుమ్మరి
పురువుగాగ నల్పబుద్ధి నెంచు.

ఎఱుకమాలి మొదలికే మోసమును తల
పెట్టె భేకలోక భీకరుండు.
బ్రదుకు వీని పాలబడి చుల్కనయ్యె క
ప్పలకు గాక సర్పములకు గాక

కనలి తన వ్రేలితో తన కన్ను పొడుచు
కొన్న యీ తెల్వి నేమనుకొనగ వలయు ?
పాప మని జాలి పడుదుమో ! వానిమచ్చ
మాపుటకు సిద్ధపడుదుమో మనము నేడు.

తనకు తిండి లేని దద్దమ్మ ధర్మ స
త్రముల తేర నిల్పదలచినట్లు ;
నిలువ నీడలేక నింగికి పందిళ్ళు
కప్పదలచు వెంగళప్ప వీడు !

ఎత్తు పల్లమ్ము జీవవాహిను లెఱింగి
సాగు, సమకూర్చు తగినంతసాగు కృషికి ;
కొండలై తున్కలై ధరాఖండ ముండు
చదును జేయంగ నరునకు సాధ్య మగునె ?

ఇది విచిత్రమనంత మహీన మప్ర
తర్క్య మజ్ఞేయ మాద్యమ్ము ; తా నొకండ
ఎఱుగు నీ సృష్టి పరమాత్మ ; ఈ వివేక
మందని నరుండు క్రొవ్వి అహంకరించు.

తాన సృష్టికర్త యైనట్లు, ఇది ఎల్ల
చక్కదిద్ది ఒక్క చాయ నడిపి
కలిమి లేమి నూడ్చి "గ్రామ చావడి"గ రూ
పింప రక్తి గొనును వెఱ్ఱివాడు.

కలిమి లేముల తీపి చేదులం బెనంగు
జీవన మ్మిది సృష్టివైచిత్ర్యము ఒక్క
రీతి సరిదిద్ద బ్రహ్మకే చేతగాదు ;
కాదనినవాని కుత్తుక కత్తిరించు.

ఒల్ల మనురక్తి లేదు మొఱ్ఱో యనంగ
మెడకు లింగంబు గట్టు బల్ గడుసు "చైనుడు"
ఏ మహాశక్తియో జేవురింపజేసె
తలకు రోకలి చుట్టంగ దలచు వెఱ్ఱి. ★

# సాంఘిక సంక్షేమం

వితండ వాదంచేసే నిరాశా వాదులు ఏమంటున్నప్పటికీ సంక్షేమ రాజ్యస్థాపన అనే ఆదర్శవంతమైన గమ్యంవైపుకు మనదేశం శరవేగంగా పురోగమిస్తున్నదనే విషయం ముమ్మాటికీ నిజం. అయితే మనం సాధించవలసినదంతా సాధించ లేదనే సంగతి యదార్థమే. ఏమైనప్పటికీ క్రమేపీ నెరవేర్చవలసిన ఈ కార్యభారం స్వల్పవ్యవధిలోనే ముగియాలను కోవడంకూడా తొందరపాటే అవుతుంది. దారిద్ర్యం, దుఃఖం, వ్యాధుల నిర్మూలనకై జరిగే పోరాటంలో తమలో ప్రతిఒక్కరూ పాల్గొనాలనే విషయాన్ని ప్రజలు గుర్తించడం దేశానికి క్షేమదాయకం. ఏ ప్రభుత్వంకూడా — అది ఎంత శక్తిసామర్థ్యాలు కలిగినదైనప్పటికీ — ఈ సమస్యలను, ప్రజల సంపూర్ణ సహకారం లభించనిదే పరిపూర్ణంగా పరిష్కరించలేదు. స్వాతంత్ర్యం, సేవాసక్తి ప్రతిఒక్కరి జన్మహక్కు. స్వార్థదృష్టి, స్వార్థచింతన అవాంఛనీయమైనవి. మన దేశపు ఆధ్యాత్మిక వారసత్వానికి భిన్నమైనవి. ప్రతిజీవన రంగంలో కూడా "ఎదుటివారికి సహాయ పడడమే" మన పరమ లక్ష్యంగా వుండాలి. ఈ సత్యాన్ని మనందరం గుర్తించి ఆచరణలో పెట్టినట్లయితే దేశమంతటా సాంఘిక సంక్షేమకృషి అత్యద్భుతమైన ఫలితాలు సాధిస్తూ సాగిపోతుంది.

సమాజంలో వెనుకబడిన తరగతులవారి స్థితిగతులను మెరుగు పరచడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శాయశక్తులా కృషి చేస్తున్న దనే విషయంతో ఎవరో కొందరు మినహా అంతా ఏకీభవిస్తారు. అయితే ప్రభుత్వ విధానాలను అమలు పరచడంలో అక్కడక్కడా కొన్ని లోపాలేవైనా వుంటే వుండవచ్చు. దీనిని కేవలం పరిపాలనా సంబంధమైన అంశంగానే పరిగణించాల్సి వుంటుంది కాని మన ప్రభుత్వం నిజాయితీని శంకించడానికి ఎంత మాత్రం వీలు లేదు. సమర్థవంతమైన ఏ ప్రభుత్వమయినా అప్రమత్తంగా వుండి, పురోగతి కుంటువడకుండా వుండేందుకు పరిపాలనా వ్యవస్థలో ఏర్పడే అడ్డంకులను తక్షణమే నివారించడానికి చర్యలు తీసుకుంటుంది. కాగా సాంఘిక సంక్షేమ కార్యక్రమాల నిర్వహణకు ఆ సమస్యలను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొన్నటువంటి దక్షులు, ఉత్సాహవంతులు అయిన ఉద్యోగులను నియోగించడంవల్ల మరింత సార్థకత్వం సిద్ధిస్తుంది. నియమ నిబంధనలను యాంత్రికంగా వర్తింప జేయడం, దయాదాక్షిణ్యాల ప్రసక్తిలేకుండా వ్యవహారాలు పరిష్కరించడం, శాసనాలు మనుష్యుల కొరకు రూపొందించబడినవే కాని మనుష్యులు శాసనాల కొరకు లేరు అనే సత్యాన్ని విస్మరించడం — వీటన్నింటివల్ల ప్రభుత్వ ఉదాత్త లక్ష్యాలకు హాని చేకూరే అవకాశం వుంటుంది. అందుచేత ప్రభుత్వ విధానాలు, లక్ష్యాల సఫలత, సార్థకత్వం వాటినిఅమలు పరిచే అధికార్లపై ఆధారపడి వుంటుంది. ఇతర శాఖలలో ఆయా కార్యక్రమాలను, ప్రజలపై అవి పడవేస్తున్న ప్రభావాన్ని పరిగణించకుండానే కొంత వరకైనా కొనసాగించవచ్చు. కాని సాంఘిక సంక్షేమశాఖ కార్యక్రమాలు మాత్రం తద్భిన్నమైనవి. ప్రజల ఇబ్బందులను తొలగించి వారికి సౌభాగ్యం కలిగించడమే ఈ శాఖ లక్ష్యం.

పోతే గమనార్హమైన మరో విషయమేమిటంటే, సాంఘిక సంక్షేమ మనే ఈ కార్యనిర్వహణలో ప్రభుత్వానికి దయార్ద్రహృదయులైన ప్రజల తోడ్పాటు లేనిదే దీనిలో విజయం సాధించడం దుస్సాధ్యం. ఇతరుల కార్యభారంలో భాగం వహించడానికి, బాధలకు గురైనవారికి సహాయపడే పవిత్ర కార్యంలో పాల్గొనడానికి సాధ్యమైన చోట్లలో కనీసం కొంతమంది ప్రజలనైనా ప్రోత్సహించడం మంచిదే. ఇటువంటి పనులను ప్రభుత్వాలు పాక్షికంగా మాత్రమే నెరవేర్చ గలుగుతాయి. కాగా మానవ సంక్షేమానికి అంకితమైన స్వచ్ఛంద సేవా సంస్థలు — ధన రూపంలో కాకపోయినప్పటికీ కార్యరూపంలోనైనా—చాలావరకు కృషి చేయగలుగుతాయి. మనదేశంలోస్వాతంత్ర్యానంతరం ఇటువంటి స్వచ్ఛంద సంస్థలు అధిక సంఖ్యలో ఏర్పడి, బీదవారు, సహా

యార్థులకు యథాశక్తి తోడ్పడుతుండడం ఎంతో సంతోషప్రదమైన విషయం. త్వరలోనే దేశంనుంచి లేమిడి, వ్యాధులు అనేవి నిర్మూలించబడి సాంఘికభద్రత ఏర్పడడానికి వీలుగా దేశంలో ఇలాంటి స్వచ్ఛంద సంస్థలు ఇతోధికంగా స్థాపించబడాలి.

మనకు శక్తిస్తోమతలు ఎంత వున్నప్పటికీ అత్యవసర స్థితిలో అవి అధికం కాజాలవు. ఆస్తిపాస్తులు, ధనం మొదలైన వాటిని స్వచ్ఛందంగా దేశం కొరకు అర్పించే త్యాగబుద్ధి మన ప్రజలది. ఈ సంప్రదాయాన్ని మనవారు అప్పటికీ ఇప్పటికీకూడా అనువర్తిస్తున్నారు. బీదవారు, సహాయార్థుల పట్ల దయాదాక్షిణ్యాలు చూపడాన్ని మన ధర్మం ప్రబోధిస్తున్నది. వ్యవస్థీకృతంకాని దాన ధర్మాలు నిరుపయోగమయ్యే అవకాశం వుంటుంది. యాచకవృత్తిని నేరంగా ప్రకటించడానికి హేతువుఇదే. ఇదిసముచితమూ, సమంజసమూ అయిన చర్య కూడా. చిరకాల వాంఛితమైన ఈ చర్య ద్వారా సాంఘిక పునరుద్ధరణ రంగంలో మరో అడుగు ముందుకు వేసినట్లయింది. వ్యక్తులకు దాన ధర్మాలు చేసే సూత్రాన్ని పాటించేవారు ఇప్పుడు అనాథులు, అసహాయుల ప్రయోజనార్థం వెచ్చించబడడానికై అధికారిక సంస్థలకు ఉపయోగపడడానికి వీలుగా తమ దాన ధర్మాలను పరిగణన పొందిన సంస్థలకు అందివ్వాలి.

వృద్ధులకు పింఛన్లు ఇచ్చే పద్ధతిని మనం అనుసరిస్తున్నాము. ఈ విధానం అభివృద్ధి పొందిన దేశాలలో అమల్లోవుంది. తమ జీవితకాలంలో తమ మాతృదేశానికై ఏదో ఒక విధంగా పరిశ్రమించిన మన దేశ ప్రజలను వారి వృద్ధాప్యంలో ఇడుములకు గురి కాకుండా చేయడమే ఈ పింఛనులను ఇవ్వడంలో గల ఆంతర్యం. ఈ శాసనంవల్ల వారికి ఎంతో సహాయం, ప్రోత్సాహం చేకూరింది.

విద్య ప్రధానమైన అంశం. బీదవర్గాల వారికి ఈ సౌకర్యాలు సాధ్యమైనంతవరకు పూర్తిగా సమకూడునట్లు చూడవలసివుంది. ఇటువంటివారికి స్కాలర్‌షిప్పులు, స్టయిఫండ్లు, ఋణాలుకూడా లభింపజేయబడినవి. సహాయానికై అభ్యర్థిస్తున్న వారి సంఖ్యకూ వాస్తవంగా సహాయం అందివ్వబడే వారి సంఖ్యకూ మధ్య పెద్ద అంతరం వుండవచ్చు. ఇందుకు అధిక మొత్తాలు అవసరం. ప్రతిసారీ అదనపు మొత్తాల కేటాయింపుకు అభ్యర్థనలు జరుగుతాయి. నిరుపయోగమైన పథకాలను ఎత్తివేసి ఆ మిగులు మొత్తాలను విద్యావసరాలకు వెచ్చించడానికి ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నిస్తూనేవుంది. ఇదిసహేతుకంకూడా. ఎందుచేతనంటే రొక్కపుగ్రాంట్లు, సహాయకగ్రాంట్లు ఇవ్వడంకన్న వ్యక్తి స్వశక్తిపై ఆధారపడగలిగేట్లు చేయడం, విద్య గరపడం చాలా ఉపయుక్తం. అనేక సందర్భాలలో బహుశా ప్రభుత్వం ఇచ్చే డబ్బు సద్వినియోగం కాకపోవడం, ఈ సహాయం పొందినవారు యథాస్థితిలోనే వుండిపోవడం జరుగుతుంది. ప్రభుత్వం ఇచ్చే నిధులు, గ్రాంట్లు మొదలైనవి నిలదొక్కుకునివున్న, ప్రసిద్ధిగాంచిన సంస్థలకు మాత్రమే లభింపజేయాలి. అప్పుడే బీద ప్రజలకు నిశ్చయంగా ఏమైనా సహాయం చేకూరగలుగుతుంది. అంతేగాని పశువులు, మొదలైనవాటిని కొనుక్కోవడానికి గానీ లేదా ఇండ్లు కట్టుకోవడానికిగానీ వ్యక్తిగతంగా ఆర్థిక సహాయంచేసే పద్ధతిని ప్రభుత్వం కొనసాగించినట్లయితే అందువల్ల చెప్పుకోదగిన సత్ఫలితాలేవీ కలుగవు.

ముగింపులో, అనుభవజ్ఞులైన పింఛను పొందిన ప్రభుత్వోద్యోగులకు ఒక విషయాన్ని విన్నవించవలసివుంది. వీరు తమ గ్రామాలలోకానీ, పట్టణాలలో కానీ, జిల్లాలలోకానీ ఏదో ఒక సాంఘిక సేవా కార్యక్రమాన్ని చేపట్టాలి. లేదా ఈ రంగంలో ఇతరులకు మార్గదర్శకత్వం వహించాలి. అందువల్ల వారు దేశానికి ఎంతో మేలు చేసిన వారవుతారు. రిటైరైన ప్రభుత్వోద్యోగులు దేశానికి సంపదవంటివారు. వారిలో కనీసం కొందరైనా గ్రామప్రాంతాల్లో స్థిరపడి, ఆరోగ్యం, పారిశుద్ధ్యం, సాంఘిక బాధ్యతలు మొదలైన అంశాలను గురించి పల్లె ప్రజలకు తెలియజెప్పినట్లయితే మన ప్రజా జీవితంలో నూతన శకానికి నాంది ఏర్పడ గలుగుతుంది. 

# సంఘ సంస్కరణ కవిత్వం

డా॥ సి. నారాయణరెడ్డి

## మానవోద్యమం

ఆంధ్రదేశంలో పందొమ్మిదో శతాబ్దిచివరలోనే కందుకూరి వీరేశలింగంగారు సంఘసంస్కరణ మహోద్యమాన్ని ప్రారంభించారు. ఇరువయ్యో శతాబ్దిలో ఆయన ఉద్యమం అపూర్వంగా విజృంభించింది. ఈ ఉద్యమ నిర్వహణలో వీరేశలింగం గారికి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు కుడిభుజంగా నిలిచారు. భాషాసాహిత్య రంగాల్లో గిడుగు గురజాడల్లాగా సంఘసంస్కరణ రంగంలో ఈ యిరువురు మహానుభావులు సూర్యచంద్రుల్లాగా ప్రకాశించారు. ఈ యిరువురు నడిపిన సంఘసంస్కరణోద్యమమే ఏకేశ్వరారాధనం, విగ్రహారాధనిరసనం, బాల్య వివాహ ఖండనం, వితంతు వివాహకరణం మున్నగు అనేక శాఖలుగా విస్తరించింది. ఈ శాఖలన్నిటికి మూలం మానవోద్యమ దృక్పథం. గత శతాబ్దిలోనే వంగ దేశంలో రాజా రామమోహనరాయలు మానవోద్యమాన్ని మహోచ్ఛస్థితికి తీసుకొని వెళ్ళాడు. మన మానవోద్యమానికీ Italian Humanism నకు చాలా పోలికలున్నవి. ఇటలీలో జరిగిన 'రినైజాన్సు'తో మానవోద్యమ దృక్పథం వేరూరింది. మధ్యయుగాల్లో మానవునిమీద చర్చి విధించిన కఠిన నిర్బంధాలను త్రెంచివేయడం, విజ్ఞానం అందరి సొత్తుగా భావించడం. ఈ ఉద్యమ ప్రధాన లక్షణాలు. పరిపూర్ణ స్వేచ్ఛను అనుభవించినవాడే అసలైన మానవుడని ఈ ఉద్యమం ప్రచారం చేసింది.

"Only a free man; it was held, was in the complete sense a man at all, a slave was only half a man."[1]

ఈ ఉద్యమం వ్యక్తికీ వ్యక్తికీ నడుమ ఉన్న ఎల్లలను తుడిచివేసింది. గోడలను పడగొట్టింది. కులమత వర్ణవ్యత్యాసాలు వ్యక్తి జ్ఞానవికాసానికి అవరోధాలు కాగూడదని స్పష్టపరిచింది. ఈ ఉద్యమం రేకెత్తిన కాలంలో పాశ్చాత్యలోకంలో గ్రీకు భాషలోని క్రిందివాక్యం వేదవాక్యమైంది.

"Homo sum : human nil a me alienum puto" (I am a man; there is nothing human that I think does not concern me).[2]

ఈ Italian Humanism నకున్నూ, రామ మోహనరాయల మానవోద్యమానికిన్నీ పైనచెప్పిన విషయాలన్నిట్లో సామ్యముంది. అంతమాత్రాన రాయల మానవోద్యమం భారతీయ సంప్రదాయాలను, భారతీయ విజ్ఞానాన్నీ నిరసించలేదు. వాటిని సహేతుకంగా పరిశీలించి 'మంచియున్నది పెంచవలె'నని ఉద్ఘోషించింది. ఒకవైపు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కోరుతూనే మరోవైపు జాతిస్వాతంత్ర్యాన్ని ప్రతిపాదించింది. అయితే జాతి స్వాతంత్ర్యం సర్వాంగీణ వికాసం పొందాలంటే మొదట ఆ జాతి శరీరానికి అణువులాంటి ప్రతి వ్యక్తీ వికసించాలి. అందుకే ఈ ఉద్యమం వ్యక్తి స్వేచ్ఛకు అగ్రతాంబూల మిచ్చింది. వ్యక్తి స్వేచ్ఛకు అడ్డువచ్చే దురాచారాలను, మూఢ విశ్వాసాలను కూకటివేళ్ళతో పెల్లగించడానికి ప్రయత్నించింది. మామూలు మనిషిని మకుటధారిగా చేయడానికి పూనుకున్నది. దీని లక్షణాలను కృష్ణశాస్త్రిగారు ఈ రకంగా సమన్వయించారు.

"ఈ జగత్తు, మానవుడు, వాని అనుభవాలు, అన్నీ గట్టి పరమార్థాలనే శాస్త్రీయ దృకథం, వాస్తవికత కూడా ఈ ఉద్యమ లక్షణాలే. 'అసీమమైన ఈ సృష్టిలో తూర్పేది; పడమరేది' అని, 'ఒక హృదయం, రెండు స్పందాలు' అనిన్నీ, 'నాజాతి మానవజాతి' అనిన్నీ, 'బ్రతుకుతే స్వతంత్రుణ్ణయి బ్రతుకుతాను, లేకపోతే ఉండనే ఉండను' అనిన్నీ, రాగల ప్రతి

1. The classical Background of English Literature by J. A. K, Thomson.
2. పై పుస్తకంలోనే ఉదాహరింపబడింది.

మానవుడు చాటుతాడని ఈ ఉద్యమం అంటుంది." [3]

రామ మోహనరాయలు వంగదేశంలో లేవనెత్తిన ఈ ఉద్యమధ్వజాన్ని తెలుగునాట తొలుదొల్త వీరేశలింగంగారు అందుకున్నారు. రామమోహనరాయలఉద్యమానికి బ్రహ్మసమాజం వాహికంగా ఉండేది. వీరేశలింగంగారు ఈ సంఘాన్ని ఆంధ్రదేశంలో స్థాపించి, దీనిద్వారా తమ సంఘ సంస్కరణ కార్యాలు జరిపారు. వీరేశలింగంగారు ప్రారంభించిన బాల్య వివాహఖండనం, కన్యాశుల్క నిరసనం మున్నగు వాటితోపాటు ఆ రోజుల్లో వర్ణవ్యవస్థా నిరసనం తలెత్తింది. కొంత కాలానికి సంఘ వ్యవస్థా నిరసనం గూడా ప్రారంభమైంది. దీనికి త్రిపురనేని రామస్వామి చౌదరిగారు మూలపురుషులు. ఇవన్నీ మానవోద్యమ లక్షణాలున్నవే. రెండో తరంలో ఈ మానవోద్యమమే గాంధీయ దృక్పథంగా రూపొందింది. గాంధీజీ సర్వోదయ సిద్ధాంతాలు ఈ తరంలో బహుళ ప్రచారం పొందినవి. మానవోద్యమంలోని ఈ రెండు ప్రధాన శాఖలను దృష్టిలో పెట్టుకొని సంఘసంస్కరణ కవిత్వం వెలువడింది. కొందరు నవ్యకవులు వితంతు విలాపాన్ని వినిపించారు. కొందరు కన్యాశుల్కాన్ని నిరసించారు. కొందరు వర్ణవిభేద పిశాచానికి ఎదురుదిరిగారు. మరి కొందరు గాంధీజీనడిచిన బాటలో కాలుమోపి హరిజన సమస్యను కావ్య వస్తువుగా తీసుకున్నారు. ఇంకా కొందరు ఈ బాటలోనే విశ్వమానవ ప్రేమను పతాకగాగొని ప్రస్థావించారు. ఇక ఈ లక్షణాలన్నిటినీ వర్గీకరించి వాటి తత్త్వాన్ని నిర్దేశిస్తాను.

## 1. దురాచార నిరసనం

ఈ శతాబ్ది మొదటి పదిలో విరివిగా అతి బాల్య వివాహాలు జరుగుతుండేవి. ఈ దురాచారం, బొడ్డుకోయని కూనకు — చివరికి కడుపులో ఉన్న బిడ్డకుగూడా వివాహ సంబంధం నిశ్చయించేవరకు పోయిందని గురజాడ డైరీల్లో వ్రాసుకున్న విషయాన్ని బట్టి గమనించవచ్చు. వీరేశలింగంగారి సంస్కరణ వజ్రఘాతంతో అతిబాల్య వివాహపద్ధతి చూర్ణమైపోయింది. బాల్య వివాహాలు చాలావరకు సన్నగిల్లి పోయినవి కాని పూర్తిగా అడుగంటలేదు. బాల్య వివాహాలవల్ల వింతంతువుల సమస్య బయలు దేరింది. ముఖ్యంగా అగ్రవర్ణాల్లో బాల వితంతువుల సమస్య తీవ్రరూపం దాల్చింది. శుల్కానికి ఆసపడి తలిదండ్రులు వృద్ధులకు తమ కూతుళ్ళ నంటగట్టడంతో ఈ సమస్య మరింతగా విషమించింది. ఆనాటి ఆధునిక కవి 'పైకమిచ్చిన వారికే బాలికలను గట్టి పెట్టుట యిదియేటికర్మ' మంటూ ఆక్రోశించాడు. [4]భోగరాజు నారాయణమూర్తిగారి వంటి వీరగ్రాంథిక వాదులుగూడ వితంతు వివాహాలను సమర్థిస్తూ 1911 లోనే పద్యాలు వ్రాశారు. 'విధవా విలాపము' అనే శీర్షికతో వీరు వ్రాసిన పద్యాల్లో వితంతువుల దుర్గతి ఈ విధంగా చిత్రింప బడింది.

"తెలవకు ముద్దుముచ్చటలు దీరకమున్నె
శిరోజముల్ దెగం
గొఱుగుదురయ్య, పాపమని గొంక
రటయ్య, పునర్వివాహముల్
జఱుపుట ధర్మమంచెవరి శాస్త్రమునన్
గలదయ్య ? యిట్టుల
య్యారె ! విధవాంగనల్ జులకనై రి
గదయ్య ? పురాకృతంబునన్ " [5]

మంగిపూడి వెంకటశర్మగారు వితంతువుల దుర్దశను చిత్రించడానికి ప్రత్యేకంగా, ఒక కావ్యమే రచించారు. దానిపేరు 'బాల వితంతు విలాపము.' దీంట్లో శర్మగారు బాల్య వివాహాలను నిరసించిన పద్యం గమనిద్దాం.

'పొత్తిళ్ళలో నున్న నెత్తురు కందుల -
పెండ్లిండ్లు సేయ భావించు నొకడు
పురుడువోవక మున్న బొట్టెల నమ్మంగ
బేరసారములు గావించు నొకడు
కన్నులు తెఱవని కసుగాయలను గట్టి
పెట్టి వృద్ధులను సేవించు నొకడు
పాలైన విడువని పసికూనలను గూర్చ
వెసరాయబారి రావించు నొకడు.'

ఈ కావ్యంలో శర్మగారు వృద్ధవివాహాలను నిశితంగా విమర్శించారు. వనితలకు ప్రాయంలోనే వైధవ్య కారణంగా వచ్చిపడే దురవస్థలను హృదయ ద్రావకంగా చిత్రించారు. గాజులను, పసుపు కుంకుమలను, వ్రతాలను, వన్నెచీరలను, పూలను, పుణ్యకార్యాలను కోల్పోయి, మోడుల్లాగా, అడవి గాచిన వెన్నెల లాగా ఉండిపోయే వితంతువుల దుర్భర దుఃఖగాథలను వారి స్వగత రూపంలో ఈ కావ్యంలో వినిపించారు.

భోగరాజు నారాయణమూర్తిగారు వర శుల్క నిరసనగా ప్రత్యేకంగా 'పండుగ కట్న'మనే కావ్యం రచించారు. ఇది రచనలో ప్రాచీన పద్ధతికి చెందినదైనా వస్తువులో నవ్యమైంది. అత్తవారిని పీడించి కట్నాలు పుచ్చుకునే అల్లుళ్ళ దుర్బుద్ధిని

(మిగతా 31 వ పేజీలో)

3. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం : (వ్యాసం).
4. 'బాలవితంతు విలాపము: ' మంగిపూడి వెంకటశర్మ.
5. 'విధవా విలాపము' : ఆంధ్రపత్రిక : 1911 సంవత్సరాది సంచిక.

కుతుబ్‌షాహి తోటకే "అహమ్మద్ బోలాభాగ్"అని నామాంతరం వుంది. ఈ తోట హైదరాబాదు నగరానికి తూర్పు దిశలో నాలుగుమైళ్ళ దూరంలోవుంది. ఈ ప్రాంతం చాలా ఆరోగ్యకరమైన వాతావరణంతో కూడినది. పూర్వం యిక్కడ భవంతులు కట్టబడినట్టు గుర్తులు, శిథిలమై పోయిన కోట వున్నాయి. కుతుబ్‌షాహి పరిపాలన ఉచ్ఛదశలోవున్న రోజుల్లో యీ ప్రాంతం సుల్తాన్‌నగర్ అని పిలవబడుతుండేదని మియావిష్కు మసీదు తూర్పు ద్వారంవద్ద చెక్కబడిన శాసనాన్ని బట్టి తెలుస్తున్నది. కాలగతిలో ఈ పేరు చరిత్ర అడుగుపొరల్లో పడిపోయింది. ప్రస్తుతం యీ ప్రాంతం సరూనగర్‌గా పిలవబడుతున్నది.

కుతుబ్‌షాహీ వంశంలో ఆరవ ప్రభువైన మహమ్మద్ కుతుబ్‌షా (క్రీ. శ. 1612-1626) హైదరాబాదు నగరానికి 4 మైళ్ళ దూరంగా తూర్పుదిశలో ఒక కొత్త నగరానికి శంకుస్థాపన చేయాలని తలంచినట్టు లభించిన ఆధారాలనుబట్టి తెలుస్తున్నది. కందకం, ప్రాకారపుగోడ, ఇతర భవనాలు మొదలయిన కోట రక్షణకు సంబంధించిన వాటి నిర్మాణానికి ముందుగానే కోట మధ్యలో ఒక మసీదును యితడు నిర్మించాడు. అది యిప్పటికీ నిలిచివుంది. ఆ తర్వాత 'ఇడ్డగ', ప్రాకారాలు, యితర భవనాల నిర్మాణం ప్రారంభించబడింది. ఈ పట్టణానికి రెండు విధాలైన పటిష్టమైన రక్షణ వుంది. అహమ్మద్ బోలాభాగ్ పడమటి ప్రాకారానికి ఎదురుగానేవున్న దీని బయటి ప్రాకారం చుట్టూ 50 అ. వెడల్పున లోతైన కందకం త్రవ్వబడింది. ఇన్ని ప్రయత్నాలు జరిగినప్పటికీ ఒక కొత్త నగరాన్ని నిర్మించాలన్న యీ రాజు సంకల్పం ఫలప్రదం కాలేదు. ఆయన యీ విషయమై చేసిన కృషి అంతా ఎందుకూ కొరగాకుండా పోయింది. ఈ నిర్మాణకృషి జరుగుతున్న సమయంలోనే మహమ్మద్ కుతుబ్‌షా టైఫాయిడువల్ల చనిపోయాడనీ, ఆయన కొనసాగించిన పనులు అసంపూర్తిగానే మిగిలిపోయాయనీ, అతని కొడుకు అబ్దుల్లా కుతుబ్‌షా యిది అశుభకరమైన ప్రయత్నమని భావించి యీ నిర్మాణ కార్యక్రమాన్ని నిలిపివేయ వలసిందిగా ఆజ్ఞాపించాడనీ ఒక ప్రతీతి.

## కుతుబ్ షాహి ఉద్యానవనం

మహమ్మద్ వహీద్ ఖాన్

### పాత కోట

ఇప్పటికికూడా ఆ భవనాలు, బయటి ప్రాకారం బాగా శిథిలావస్థలో వున్నాయి. దీనిని "పాతకోట" అంటున్నారు. ఈ ప్రాంతాన్ని నేను క్షుణ్ణంగా పరిశీలించి చూసినప్పుడు ఆశ్చర్యపోయాను. ఈ పాడుపడిన కోట బయటి ప్రాకారం, అహమ్మద్ బోలా భాగ్ చుట్టూ వున్నగోడకు పడమటవేపున 1500 అ. పొడవున సమాంతరంగా వెళ్ళి బలమైన రెండు గుండ్రటి రాతిబురుజులు, కందకము, ఏటవాలు ప్రదేశము కలిగివుంది. ప్రాకారపు నిర్మాణంలో పెద్ద పెద్ద రాతి బండలు ఉపయోగించబడ్డాయి. దీని సింహద్వారం బురుజు ఆకారంలో 26 జేనల పొడవువుంది. లోపల విడివిడిగా శిల్పాలు చెక్కబడిన రాతి ఫలకలు అక్కడక్కడ కిందపడి వున్నాయి. మావటివాళ్ళతోసహా అందంగా అలంకరించబడిన రెండు ఏనుగులు ఒకదానితో ఒకటి పోట్లాడుకుంటున్నట్టు, జింకమీదకు ఒక పెద్దపులి దుముకుతున్నట్టు, చక్కటిదూడ తల్లిపాలు తాగుతున్నట్టు చెక్కబడిన యీ శిల్పాలు ఆ శిల్పికళా నైపుణ్యానికి చక్కటి నిదర్శనంగా నిలిచివున్నాయి. ఇవేకాక యిక్కడ యింకా అనేకమైక రాతిఫలకలు వున్నాయి. వీటన్నిటినీ హైదరాబాదులోని ప్రదర్శనశాలకు తరలించి వెలుగులోకి తీసుకురావడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. బీరారు ప్రభువు అనుమతి లభించిన అనంతరం వీటిని తరలించి ప్రదర్శనలో అలంకరించడం జరుగుతుంది.

బయట ప్రాకారంలో వాడిన యీ రకపు చెక్కిన రాతి ఫలకలను యితర ప్రాంతాల నుండి తీసుకొచ్చారు. వాటిని ఎక్కడనుండి తీసుకొచ్చారో వివరంగా తెలియడంలేదు. ఇప్పటికి కూడా యీ రకమైన రాతిపలకలు గోల్కొండకోట బంజారా దర్వాజావద్ద కనిపిస్తూనే వుంటాయి. కాకతీయులకు ముందు కాలంలోగాని, విజయనగర సామ్రాజ్యం తొలిరోజుల్లో కాని యీ రాతిఫలకలను సేకరించి వుండవచ్చు. తరఖీ ఫర్మాండ ప్రకారం, కోటగోడలో వాడిన రాళ్ళను నవాబ్ ముషిరుల్ ముల్క్ బహదూర్ క్రీ. శ 1799 లో సరూనగర్ నిర్మాణానికి వుపయోగించినట్టు వ్యక్తపడుతున్నది. ప్రస్తుతపు అహమద్ బోలా భాగ్‌నుసుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షా పరిపాలనా కాలంలోనే నిర్మించి వుండవచ్చునని, ఆనాడు అది తాజా ఫలాలకు ప్రసిద్ధి చెందినదని, ఆ తరువాత కాలగతిలో గతకాలపు ప్రాభవం కొట్టుకొని పోయిందని భావించడంలో ఎలాంటి సందేహమూ లేదు. మెట్లవరుసలు

వాటికి యిరువైపుల అందమైన రోమన్ ఆర్చీలతోను కూడిన యీ తోటలోనిచక్కటి బావిని ; సుందరమైన బాటలను, యితర భవనాలను బహుశా అసఫ్ జాహివంశంలో రెండవరాజైన నవాబ్ మీర్ నిజామ్ ఆలీ ఖాన్ బహదూర్ నిర్మించి వుండవచ్చును. ఈయన యీ తోటను వ్యాహ్యాళి కొరకై వుపయోగిస్తుండేవాడు. ప్రస్తుతం యీ ప్రాంతంలో ఆంధ్రదేశంలో మరెక్కడా లేనటువంటి ఒక అశ్వక్షేత్రాన్ని నెలకొల్పిన బీరారు ప్రభువు యిక్కడ సుందరమైన ఉద్యానవనాన్ని నాటించి పెంచుతున్నారు.

పునరావస్తు పరిశోధన దృష్టితో యీ ప్రాంతపు విశేషతను, ప్రాముఖ్యతనుతెలుసుకునే ప్రయత్నంలో పరిశోధించడానికి అనుమతించిన బీరారుప్రభువుకు నేను ఎంతైనా కృతజ్ఞతలు చెప్పుకోవలసి వుంది. అంతే గాదు యీ ప్రాంతాన్నంతటినీ ఉత్సాహంతో తిప్పి, విడివిడిగా ప్రతిదాని గురించీ తెలియజెప్పిన బీరారు ప్రభువు ఎ. డి. సి. మేజర్ ఉస్మాన్ ఆలీఖాన్‌కుకూడా నా కృతజ్ఞతలను చెప్పుకోకుండా వుండలేను. ★

---

(29 వ పేజీ తరువాయి)

ఈ కావ్యంలో భోగరాజుగారు తూర్పార బట్టారు. కావ్యప్రారంభంలో చేసిన సూర్యాస్తమయ వర్ణనలో సైతం వస్తునిర్దేశం చేసి చమత్కారాన్ని ప్రదర్శించారు. ఆ పద్య మిది,

'శ్రీగల యత్తగారు తొలి
చెప్పినరీతినిఁ గట్న మీయమిన్
జేగురు మోముతో నలిగి
చివ్వన నేగెడు క్రొత్తయల్లుడో
నాగ, నిజారుణ ప్రభల
నంతముగా దిశలన్ వెలుంగఁ దా
నేగె దివాకరుండు జగ
మెల్లఁ దమంబున దుస్తమమ్ముగన్.'

చంద్రోదయ వర్ణన సైతం ఈ పద్ధతిలోనే చేసి నవ్యత చూపారు. కన్యాశుల్కానికీ, వరశుల్కానికీ నిరసనగా గురజాడవారు 'పూర్ణమ్మ' రాయప్రోలు వారు 'స్నేహలత' అనే కృతులను రచించడం సుప్రసిద్ధం కాబట్టి వాటి వివరాల్లోకి పోవడం లేదు.

ఇకపోతే వనితలను వంటయింటి కుందేళ్ళలాగా అణచి ఉంచే పద్ధతిని ఆనాటి నవ్యకవి తీవ్రంగా ఖండించాడు. స్త్రీలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు విద్యా గౌరవాలకు అర్హతగలవా రని ఉద్ఘాటించాడు. స్త్రీలకుండే అష్టదిగ్బంధాలను దృష్టిలో పెట్టుకొని 'ఆడు పుట్టువు పుట్టుటే అసలు తప్పు' అని సంఘం మీద విసురు విసిరాడు.[6]

ఏకేశ్వరారాధనం, విగ్రహారాధన నిరసనం బ్రహ్మసమాజం లక్ష్యాల్లో ముఖ్యమైనవి. తెలుగునాట ఈ లక్ష్యాలను ప్రచారం చేయడానికి 'బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరములు' కొన్ని ముఖ్యపట్టణాల్లో నెలకొల్పబడినవి. వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్లు ఈ ఉద్యమానికి మూల స్తంభాలు. వారి సిద్ధాంతాలకు లోనైన యువకవులు కొందరు కవితా రూపంలో విగ్రహారాధన ధోరణిని నిరసించారు. నాటి ప్రముఖ యువకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

'శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్యశంఖము గొంతు తెరువలేదోయి
పూజారి గుడినుండి పోవలేడోయి
చిత్ర చిత్రపు పూలు చైత్రమాసపు పూలు
ఊరూర ఇంటింట ఊరకే పూచాయి
శిథిలాలయమ్ములో శిల కెదురుగా కుసుకు
పూజారి కొకటేని పూవు లేదోయి.'

అనే గేయచరణాల్లో, భక్తిభావ మున్నచోట పరమాత్మ డున్నా డనీ, అతడు ఆలయంలో బందీయై ఉండడనీ విగ్రహారాధన తత్వాన్ని మెత్తగా ఎత్తిపొడిచారు.

(సశేషం)

6. అబలా విలాపము : మంగిపూడి : 1914 ఆంధ్ర. ప. ఉగా. సంచిక.

# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్ర రంగం

లఘుపరిశ్రమల సర్వతోముఖాభివృద్ధి పట్ల ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న విషయం పాఠకులకు విదితమే. రాష్ట్రంలో లఘుపరిశ్రమల సత్వరాభివృద్ధికి సాధ్యమైన సౌకర్యాలన్నింటినీ కల్పించడమే ప్రభుత్వ లక్ష్యం.

పరిశ్రమల స్థాపనకు అవసరమైన ప్రాథమిక సదుపాయాలలో చౌకగా విద్యుచ్ఛక్తి సరఫరాచేయడం ఒకటి. భారీ పరిశ్రమలకు అవసరమైన విద్యుచ్ఛక్తిని రాయతీ రేట్లకు సరఫరాచేయడాన్ని ప్రభుత్వం 1961 వ సంవత్సరంలోనే ప్రకటించింది. ఇప్పుడు ప్రభుత్వం లఘుపరిశ్రమల విషయంలో విద్యుచ్ఛక్తి వాడకానికి సబ్సిడీ ప్రకటించింది.

అఖిలభారత లఘు పరిశ్రమల బోర్డు సిఫార్సులను పురస్కరించుకొని ప్రభుత్వం 20 హెచ్. పి. ల గరిష్ఠశక్తిని మించని లఘుపరిశ్రమల యూనిట్లకు విద్యుచ్ఛక్తి సబ్సిడీపథకాన్ని మంజూరు చేసింది. పారిశ్రామిక యూనిట్లు వాస్తవంగా చెల్లించేరేటుకూ, ఒక కె. డబ్ల్యు. హెచ్. కు 9 నయాపైసల చొప్పున అయ్యే మొత్తానికీ మధ్య వుండే వ్యత్యాసం సబ్సిడీగా ఇవ్వబడుతుంది. అయితే ఇది ఒక కె.డబ్ల్యు. హెచ్. కు 9 నయాపైసల చొప్పున గరిష్ఠ పరిమితికి లోబడి లభింపజేయబడుతుంది. లఘుపరిశ్రమల రంగంలోని ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్స్, కొయ్యపని, గాజు, ఎనామల్, పాటరీ, పింగాణీ, కెమికల్, ఫుడ్ ప్రొసెసింగ్‌లవంటి కొన్ని పరిశ్రమలు ఇప్పుడు విద్యుచ్ఛక్తి సబ్సిడీకి అర్హతకలిగివుంటాయి. విద్యుచ్ఛక్తి సబ్సిడీ పథకాన్ని మొదట మూడు సంవత్సరాల కొరకు మంజూరు చేశారు. విద్యుచ్ఛక్తి వాడకంలో లఘు పరిశ్రమలకు ఈ విధంగా లభింపజేసే సబ్సిడీని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమంగా భరిస్తాయి.

ఇప్పుడు ఇస్తున్న ఈ రాయతీవల్ల లఘుపరిశ్రమల రంగంలో ఎక్కువమందికి లాభించదు కాబట్టి లఘుపరిశ్రమల రంగంలోని పరిశ్రమలన్నింటికీ — వాటి విద్యుచ్ఛక్తి వాడకం పరిమితులతో నిమిత్తం లేకుండా — రాయతీ లభింపజేసే విషయాన్ని ప్రభుత్వం ఇందువల్ల కలుగగల సాధక బాధకాలను దృష్టిలో వుంచుకొని పరిశీలిస్తుంది.

అఖిలభారత చేతిపరిశ్రమలబోర్డు 24 వ సమావేశం హైదరాబాదులోని జూబిలీ హాలులో 1963 ఆగస్టు 17,18 వ తేదీలలో జరిగింది. దేశమంతటినుంచీ ఈ సమావేశంలో ప్రతినిధులు పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఆగస్టు 17 వ తేదీన సమావేశాన్ని ప్రారంభించారు. చేతి పరిశ్రమ వస్తువుల నాణ్యతను పెంపొందించవలసిన ఆవశ్యకతనూ, మధ్యతరగతి ప్రజలకుకూడా అందుబాటులో వుండడానికివీలుగా వీటి ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించవలసిన అవసరాన్నీ ముఖ్యమంత్రి తమ ప్రసంగంలో నొక్కిచెప్పారు.

ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల మంత్రి ప్రసంగిస్తూ, చేతిపరిశ్రమల వస్తువులు దేశవ్యాప్తంగా అమ్మకం కావడానికి వీలుగా ఈ ఉత్పత్తుల అంతరరాష్ట్ర మార్కెటింగ్ విధానాన్ని ప్రవేశపెట్టవలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు.

ఈ సమావేశంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలు చర్చించబడినవి. దేశంలో ఉత్పత్తి అయ్యే చేతిపరిశ్రమల వస్తువుల ఎగుమతిని ప్రోత్సహించడానికి సంబంధించిన అంశం ఈ చర్చలలో ప్రాధాన్యత వహించింది.

సమావేశానికి హాజరైన ప్రతినిధులకు (1) ముమ్తాజ్, గులిస్తాన్ బిద్రీ పారిశ్రామిక సహకార సంఘాలు, (2) హిమ్రూసొసైటీ, (3) ఐవరీ, హార్న్ సొసైటీ (సికింద్రాబాదు) (4) నిర్మల్ ఇండస్ట్రీలను, హైదరాబాదులోని ప్రభుత్వ చేతిపరిశ్రమలు, కుటీర పరిశ్రమల విక్రయశాలలను చూపించారు.

ఆంధ్రప్రదేశ్‌లో చేతిపరిశ్రమల అభివృద్ధికి పరిశ్రమశాఖ తీసుకున్న చర్యలపట్ల ప్రశంసలు వెల్లడించబడినాయి.

## సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్

సింగరేణి కాలరీస్‌లో 1963 ఆగస్టు నెలలో 2,74,303.9 టన్నుల బొగ్గును త్రవ్వితీశారు. గతసంవత్సరం ఇదేకాలంలో 2,71,946.9 టన్నుల బొగ్గును తీయడం జరిగింది.

1963 ఆగస్టు నెలాఖరు నాటికి 21,29,396.4 టన్నుల బొగ్గును త్రవ్వితీయగా క్రిందటి సంవత్సరం ఇదే మాసాంతం వరకు 19,71,347.8 టన్నుల బొగ్గును తీయడం జరిగింది. ★

# తెలంగాణాలో ఉత్తమ గ్రామం "కెరెవెల్లి"

పి. ఎన్. వి. రావు

హైదరాబాదు జిల్లాలోని కెరెవెల్లి గ్రామం తెలంగాణా ప్రాంతమంతటిలోకీ ఉత్తమ పంచాయతీగా ఈ సంవత్సరం ఎన్నిక చేయబడింది. దీనికి ప్రభుత్వం త్వరలో రూ. 15,000 లను బహూకరిస్తుంది.

హైదరాబాదు—బొంబాయి రైలు మార్గంలో వున్న వికారాబాదు పట్టణంనుంచి కెరెవెల్లి గ్రామం వరకు నాలుగుమైళ్ళ పొడవున కంకరరోడ్డు నిర్మించబడుతున్నది. ఈ రోడ్డు నిర్మాణానికి అయ్యే ఖర్చులో నాలుగవ వంతు వ్యయాన్ని భరించడం ద్వారా ఈ గ్రామ పంచాయతీ, రవాణా సౌకర్యాలను ఏర్పరుచుకునే ముఖ్య విషయంలో నేటి కాలపరిస్థితులతో పోటీ పడుతున్నది. కెరెవెల్లి, వికారాబాదుల మధ్య నిర్మితమవుతున్న నాలుగుమైళ్ళ కంకర రోడ్డు సుందరమైన అనంతగిరి లోయల గుండా సుప్రసిద్ధమైన అనంతగిరి ఆరోగ్య కేంద్రాన్ని చుట్టివేస్తూ వెళ్తుంది.

పబ్లిక్‌వర్క్సు శాఖవారి పర్యవేక్షణ క్రింద ఈ రోడ్డు నిర్మాణం జరుగుతున్నది. అనేక మంది స్త్రీ, పురుషులు రాళ్ళు పగలగొడుతూనో, నేలను చదునుచేస్తూనో ఇక్కడ కనిపిస్తారు. తమ గ్రామానికి చక్కని రోడ్డు మార్గాన్ని నిర్మించుకోవడానికి వారు ఎంతో ఆసక్తితో పనిచేస్తున్నారు.

కెరెవెల్లి (ఇది కెరె-వెల్లి అనే కన్నడ, తెలుగు పదాల సమామ్నాయ మయినట్లూ, తేటతెల్లని తటాకం అని దీని అర్థమైనట్లు తెలుస్తున్నది) గ్రామం సంప్రదాయకమైన తన ఘనతను తిరిగి చాటుకుంటున్నది. ఈ గ్రామ పెద్దలు, చిన్నతరహా సేద్యపు నీటి వనరుల పథకం, రక్షిత మంచినీటి సరఫరా పథకాల అమలుకు ఉద్యమించారు.

దిగువ తెలిపిన కారణాలవల్ల కెరెవెల్లి గ్రామం, తెలంగాణా ప్రాతంలోని. 9 జిల్లాలలోనూ ఉత్తమ గ్రామంగా ప్రకటించబడినట్లు ప్రభుత్వ వివరణలు వెల్లడిస్తాయి: (అ) ఈ పంచాయతీ నూటికి నూరువంతులు పన్నులు వసూలుచేసింది. పన్ను బకాయిలు కానీ, ఎగవేతలు కానీ ఏమీలేవు; (ఆ) ఈ పంచాయతీలో 186 కంపోస్టు గోతులు త్రవ్వబడినవి. తెలంగాణా ప్రాంతంలో ఈ సంవత్సరంలో ఇన్ని కంపోస్టుగోతులు మరే గ్రామంలోనూ త్రవ్వబడలేదు; (ఇ) గ్రామ పంచాయతీ బ్యాంకు విజయవంతంగా పని చేసింది. మిగులు ఆహార ధాన్యాన్ని ఇది నిలువచేసింది; (ఈ) మేలురకం పని ముట్లను, ఎరువులను ఇతర శాస్త్రీయ పరికరాలను వ్యవసాయదార్లు గరిష్ఠ స్థాయిలో ఉపయోగించు కొనగలిగారు; (ఉ) బెల్లం ఉత్పత్తి కొరకు పారిశ్రామిక సహకారసంఘం ప్రారంభించ బడింది; (ఊ) అరుగురు సభ్యులుగల పంచాయతీ సమావేశాలకు హాజరీ 95 శాతం వరకు వుంది.

గ్రామీణ వాలంటీర్ దళంలో అప్పుడే 100 మంది సభ్యులు చేరారు. దళపతి శ్రీ నరసింహారెడ్డి నాయకత్వం క్రింద ఈ దళసభ్యులు గ్రామంలో 3 వయోజన విద్యా కేంద్రాలను నిర్వహిస్తున్నారు. ఈ చిన్న గ్రామం జనాభా 1,425. వీరు తలకొక రూపాయి చొప్పున రూ. 1,425 లను జాతీయరక్షణనిధికి విరాళంగాసమర్పించారు.

ముఠా తత్వాలు లేకుండా గ్రామ స్వపరిపాలన సాగించడం ఈ గ్రామం ఘనతఅని బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు శ్రీ రామ్‌రెడ్డి అంటారు. సర్పంచ్ శ్రీ గాల్‌రెడ్డిని అంతా గౌరవిస్తారు.

శ్రీ గాల్‌రెడ్డి స్వయంగా రైతు. తమ పంచాయతీ విజయం సాధించడానికి కేవలం తానే కారకుడు కానంటారు ఆయన. తమ పంచాయతీ సభ్యులు ఆరుగురూ అందుకు కారకులనీ, వారి సహాయం తనకుఎల్లప్పుడూ లభిస్తుందనీ, అధికారుల మార్గదర్శకత్వం కూడా దోహదం చేసిందని శ్రీ గాల్‌రెడ్డి అంటారు.

ఆయన 'యునిసెఫ్' సేవాభావాన్ని ఎంతో శ్లాఘించారు. ఈ పంచాయతీ పాఠశాలలో 120 మంది బాలబాలికలకు ఈ సంస్థవారు మధ్యాహ్న భోజనం సరఫరా చేస్తున్నారు.

తమ గ్రామంలో మహిళల 'నూతన దృష్టి'కి దృష్టాంతంగా మహిళా మండలిని ఆయన పేర్కొంటారు.

(మిగతా 38 వ పేజీలో)

"నా తల్లి నాకేమీ యివ్వలేదు. ఆమె ప్రేమకోసం జీవితమంతా తపించాను: కాని నా తపన ఫలించలేదు. అంతటా నాకు అంధకారమే ఎదురైంది. నా జీవితంలో కాటుకవంటి చీకటి వ్యాపించిపోయింది. ఆ అంధకారంలోనుంచి ఒకనాడు నాకొక కాంతిరేఖ కన్పించింది. ఆవెలుగు నేనెప్పుడో చూసిన మధుర స్వప్నాన్ని గుర్తుకు తెస్తున్నది."

నేను రాయబోయే కథకు యివి ప్రారంభ వాక్యాలు: ఎవరిదో తియ్యటిగొంతు ఒకటి అకస్మాత్తుగా విన్పించడంతో నేను రాయడం మానివేసి అటువైపు చూశాను.

"పొయ్యి వెలిగించమంటారా ?"

పది పన్నెండు సంవత్సరాల కుర్రవాడొకడు అమాయకంగా నా వైపు చూస్తూ నిలబడి వున్నాడు.

"నేను కట్టెలు కూడా కొట్టి తీసుకరాగలనండీ!" అని అన్నాడు, నన్ను మాట్లాడనివ్వకుండానే!

"నేను అనాధాశ్రమానికి కబురు చేశాను. అక్కడినుండి ఎవరైనా రావచ్చు!...నువ్వు అక్కర్లేదు." — అని అన్నాను, కొంచెం నిర్లక్ష్యంగా! నేను మళ్ళా రాసుకోవడంలో మగ్నమైనాను.

ఆ కుర్రవాడు అలాగే కొంచెంసేపు నా వైపుచూస్తూ నిలబడ్డాడు. చివరకు నెమ్మదిగా — "నేను అనాధాశ్రమం నుంచే వచ్చానండీ!" అని అన్నాడు.

నేను మొదటిసారిగా అతనివైపు పరీక్షగా చూశాను. అతని నల్లటి కళ్ళు మెరుస్తున్నాయి; పాలభాగం విశాలంగా వున్నది. మొహంచాలా అందంగా ముచ్చటగొలుపుతున్నది. తలమీద చిన్ని చిన్ని వెంట్రుకలున్నాయి. అయితే ప్రపంచంలోని అమాయకత్వమంతా అతని మొహంలోనే ప్రతిబింబిస్తున్నట్లుగా మాత్రం స్పష్టంగా కన్పిస్తున్నది.

"నువ్వు ఇంత చిన్నవాడివికదా, మరి కట్టెలు ఎలా కొట్టగలవు ?"

"నేను చాలా సంవత్సరాల నుంచి ఈపని చేస్తున్నానండీ!" అని నిస్సంకోచంగా మూలనున్న గొడ్డలి తీసుకొని బయటికి నడిచి వెళ్ళాడు.

నేను కథారచయిత్రిని! కథలు రాయడం అంటే నాకెంతో సరదా! కథావస్తువు సేకరించే నిమిత్తం నేను వందలాది మైళ్ళు ప్రయాణంచేసి రమ్యమైన కాశ్మీరు వచ్చాను. ఇక్కడి వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా వుంటుందని, ఇక్కడి ప్రకృతి రమణీయకత నాలో కొత్త కొత్త ఊహలను స్ఫురింపజేస్తుందని, కథలకు కావలసిన వస్తువు ఇక్కడ కోకొల్లలుగా లభిస్తుందని ఆలోచించి మరీ వచ్చాను. ఇక్కడ కూర్చుని పది కథలు రాసుకుంటే జీవితం ధన్యమవుతుందని నా భావన! కాని నేనిక్కడ కాలు బెట్టిన మరుక్షణం నుంచి ఒకటే వర్షం! చలి విపరీతంగా వున్నది. రాత్రింబవళ్ళు గదిలోని పొయ్యి రావణాసురుడి కాష్టంలాగా కాలుతూవుంటే తప్ప ఈ చలికి ఆగేట్టు కన్పించడంలేదు. వసారాలో తడిసిన కట్టెలు గుట్టలుగా వున్నాయి. కాని వాటిని పగలగొట్టి పొయ్యిలో వేసేందుకు ప్రత్యేకంగా ఒక మనిషికావాలి. ఈ విషయమే చౌదరితో చెబితే అక్కడికి సమీపంలోవున్న అనాధాశ్రమం నుండి ఎవరినైనా పంపిస్తానని అన్నాడు.

కాశ్మీరీ కథ

మూలం :

శ్రీమతి నూర్ షా

అనువాదం :

దండమూడి మహీధర్

కట్టెలు కొడుతున్న ధ్వని నా చెవుల్లో మారుమోగుతున్నది. ఒకగంట అయ్యాక అతను లోనికి వచ్చాడు. చాలా కట్టెలు కొట్టాడు. అతని పనిని చూసి నేను ఆశ్చర్యపోయాను.

పొయ్యిదగ్గర తాను కొట్టిన కట్టెపేళ్ళను పెడుతూ "సాయంత్రం మళ్ళా వస్తానండీ" అని అన్నాడు, ఆ కుర్రవాడు.

పర్సులోనుంచి ఒక రూపాయినోటు తీసి అతని చేతి కందించాను. అతను ఆ రూపాయి నోటును తీసుకొని అలాగే నా వైపు చూస్తూ నిలబడ్డాడు. ఏదో చెప్పాలని వున్నది; కాని నోటినుంచి మాటలు పెకిలి బయటికి రావడం లేదు. ఏమిటో అడగాలనిపించింది. కాని నేను అడిగే లోపలే అతగాడు బుర్రు పిట్టకు మల్లే తుర్రున పారిపోయాడు.

సాయంత్రం కట్టెలు కొడుతున్న సన్నని ధ్వని నా చెవుల్లో పడింది. కిటికీలోనుంచి బయటికి తొంగి చూశాను. వసారాలో ఆ చివర నిల్చొని కట్టెలు కొడుతున్నాడు. అలాగే నేనతన్ని చూస్తూ కొంచెం సేపు నిలబడ్డాను. ఆ తరువాత నేను లోపలికి వెళ్ళి కథా రచనలో నిమగ్నురాలనయ్యాను.

అకస్మాత్తుగా కట్టెలు కొడుతున్న ధ్వని ఆగిపోయింది. ఆ కుర్రవాడు గదిలోకి వచ్చాడు.

'చూడండి!' లోపలికి రావడంతోనే అతడన్నాడు—'మీ రూపాయి మీరు తీసుకోండి!'

"ఏం? ఎందుకని?" — అని ఖంగారు పడుతూ అతని వైపుచూసి ప్రశ్నించాను.

ఉదయం కట్టెలు కొడుతూ వుంటే

**అనువాదభారతి**

గొడ్డతి విరిగిపోయిం దండీ ! అందుకని...'

"ఇందులో నీ తప్పేముంది ? చౌదరితో చెప్పి బాగు చేయిస్తానులే !"

అతడలాగే నా వైపు చూస్తూ నిలబడి పోయాడు. అతని చేతిలో రూపాయ నోటు వున్నది.

'కూర్చో !' అన్నాను,

అతడు కూర్చున్నాడు.

'నీపే రేమిటి ?'

'రాజా !'

'రాజా.' చాలా బావుంది పేరు. ఈ అనాధాశ్రమంలో ఎప్పటినుంచి వుంటున్నావు ?"

"నే నిక్కడ చేరినప్పుడు నా వయస్సు నాలుగు సంవత్సరాలట !"

ఆ తరువాత నేనూ మాట్లాడ లేదు; అతనూ మాట్లాడలేదు. ఉభయులం మౌనంగా ఉండిపోయాం. నేనురాస్తున్న కథకు నగిషీలు చెక్కడంలో మగ్నమై పొయ్యాను. మధ్య మధ్యన నేను తలెత్తిచూస్తే అతను నా వైపే చూస్తూ వుండడం గమనించాను. ఇంతలో నా కుక్కపిల్ల టోనీ వచ్చింది. ఇట్టే క్షణంలో కుక్కపిల్లకూ, అతనికీ స్నేహం కలిసింది, ఆ రెండు ప్రాణులూ ఆడుకోవడంలో మగ్నమైనాయి. కుక్కపిల్లల మనస్తత్వంలోనూ, చిన్న పిల్లల మనస్తత్వంలోనూ అట్టే భేదం లేదోమో ననిపిస్తుంది నాకు !

నేను కథా రచనలో మగ్నమైనాను; అతనూ కుక్కపిల్లా ఆటల్లో మగ్నమైనారు. అప్పుడప్పుడు అతను లేచి పొయ్యిలో కట్టె పేళ్ళు వేస్తున్నాడు.

చీకటి పడింది.

'పొద్దు పూకింది! ఇక నువ్వు వెడతావా?' అని అడిగాను.

ఎందుకో అతను కంపించి పోయినట్టు కన్పించాడు. నా వైపు అదోక రకంగా చూస్తున్నాడు.

'రేపు ఎప్పుడు రమ్మంటా రండీ ?" అని ప్రశ్నించాడు.

పసారాలోకి తొంగి చూశాను.

"కట్టెలు చాలా కొట్టిసట్టున్నావు. రేపు రానవసరం లేదులే !" అని అన్నాను.

చూస్తూండగానే అతని మొహం వివర్ణమై పోయింది. అతని కనుకొలకులు రెపరెప లాడినాయి.

"మీరు రమ్మంటే—రేపు ఉదయం కూడా వస్తాను. మీరు నాకు కూలి యివ్వవద్దు లెండి !" అన్నాడు నెమ్మదిగా !

నాకు ఆశ్చర్యం వేసి అతని వైపు చూశాను, అతని కళ్ళల్లో వచించడానికి వీల్లేని యాచనా భావం ద్యోతకమైంది.

"కూలి అక్కర్లేదూ ? ఏం ? ఎందుకని?"

"అనాధాశ్రమంలోని జీవితంతో నాకు విసుగు పుట్టిందండి !" —దృష్టిని నేలమీదికి నిగిడ్చి అన్నాడు — "పని లేకపోతే వాళ్ళు బయట అడుగు పెట్టనివ్వరండీ !"

నేను కొన్ని క్షణాలపాటు మౌనంగా వుండి పోయాను.

"సరే అయితే, రేపు సాయంత్రం రా ! కట్టెలు కొట్టనవసరం లేదు — పచ్చి టోనితో ఆడుకో ! సరేనా ?" అని అన్నాను !

ఆ రెండవ రోజు ఉదయం బయటికి వచ్చేప్పటికి టోనితో అతను ఆడుకోవడం చూశాను.

"ఏమోయ్ ! రాజా ! ఇంతతొందరగా వచ్చావేమిటి ?"

"రాత్రి బాగా వర్షం పడింది కదండీ ! బహుశా ఎక్కువ కట్టెలు కావలసివుంటాయేమోనని వచ్చాను."

అతను లోపకిలి వచ్చి పొయ్యిలో పేళ్లు వేస్తున్నాడు. నేను దానికి ఎదురుగా కూర్చొని కాఫీతాగు తున్నాను. ఏదో చెప్పడానికి అతని పెదాలు ప్రయత్నిస్తున్నాయి; కాని ఏదో సంకోచం అతన్ని పీడిస్తున్నది. చివరకు వుండబట్టలేక నేనే అడిగాను—"ఏం రాజా! నువ్వు నాతో ఏదోచెప్పడానికి సందేహిస్తున్నట్టున్నది ! ఆ సంగతేమిటో నిస్సంకోచంగా చెప్పు ! ఏం పరవాలేదు !" అని !

"మా అమ్మ అచ్చంగా మీలాగానే వుంటుంది" అని అన్నాడు అకస్మాత్తుగా, నా మొహంలోకి చూస్తూ.

నేను నిలువునా నిర్విణ్ణురాలనై పోయాను. అప్పుడనుకున్నాను—ఈ మాట చెప్పడానికే కాబోలు అతను మథనపడుతున్నాడని.

"నాలుగు సంవత్సరాల వయస్సులోనే నువ్వు ఈ అనాధాలయంలో చేరావుకదా, మీ అమ్మ నీ కెలా గుర్తున్నది ?"

"మా అమ్మ యింకా జీవించేవున్నది !" అని అన్నాడు, విచిత్రమైన ధోరణిలో.

—అతని మాటలు వినేప్పటికి నా మనస్సుకు ఎంతో బాధ వేసింది. నా తల తిరిగి పోయింది. ఇంత అందమైన, అమాయకమైన కొడుకును వదిలి వుంటున్న ఆ తల్లి ఎంత నిర్దయురాలు ! నాలుగు సంవత్సరాల వయస్సులోకూడా ఇతని కళ్ళల్లో ఇంత తేజస్సు ఉట్టిపడుతూ వుండేది కాబోలు ! ఎంత అమాయకమైన మొహం ! అనాధాలయంలో రాజాకు తిండీ బట్టా లభిస్తూ వుండవచ్చు; కాని మాతృ ప్రేమ లభించడం మాత్రం దుర్లభం కావచ్చు ! తల్లికోసం అతని మనస్సు నిత్యం ఆరాటపడుతూ వుంటుంది కాబోలు ! ఆమె కోసం రకరకాల కలలు కంటూ వుంటాడు కాబోలు ! ఆమె జీవించి వుండికూడా తన కొడుకుకు దూరంగా వుండడం సహించరాని విషయం !—" నా మనస్సు పరిపరివిధాల ఆలోచించింది.

నాలో అసంఖ్యాకమైన ప్రశ్నలు ఉదయించాయి. కాని వాటిని నాలో నేనే అణచు

కొన్నాను— అతన్ని అడిగి బాధ పెట్టడం యిష్టంలేక :

కాని వుండబట్టలేక అడిగాను—'నువ్వు మీ యమ్మను కలుసుకుంటూ వుంటావా ?' అని.

"సెలవిలో కలుసుకుంటూ వుంటాను !"

నా గుండెలమీద బరువైన బండలు పెట్టినట్టయింది. 'మీ యమ్మతో వుండక ఈ అనాథాశ్రమంలో ఎందుకుంటావని అడగాలనిపించింది. కాని అడగలేదు.

"మీ అమ్మ ఎలా వుంటుంది ?" అని ప్రశ్నించాను.

"అచ్చంగా మీలాగానే వుంటుంది. భేదం ఏమీ లేదు"—అని అన్నాడు అతను.

నా వుద్దేశ్యం ఒకటికాగా అతను చెప్పింది మరొకటి ! అలా అడిగినందుకు నేను సిగ్గుపడ్డాను.

ఈసారి అతనే చెప్పుకుపోయాడు— "ఆమెకు నేనంటే ఎంతో ప్రేమ ! ఈ బనీనూ, ఈ కోటూ ఆమే నాకు పంపించింది. ఈ మధ్య చాలాకాలంనుంచి ఆమె వుత్తరంకూడా రాయలేదు. ఎలా వున్నదో, ఏమో !''

అతను ఈ మాటలు చెబుతూవుంటే నేను అతని కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయాను. తల్లినిగురించి మాట్లాడుతున్నంతసేపూ అతని కళ్ళల్లో ఏదో దివ్యమైన కాంతి ఒకటి ప్రస్ఫుటించింది.

''మీ రిచ్చే డబ్బులతో నేను నా తల్లికి మంచి బట్ట ఒకటి కొంటాను."

"తప్పకుండా కొను !" అన్నాను నేను.

"మా అమ్మ కట్టూ బొట్టూ, మొహం అంతా మీలాగానే వుంటుంది" అన్నాడు రాజా !

చాలాసేపు అతని మాటలే మాటిమాటికి నా చెవుల్లో ప్రతిధ్వనించాయి. నేను మారు మాట్లాడకుండా అలాగే చూస్తూ వుండిపోయాను. అతను వెళ్ళిపోవడానికి బయలుదేరినప్పుడు అతని చేతికి కొన్ని రూపాయలు అందించాను.

ఆ రాత్రి నాకు సరిగా నిద్ర పట్టలేదు. రాత్రి అంతా జాగరణ చేశాను—తెల్లవారేప్పటికి నా ఆరోగ్యం తారుమారయినట్టనిపించింది. తిరిగి వెళ్ళిపోవడం ఉత్తమమని నిర్ణయించుకున్నాను. పైగా నాకు కావలసిన కథావస్తువులుకూడా నాకు లభించాయి. ఇక యిక్కడ వుండడం అనవసరమనిపించింది !

నేను చౌదరిని పిలిపించి నేను వెళ్ళిపోతున్న విషయం రాజాకు కబురు చేయించమని చెప్పాను. పన్నెండు గంటలదాకా నేను రాజాకోసం చూస్తూ కూర్చున్నాను. కాని అతను రాలేదు. చౌదరి మళ్ళా అనాథాశ్రమానికి వెళ్ళివచ్చాడు. రాజా బయటికి వెళ్ళాడని చెప్పారట ! ఇక చేసేదిలేక— రాజాకు యివ్వవలసిందని కొంతడబ్బు— చౌదరి చేతికిచ్చాను.

నేను అన్నీ సర్దుకుని కార్లో కూర్చున్నాను. స్టార్ట్ చేయడానికిపూర్వం ఎందుకో వెనుక సీటువైపు చూశాను. అక్కడేదో వస్తువు కన్పించింది నాకు ! ఏమిటోనని చూశాను. కాగితంలో జాకెట్టు గుడ్డ ఒకటి వున్నది. చౌదరిని పిలిచి—'ఎవరీ పొట్లం యిక్కడ పెట్టారు ?' అని అడిగాను.

ఆ పొట్లంలో వున్న జాకెట్టు గుడ్డ చూసి చౌదరి విస్తుపోయాడు. 'నిన్న బజారులో రాజా ఈ జాకెట్టు గుడ్డ కొనడం నేను చూశానండి ! మరి ఆ గుడ్డ కార్లోకి ఎలా వచ్చిందో నాకే అర్థం కావడంలేదండీ !' అని అన్నాడు చౌదరి.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను'' అని అన్నాను—"రాజా ఈ జాకెట్టు గుడ్డ పాపం వాళ్ళ అమ్మకోసం కొని వుండవచ్చు!''

"వాళ్ళ అమ్మ కోసమా ?" చౌదరి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అన్నాడు—"ఎవరి సంగతి మీ రనేది ! రాజానుగురించేనా ? అతనికి తల్లిలేదండీ ! రాజా నాలుగు సంవత్సరాల వయస్సులో వున్నప్పుడు అతని తల్లి చనిపోయింది. ఆమె చనిపోవడం నాకు బాగా తెలుసు !"

నేను మారు మాట్లాడలేదు.

రాజా కొన్న జాకెట్టు గుడ్డను చూస్తూ వుండిపోయాను. ★

---

## కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 సెప్టెంబరు నెలలో ఈ క్రింద పేర్కొన్న గ్రామాలలో కమ్యూనిటీ రేడియోసెట్లను నెలకొల్పారు :

చిత్తూరు జిల్లా: వెలవేడు, కమ్మకొత్తూరు.

కర్నూలు జిల్లా : ఉల్చల.

మహబూబ్ నగరం జిల్లా : ధర్మవరం, బెజవరం.

నల్గొండ జిల్లా : బేతవోలులోని ఆరు బయలు జైలుశిబిరం, గానుగబండ చిలుకూరు (ఎం), చౌళ్ళరామవరం.

విశాఖపట్నం జిల్లా: బోయపురంపల్లి తాళ్ళవర్ల.

కృష్ణా జిల్లా . గోపువారిపాలెం, చంద్రపట్ల, కలగర, గొల్లమండ్ల, పొన్నవరం, వల్లగిరి, వెల్దుర్తిపూడి - గుమ్మడిదుర్రు శివారు-, దాచవరం, గోకరాజుపల్లి, మరెపల్లి, చీములపాడు, సోమవరం, కొత్తగూడెం, అయిగొలనుపేట, కోటపాడు, రామన్నపాలెం-సున్నంపాడు- II శివారు-, పాతనాగలూరు, నందిగామ, కందులపాడు చేగిరెడ్డిపల్లి, మొర్సుంపల్లి – మైలవరం శివారు.

ఆదిలాబాదు జిల్లా . మందమర్రి.

వరంగల్ జిల్లా . ఓరుగొండ, కంపల్లి. ★

(33 వ పేజీ తరువాయి)

ప్రస్తుతం ఈ పంచాయతీ సభ్యులలో ఆడవారు లేరు. కాని మరుసటి సంవత్సరం జరిగే ఎన్నికలలో ఈ లోటు తీరగలదని ఆశించ బడుతున్నది.

తమకు బహుమతిగా లభించే 15,000 రూపాయలను ఏ విధంగా వినియోగించ దలిచిందీ తెలుసుకొన గోరి ఆ విషయమై అడిగినప్పుడు కెరెవెల్లి పంచాయతీ అధ్యక్షుడు ఇదమిత్థంగా ఏమీ నిర్ణయించుకో లేదని సమాధాన మిచ్చారు. "బహుశా ఆ సొమ్ముతో ట్రాక్టరు కొనుక్కొని వ్యవసాయం అభివృద్ధి పరుచుకోవచ్చు"నని కూడా ఆయన అన్నారు.

"మాకు శక్తినివ్వండి, తరువాత మా బాధ్యతను మేము నిర్వర్తిస్తాము" అంటారు ఆత్మవిశ్వాసంగల శ్రీ గాల్ రెడ్డి. శక్తి అంటే విద్యుచ్ఛక్తి అని ఆయన అర్థం. ప్రస్తుతంతమ గ్రామంలో కిరసనాయిలుతో వెలుగుతున్న వీధిదీపాలస్థానే విద్యుద్దీపాలు రావాలనీ, నీటి పంపులను నడుపుకోవడానికి, లఘు పరిశ్రమలను ప్రారంభించడానికి తమకు విద్యుచ్ఛక్తి అవసరమని ఆయన అన్నారు.

"ఆయిల్ ఇంజన్ను మరమ్మతు చేయించడానికి ఈ మధ్యాహ్నం నేను హైద్రాబాదుకు వెళ్తున్నాను. మా జీవితాలను ఆరోగ్యప్రదం, సంతోషకరం, భాగ్యవంతం చేసుకోవడానికి మేము విద్యుచ్ఛక్తిని పొందదలిచాం," అంటారు శ్రీ రెడ్డి మైదానాలవైపుకు, లోయకు ఆవలగల రైలుకట్ట వైపుకు సాలోచనగా చూస్తూ, ఇతోధికంగా పౌర సౌకర్యాలను గలిగివుండి, త్వరితంగా జీవితం సాగిపోయే ఆ ప్రదేశాన్ని వీక్షిస్తూ.

"మాకు ఇతోధికంగా శక్తిని ఇవ్వండి," అని శ్రీ రెడ్డి ఈ యేడు దసరానాడు ప్రార్థించుకున్నారు. 1959 వ సంవత్సరంలో ఇదేరోజున కెరెవెల్లి పంచాయతీ అవిర్భవించింది.

"ఈ బహూకృతి మాకు సవాలువంటిది. వచ్చే సంవత్సరాలలో ద్విగుణీకృతోత్సాహంతో సత్కార్యాలు ఆచరించడానికి ఇది మాకు అవకాశం కలిగించింది," అంటారు ఆ సర్‌పంచ్. ఆయన ఇంకా ఇలా అన్నారు, "ఈ బహుమతి సొమ్ముకు తోడుగా విరాళాలు ప్రోగుచేయడానికి మా గ్రామస్థులమంతా ఈ సంవత్సరం భూమి శిస్తుగా, వృత్తిపన్నుగా 50 శాతం మొత్తాన్ని అధికంగా చెల్లించడానికి స్వచ్ఛందంగా,ఏకగ్రీవంగా నిశ్చయించుకున్నాము."

1962 వ సంవత్సరంలో ఈ పంచాయతీకి భూమిశిస్తుగా రూ. 1,130 ల మొత్తం లభించింది. ఈ గ్రామంలో 910 ఎకరాలలో సేద్యం జరిగింది. భూమిశిస్తుకాక రాష్ట్ర ప్రభుత్వం నుంచి రూ. 1,000 ల గ్రాంటు కూడా లభించింది.

గ్రామ పాఠశాల కొరకు ఉద్దేశించబడిన మట్టి గోడలతో నిర్మించబడిన గదిలో ప్రస్తుతం పంచాయతీ కార్యాలయం వుంది. సాముదాయిక రేడియో, గ్రామస్థుల రేడియో గోష్ఠి, యువకమండలి కార్యకలాపాలకు కూడా ఇదే కేంద్రం. నూత్న భవన నిర్మాణం చురుగ్గా సాగుతున్నది. దీనికి ఒకరైతు నివేశనస్థలాన్ని విరాళంగా ఇచ్చాడు. వచ్చేనెల బహుమాన ప్రదానోత్సవం జరిగే నాటికి భవననిర్మాణం పూర్తి చేయాలని సర్‌పంచ్ ఆశిస్తున్నారు.

---

## సంఘర్షణ ✲ "చిత్రభాను"

ఈ అపజయ మొక విరామం
జీవిత మొక సంగ్రామం
కన్నుల మిరుమిట్లు గొలుపుతాను
కాని—దయాభిక్షను కోరను
వరదానాన్ని అర్థించను
మధురస్మృతుల మమతకోసం
నా శిథిల సదస్సుకోసం
ఈ ప్రాణాన్ని తీసుకో!
విశ్వసంపత్తిని కోరను
వరదానాన్ని అర్థించను
జయాపజయాలలో
కించిత్తూ భయంలేదు
సంఘర్షణ పథంలో
అన్నిటినీ సహిస్తాను
వరదానాన్ని అర్థించను
దౌర్బల్యమా! నన్ను తాకకుపో
నీవు గొప్పదానివైపో
నా హృదయావేదనను
వ్యర్థంగా త్యాగంచెయ్యను
వరదానాన్ని అర్థించను
హృదయానికి తాపం యిచ్చినా
నాకు ఘోరశాపం యిచ్చినా
ఏమైనా చేసుకో! కాని —
కర్తవ్యపథంనుండి పారిపోను
వరదానాన్ని అర్థించను.

[హిందీ ఆధారంగా]

# పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ

గాంధీజీ జన్మదినోత్సవమైన 1963 అక్టోబరు 2వ తేదీనాటి సాయంత్రం విజయవాడ ముఖ్యంగా విద్యాధరపురంలోని పాలఉత్పత్తుల ఫ్యాక్టరీ భవననిర్మాణం ప్రదేశం కన్నుల పండువుగా విలసిల్లింది. [illegible] ముఖ్య భవనానికి రోడ్డు [illegible] జనసమూహంతో నిండిపోయింది. ఆహూతులకై నిర్మించబడిన ప్రత్యేక షామియానాలో 5000 మందికి పైగా సమకూడారు. పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలకుచెందిన ప్రముఖ పాలఉత్పత్తిదారులు కూడా అందులో పాల్గొన్నారు. ముఖ్యమంత్రి డాక్టర్ యన్. సంజీవరెడ్డి, వ్యవసాయశాఖామాత్యులు శ్రీ ఎ. బలరామిరెడ్డి, ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ వై. శివరామ ప్రసాద్, ఎక్సైజ్, మధ్యనిషేధ శాఖలమంత్రి శ్రీ యం. ఆర్. అప్పారావులను పాల కమీషనర్ ప్రవేశ ద్వారంవద్ద ఆహ్వానించి తీసుకెళ్ళారు. స్థానిక పాఠశాల విద్యార్థులు దారిపొడవునా పూరేకుల వెదజల్లుతూ, జాతీయ, యునెసెఫ్ పతాకాలను ఎగురవేస్తూ అతిథులకు స్వాగతం పల్కారు. మంత్రులు బాల బాలికలకు పాలు పంచారు. సమీకృత పాల ప్రాజెక్టులో ఉత్పత్తి ప్రారంభం అయ్యాక పాల పంపిణీ కార్యక్రమాన్ని ప్రారంభిస్తారు. ఆతర్వాత ముఖ్య మంత్రి పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ భవనానికి శంఖుస్థాపన చేశారు. వ్యవసాయ శాఖా మంత్రి పరిపాలనా వ్యవహారాల భవనానికి శంఖుస్థాపన చేశారు.

భారత అధ్యక్ష, ఉపాధ్యక్షులు, ప్రధాన మంత్రి, కేంద్రప్రభుత్వ ఆహార, వ్యవసాయ మంత్రి, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ల సందేశాలను చదివారు. న్యూఢిల్లీలోని యునెసెఫ్ ప్రాంతీయ డైరెక్టరు డాక్టర్ చార్లెస్ ఎగ్గర్ సందేశాన్ని [illegible] శ్రీ [illegible] బాబిన్‌సన్ చదివారు. యీ సందర్భంగా ప్రచురించబడిన సావెనీర్‌ను ఎక్సైజ్‌మంత్రి ఆవిష్కరించారు.

## గ్రామీణ ఆర్థిక ప్రగతికి సహాయం

పాల కమీషనర్, స్వాగతోపన్యాసంలో కృష్ణాడెల్టా ప్రాంతంలో సమీకృత పాల ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన పూర్వాపరాలను, ఇంతవరకు జరిగిన కృషి, సాధించిన పురోగతిని గూర్చిన వివరాలను తెలియజేశారు. భారతప్రభుత్వ క్షీరక్షేత్రాభివృద్ధి సలహాదారు, క్షేత్రనిర్మాణ ఇంజనీర్లు, యునెసెఫ్ ఇంజనీర్లు, ఎఫ్. ఎ. ఒ. సిబ్బందీ సహాయ సలహాలతో తయారుచేసిన ప్రణాళికా విషయాలను ఆయన వివరించారు. ముఖ్యమంత్రి శంఖుస్థాపన చేసిన భవన నిర్మాణం ఖర్చు రు. 38 లక్షలు అవుతుందని ఆయన పేర్కొన్నారు. ఇందులో సంవత్సరానికి రు. 1.91 కోట్ల విలువగల నెయ్యి, పాలపొడి, మొదలైన పాల పదార్థాలు ఉత్పత్తి అవుతాయని ఆయన అన్నారు. యీ ప్రాంతం ప్రజలకు యీ ప్రాజెక్టు ద్వారా వొనకూడే లాభాలను ఆయన తెలియజేశారు. ప్రత్యేకించి ఈ ప్రాజెక్టువల్ల గ్రామీణ ఆర్థిక పరిస్థితి ఎంతో మెరుగవుతుందనీ, పాడిక్షేత్రాలు ఉపవృత్తిగాగల వ్యవసాయదారులు తమ ఆర్థిక పురోభివృద్ధిని అచిరకాలంలోనే సాధించగలుగుతారు. వారిపద్ద మిగులు ఉండేపాలకు అవసరమైన మార్కెటు సౌకర్యం నమ్మకంగా లభిస్తుంది. ఇదేవిధంగా [illegible] ప్ర[illegible] ఈ ఫ్యాక్టరి ద్వారా స్వచ్ఛమైన, ఆరోగ్యకరమైన పాలు లభిస్తాయి అని ఆయన అన్నారు. కృష్ణాడెల్టా పశుగణాభివృద్ధి సంఘం అధ్యక్షులు శ్రీ.వి.ఆర్.జి.కె.యం. ప్రసాద్ (ముక్త్యాల రాజా) మంత్రులకు స్వాగతం చెబుతూ వారిని పుష్పమాలాలంకృతులను చేశారు. జిల్లాలో పశుసంపద పురోభివృద్ధికి తమ సంఘం చేసిన కృషిని ఆయన వివరించారు. విజయవాడలోని ప్రభుత్వ పశువైద్యశాల ఆవరణలో తమ సంఘం భవన నిర్మాణానికి అవసరమైన స్థలాన్ని కేటాయించాలని ఆయన కోరారు. పశుగణాభివృద్ధి సంఘం కార్యక్రమాలకు సహాయపడడానికి వీలుగా పశువైద్య సర్జన్ సేవలను యీ సంఘంపరం చేయాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

ఎక్సైజ్, మద్య నిషేధశాఖల మంత్రి శ్రీ యం. ఆర్. అప్పారావు తమ ఉపన్యాసంలో శాస్త్రీయ పద్ధతిలో పశుపోషణ చేసే అవసరాన్ని గూర్చి వివరించారు. తద్వారానే యీ ప్రాంతం పాల ఉత్పత్తి అధికం కాగలదని ఆయన అన్నారు. మారుమూల గ్రామాలకు పశువైద్య సౌకర్యాలను విస్తరింప జేయాలని ఆయన సూచించారు.

### నవశకారంభం

ఆరోగ్య, వైద్య సర్వీసుల శాఖల మంత్రి శ్రీ వై. శివరామప్రసాద్ తమ అధ్యక్షోపన్యాసంలో పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ భవనానికి ముఖ్యమంత్రి శంఖుస్థాపన చేయడంతో గుంటూరు, కృష్ణా రెండు జిల్లాలలో గ్రామీణ ఆర్థిక పురోభివృద్ధికి నవశకారంభమయిందని అభివర్ణించారు. యీ ఫ్యాక్టరీద్వారా హైదరాబాదు, సికింద్రాబాదు, గుంటూరు, విజయవాడ పట్టణాలలోని దాదాపు 16 లక్షలమంది ప్రజలకు స్వచ్ఛమైన ఆరోగ్యప్రదమైన పాలు సరఫరా అవుతాయని ఆయన అన్నారు. దీనికితోడు యీ ఫ్యాక్టరీవల్ల పాడిక్షేత్రాలను నిర్వహించే వ్యవసాయదారులకు వారు సరఫరా చేసే పాలకు వారంవారం రొక్కరూపంలో చెల్లింపులు దొరుకుతాయి. దీనివల్ల అధికవడ్డీ రేట్లకు స్వల్పకాలిక రుణాలను స్వీకరించే అవసరం వారికి తగ్గుతుంది.

యీ ఫ్యాక్టరీ నిర్మాణం పనులు సక్రమంగా జరుగుతున్నందుకు వ్యవసాయ శాఖామంత్రి శ్రీ ఎ. బలరామిరెడ్డి తమ సంతృప్తిని వ్యక్తంచేశారు. నిర్ణీతకాలంలో యీ ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తి అయ్యే సూచనలు ఉన్నాయి. యీ ఫ్యాక్టరీ పని ప్రారంభించిన తర్వాత పరిసర ప్రాంతాలలోని గ్రామాల స్వరూప స్వభావాలు చాలావరకు మార్పు చెందుతాయి.

కృష్ణా, గుంటూరు జిల్లాల ప్రజలు పురోగాములై తమ పశు సంపదను పెంపొందించి పాల ఉత్పత్తుల విషయంలో గణనీయమైన ఫలితాలను సాధించినందుకు తాను ఎంతో సంతోషిస్తున్నానని మంత్రి అన్నారు. పాడి క్షేత్రాలను నిర్వహించే వ్యవసాయదారులు పాడిపశువుల పెంపకం విషయంలోనేగాక ఉత్పత్తి ఖర్చుల విషయంలో కూడా శాస్త్రీయదృక్పథం అలవర్చుకోవాలని ఆయన హితవు చెప్పారు. పాడి క్షేత్రాల విషయంలో అభివృద్ధి సాధించిన దేశాలను ఉదహరిస్తూ భారతదేశంలోకన్నా సేద్యయోగ్యమైన భూమి తక్కువగావున్న బ్రిటన్‌లో తక్కువ ఖర్చుతో ఎక్కువ పాలను ఉత్పత్తి చేస్తున్నారని ఆయన అన్నారు.

పట్టణ ప్రాంతాలలోని పశువులను పట్టణానికి దూరంగా ఏర్పాటుచేసే పశువుల కాలనీలలోకి మార్చడం, కృష్ణాజిల్లా గన్నవరంలో ఫ్యాక్టరీని ప్రారంభించడంవంటి పథకాలను రాష్ట్ర ప్రణాళికలో చేర్చడం ద్వారా అనేక అభివృద్ధికరమైన చర్యలను తీసుకోవడం జరుగుతున్నదని ఆయన అన్నారు.

### పారిశ్రామికాభివృద్ధి

ఆ తర్వాత ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలనూ ప్రత్యేకించి పరిశ్రమాభివృద్ధిని గూర్చిన కార్యక్రమాలను సమీక్షించారు. పారిశ్రామికీకరణ విషయంలో రాష్ట్రం క్రమంగా అభివృద్ధి చెందుతున్నదని ఆయన అన్నారు. రాష్ట్రంలో ప్రారంభించబడిన కొత్తగూడెంలోని ఒక మిలియన్ కిలోవాట్ల ఉత్పాదన శక్తిగల థర్మల్ ప్రాజెక్టు, విశాఖపట్నంలోని ఎరువుల ఫ్యాక్టరీ, రామచంద్రాపురంలోని భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ, హైద్రాబాదులో నిర్మించనున్న హిందుస్థాన్ యంత్ర పరికరాల ఫ్యాక్టరీలతోసహా అనేక పరిశ్రమల స్థాపనలను గూర్చి ఆయన ప్రస్తావించారు. యం. ఐ. టి. విభాగానికి చెందిన ఎలక్ట్రానిక్ యూనిటును హైద్రాబాదులో నెలకొల్పడానికి అనేక అవకాశాలు ఉన్నాయని ఆయన వెల్లడించారు. నాగార్జునసాగర్, పోచంపాడు, సీలేరు, శ్రీశైలంవంటి భారీ విద్యుత్ నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తికావడంతో అనతికాలంలో రాష్ట్రంలో పరిశ్రమలు ఇతోధికాభివృద్ధి చెందుతాయని ఆయన అన్నారు. సమీకృత పాలఫ్యాక్టరీ నిర్మాణం త్వరలో పూర్తి అయ్యి పాల ఉత్పత్తిని చేపట్టి యితర రాష్ట్రాలకు ఆదర్శప్రాయంకావాలని ఆయన అభిలాష వ్యక్తం చేశారు. యీ ఫ్యాక్టరీ ప్రాంతంలోని రైతులు అధికోత్పత్తికై కృషి చేయడమేగాక ఫ్యాక్టరీ పని ప్రారంభించే నాటికి పాలు ఇతోధికంగా సరఫరా అవడానికి వీలుగా ఇప్పటినుంచే తమ పశువుల పెంపకం పోషణ విషయంలో తగు జాగ్రత్తలు తీసుకోవాలని ఆయన ఉద్బోధించారు.

పాలవిషయాల సలహాసంఘం సభ్యురాలు, శ్రీమతి సంగం లక్ష్మీబాయి యం. పి. యీ ఉత్సవ విజయానికి తోడ్పడిన వారికి, ప్రజలకు తన కృతజ్ఞతలు తెలియజేశారు.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా జొన్నలగడ్డ గ్రామానికి 1963 సెప్టెంబరులో విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.



1963 నవంబరు 9వ తేదీన రాష్ట్రంలోని ఉభయ సభల సంయుక్త సమావేశంలో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ప్రసంగిస్తున్న దృశ్యం.



ఆంధ్రప్రదేశ్ యునాని వైద్యగోష్ఠికి హైదరాబాదులో 6-11-63 వ తేదీన గవర్నరు ప్రారంభోత్సవం చేసిన దృశ్యం.

నవంబరు 19 వ తేదీన గవర్నరు హైదరాబాదులో కలెక్టర్ల సమావేశంలో ఉపన్యసిస్తున్న దృశ్యం.





ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. చంద్రారెడ్డి నవంబరు 20వ తేదీన తాత్కాలిక గవర్నరుగా పదవీ స్వీకారం చేస్తున్న దృశ్యం.

*కుతుబ్ షాహీ ఉద్యానవనం :*



యుద్ధ భంగిమలోవున్న మావటివారితోసహా
అందంగా చెక్కబడిన ఏనుగులు.



తూర్పువైపు గోడలో కోణాల
ఆర్చీలను చూపిస్తున్న బావి.



రక్షణకై పెద్దనల్లరాళ్ళతో
నిర్మించ బడిన బయటి ప్రాకారం.



జింకపైకి దుముకుతున్న పెద్దపులి.

(చూ. వ్యాసం. 30 వ పేజీ)

9-11-63వ తేదీన నిజామాబాదులో న్యాయ, సమాచారమంత్రి ప్రారంభోత్సవం చేసిన జిల్లా సమాచార కేంద్రం.



సమగ్ర పాల పథకం : ఇంగ్లాండు నుండి వచ్చిన 19-టన్నుల సీసాలను శుద్ధిచేసే యంత్రం క్రిందకు దింపడానికి సిద్ధంగావున్న చిత్రం. ఇది గంటకు 12,000 సీసాలను శుద్ధి చేస్తుంది.

హైదరాబాదులో రెడ్ క్రాస్ శతజయంతి ఉత్సవాలు : నవంబరు 10వ తేదీన జంటనగరాలలో
జరిగిన ఊరేగింపులో అలంకరింపబడిన శకటం.



హైదరాబాదులో అంతరిక్షయాత్రికులు : హైదరాబాదు రాజభవన్‌లో ముగ్గురు రష్యా అంతరిక్షయాత్రికులు
శ్రీమతి వాలంటీనా తెరిష్కోవా, మేజర్ నికోలియేవ్, కల్నల్ బైకొవస్కీ.



హైదరాబాదులో బాలల దినోత్సవం : నవంబరు 11వ తేదీన జరిగిన ఉత్సవాల్లో ఒకానొక సమావేశంలో ప్రసంగిస్తున్న బాలుడు.

ఆటలద్వారా విద్య : హైదరాబాదు శిశు సంక్షేమ కేంద్రంలో పిలలు కెమేరాముందు కూర్చోవడంలో [illegible]



అఖిలభారత చేతిపనుల బోర్డు హైదరాబాదులో ఏర్పాటు చేసిన చేతిపనుల నాణ్యత కంట్రోలు బోర్డు ప్రదర్శనను నవంబరు 20వ తేదీన ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలమంత్రి సందర్శిస్తున్నప్పటి చిత్రం.

28-10-1963వ తేదీన మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురాం మేధీ కొత్తగూడెం గనులకు చెందిన రుద్రాపూర్ విభాగంలో రూ॥ 30 లక్షల ఖరీదుచేసే త్రవ్వకం సాధనాలకు ప్రారంభోత్సవం చేశారు. 20 అ. వ్యాసం, 850 అ. లోతున త్రవ్వబడుతున్న గొయ్యిపైనగల ఉక్కు-సాధనాన్ని యీ చిత్రంలో చూడవచ్చు.



# తెలుగు జానపద గేయాలు

—డా॥ బి. రామరాజు

ఇతర భాషల జానపదగేయాలవలెనే తెలుగు జానపద గేయాలుకూడా ప్రజల యొక్క స్వతస్సిద్ధమైన, కళావిలసితమైన భావ ప్రకటనలుగా ప్రత్యేక సాంస్కృతికమైన విలువనూ, సాహిత్య విలువనూ కలిగి వున్నాయి. ఇవి పదిలపరచదగినవి. పరిశీలనా యోగ్యమైనవి. స్మృతులకాలంనుంచీ వాస్తవ తెలుగు వాఙ్మయానికి జానపద పాటలు సజీవ స్వరూపమైనప్పటికీ ఇటీవలి వరకూ ఇవి విద్యావంతుల దృష్టిని ఆకర్షించడం కానీ వారు వీటి పరిశీలన జరపడంకానీ అంతగా జరగలేదు. తెలుగు బాష, సంస్కృతి యొక్క చరిత్ర ఎంత పురాతనమైనదో తెలుగు జానపద గేయాల చరిత్ర కూడా అంతే ప్రాచీనమైనది. ఆంధ్రుల సంస్కృతినీ, తెలుగు పూర్వ సాహిత్యం కంటే కూడా తెలుగు జానపద పాటలు చక్కగా అభివ్యక్తం చేస్తాయి. జాతీయమైన ఈ కవితకూ, ప్రజానీకానికీ మధ్య అంతరమంటూ లేకపోవడమే దీనికి కారణం. నిజానికి తెలుగు జానపద పాటలకు, ఆంధ్రుల జీవితమే ఆలంబనం. కనుకనే ఇవి మతోద్యమాలు, వీరోచితకృత్యాలు, మహాపురుషుల గాధలు, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు, వినోద కాలక్షేపాలు, ప్రేమ, వియోగం, సౌందర్యం, దుఃఖం—మొత్తానికి ఆంధ్రుల జాతీయ జీవితం యొక్క సత్యాలన్నింటినీ సరళమైన, శ్రావ్యమైన ధోరణిలో ప్రతిధ్వనింపజేస్తాయి. ఆంధ్రలో ప్రజల దైనందిన జీవితం కవితామయంగా గోచరిస్తుంది. ఇది కేవలం వినోద కాలక్షేపానికి, మనోల్లాసానికి మాత్రమే ఉపయోగపడదు. పడవనడిపే నావికుడినీ, ధాన్యం నూర్చే శ్రామికుడినీ, భూమిదున్నే కృషీవలుడినీ, బరువులు మోసే కార్మికుడినికూడా ఇది ఆదుకొని వారి కార్యభారాన్ని సునాయాసం చేస్తుంది. ఊరట కలిగిస్తుంది. వస్తువులోనూ, భావంలోను నిరాడంబరత వుట్టిపడే ఈ కవితను ఆస్వాదించడానికి నిస్సారమైన మేధాశక్తిని కాక గ్రాహ్యం చేసుకోగల సున్నితమైన హృదయాన్ని కలిగివుండడం అవసరం. సుసంపన్నమైనట్టి, వైవిధ్యంతో కూడినట్టి తెలుగు జానపద గేయాలను గూర్చి వివరించడానికి నేను ఈ వ్యాసంలో ప్రయత్నించాను.

భారత దేశంలోని ఇతర రాష్ట్రాలవలెనే ఆంధ్రదేశంకూడా జానపద గేయాలలో సంపన్నమైనది. ఈ జానపద సాహిత్యం పూర్వకాలంనుంచే ప్రవర్ధమానమవుతున్నట్లు, పూర్వకవులు సమకాలీన జానపద గేయాల విషయమై ప్రస్తావించడాన్నిబట్టి నిరూపితమవుతున్నది. పూర్వ కవులలో ఒకరైన నన్నెచోడుడు, ఆ కాలంలో వ్యాప్తిలోనున్న జానపదగేయాల రకాల పేర్లను ఉదహరించాడు. ఆయన తన "కుమారసంభవము"లో అలతులు, గౌడుగీతములు, రోకటిపాటలు, అంకమాలికలు, ఉయ్యాల పాటలను గూర్చి పేర్కొన్నాడు. తన కవితద్వారా శైవమతాన్ని ప్రచారంచేసిన ప్రజాకవి పాల్కురికి సోమనాధుడు, శివభక్తులు పాడిన పాటలనుంచి తాను కవితా సామగ్రి స్వీకరించినట్లు తెలిపాడు. రోకటి పాటలు, తుమ్మెద పాటలు, ప్రభాతపర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేసు, గొబ్బి, వెన్నెలపాటలవంటి వివిధ జానపద గేయాల పేర్లనుకూడా ఆయన ఉదహరించాడు. జాజరపాటలు నేటికీ నాచన సోముని జాజర పాట పద్ధతిలోనే గానం చేయబడుతున్నవి. ఈగంటి లక్ష్మయ్య కాలజ్ఞానములు, తుమ్మెదపాటలు ఈనాటికీ నిలిచివున్నాయి. ఇవి అతి ప్రాచీనమైన పాటలు. లక్ష్మయ్య, పాల్కురికి సోమనాథుని తరువాతి కాలంవాడు. "క్రీడాభిరామము"లో కాకతీయుల హయాములో ఓరుగల్లు నగరాన్ని ఇద్దరు మిత్రులు సంద

ర్శించవచ్చి అక్కడ వివిధ తరగతుల ప్రజలు పలురకాల జానపదగేయాలనుపాడుతుండడం చూచినట్లు ఉల్లేఖించబడింది. తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరస్వామిని స్తుతిస్తూ ఆ కాలంలో ప్రచారంలోనున్న వివిధ జానపద గేయాల పద్ధతులలో కీర్తనలు రచించాడు. ఈ రంగంలో అన్నమాచార్యులు మార్గగామి. ఆయన మనుమడు తిరుమలాచార్యులు, ఇటువంటి పాటల రచనా రీతులను, సూత్రాలను విశదీకరించాడు. ఏల గొబ్బిళ్ళనీ, చందమామ పదాలనీ, అర్ధచంద్రికలనీ వాటిని అయన పేర్కొన్నారు. విజయనగర సామ్రాజ్యాధీశుడు శ్రీకృష్ణదేవరాయలు, కటకంపైకి దండెత్తివెళ్ళడానికి సమాయత్తమవుతున్న తరుణంలో ఒక రజకుడు పాడిన దేశభక్తి ప్రేరకమైన జానపద గేయంవిని ఆయన ఏ విధంగా ప్రభావితుడైందీ వెల్లడించే ఆసక్తికరమైన ఉపాఖ్యానం ఒకటి వుంది. ఈ కవిసార్వభౌముడు తన ఆముక్తమాల్యదలో రైతులు ప్రాతఃకాలంలో మోటలు తోలుతూ పాడే పాటలను ఉదహరించాడు. కందుకూరి రుద్రకవి అనేక రకాల జానపద పాటలను వివరించాడు.

పలురకాలైన ఈ జానపద గేయాలను గురించి తెలుగు పూర్వ గ్రంథాలలో అనేక సందర్భాలలో ఉదహరించబడి వున్నప్పటికీ ఇవి కనీసం మార్పు జెందిన రూపంలోనైనా మిలిగివున్నాయని మనం ఖచ్చితంగా చెప్పడానికి వీలులేదు. గతంలో సాహిత్యాభినివేశకులు చూపిన నిర్లక్ష్యం ఫలితంగా వేలకొద్ది పాత జానపద పాటలకు తీరని నష్టం వాటిల్లింది. అయితే ఇటీవలి కాలంలో పత్రికలు, వీటిలో కొన్ని పాటలనైనా పదిలపరచడంలో పరోక్షంగా తోడ్పడినవి. కాని ఈ జానపదగేయాలను శాస్త్రీయ పద్ధతులలో సేకరించి పాశ్చాత్య దేశాలలో మాదిరిగా-స్వరాలతో సహా-ప్రచురించడానికి ఇంతవరకు ఎట్టి ప్రయత్నం జరగలేదు. పురాతనమైన ఈ తెలుగు జానపద గేయాలను సేకరించి భద్రపరచడంలో కూడా ఆ కీర్తి గత శతాబ్దంలోని సి. పి. బ్రౌన్, జె. ఏ. బైలెవంటి ఆంగ్ల సివిల్ ఉద్యోగులకే దక్కుతుంది.

తెలుగు జానపద గేయాలను దిగువ పేర్కొన్న భాగాల క్రింద విభజించవచ్చు. వీటిని గురించి వివరించడానికీ, సరిగా గ్రాహ్యంచేసుకోవడానికీ ఈ విభజన తోడ్పడుతుంది.

## పురాణ పాటలు

పండితులకొరకు ఉద్దేశింపబడిన సాహిత్యంలోవలెనే జానపద పాటల్లోకూడా వివిధ రకాల పురాణ కథలు, ఇతిహాసాలు యితివృత్తాలుగా వున్నవి అనేకం వున్నాయి. రామాయణం మొదలయిన కావ్యాల తెలుగు అనువాదాలలో మూలంలోలేని అనేక కథలు, ఉపాఖ్యానాలు వున్నాయి. ఈ ఉపాఖ్యానాలు జానపదపాటలవలె అనాదిగా ప్రచారంలో వుంటూనే వున్నాయి. అందుచేతనే అనువాదాలలో మూలాన్ని మించివున్న యీ ఉపాఖ్యానాలను కవులు బాగా వ్యాప్తిలో వున్న జానపద పాటలనుండి గ్రహించారని భావించడంలో ఔచిత్యం వుండబోదు. ఇంచుమించు అన్ని పురాణగాథలూ జానపద పాటల రూపంలో వుండడం మనం చూడగలం. ఈ పురాణపాటలంటే జానపదులకు ఒకవిధమైన ఆరాధనతో కూడిన ప్రేమా, అభిమానమూను. పురాణాలు చదివి విద్యావంతులు గొప్పగొప్ప సత్యాల్ని తెలుసుకుంటే, అవేసత్యాల్ని నిరక్షరాస్యులు జానపద పాటల ద్వారా తెలుసుకో గలుగుతున్నారు. సులభంగా అర్థమయ్యేటట్టుగా యీ విషయాలన్నీ యీ పాటలలో వ్యక్తం చేయబడుతాయి. ప్రజల అభిరుచులనుబట్టి, మనస్తత్వాలను బట్టి, భావాలను బట్టి కూర్పులుచేర్పులతో ఎన్నో మార్పులు, క్రొత్తరూపాలు యీ కథలలో సంభవిస్తుంటాయి. రామాయణ, మహాభారత, భాగవతాది పురాణాలనుండి కథలను గ్రహించి వారి యిష్టం వచ్చినట్టు మలుస్తారు. రామాయణానికి సంబంధించిన జానపద పాటలు మిగతా యితిహాసాలతో పోల్చిచూసినప్పుడు కావ్యాలలో వలెనే యిందులోనూ ఎక్కువగానేవున్నాయి. వాల్మీకి రామాయణానికి భిన్నంగా తెలుగులో రంగనాధ రామాయణం, భాస్కర రామాయణాలవంటి కావ్యాల్లో లభించే కొత్త కథలు కూడా జానపద పాటలుగా వ్యాప్తిలో వున్నాయి.

కూచకొండ రామాయణం, ధర్మపురి రామాయణం, శారద రామాయణం, రామకథాసుధార్ణవం, మోక్షగుండ రామాయణం, సంక్షేప రామాయణం, గుత్తెనదివి రామాయణం, చిట్టి రామాయణం, శ్రీరామ దండములు, రామాయణ గొబ్బిపాటలు, శ్రీరామజావళి, అడవిశాంత పెండ్లి, గోవింద నామాలు మొదలయిన వాటిలో ఎన్నింటిలోనో మొత్తం రామాయణ కథంతా వివరించబడి వుంది. శాంత కళ్యాణం, పుత్రకామేష్టి, కౌసల్య బైకాలు, శ్రీరాముల ఉగ్గుపాట, రాఘవ కళ్యాణం, రాములవారి అలుక, సుందరాకాండ పాదము, ఋషుల ఆశ్రమం, సుగ్రీవ విజయం, కోవెల రాయబారం, అంగద రాయబారం, లక్ష్మణమూర్ఛ, లంకా యాగం, గుహ భరతుల అగ్ని ప్రవేశం, శ్రీరామ పట్టాభిషేకం, లక్ష్మణ దేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశల యాకం, కుశలవ కుచేల కథ, కుశలవ యుద్ధం, పాతాళ హోమం, శతకంఠ

రామాయణం మొదలయిన పాటలు రామాయణంలోని కొన్ని కొన్ని ఘట్టాలను వివరిస్తూ పాడేపాటలు. గ్రామీణులకు, ముఖ్యంగా పల్లెటూళ్ళలోని స్త్రీలకు సీతాదేవి అంటే చాలా యిష్టం. సీతపుట్టుక, సీత కళ్యాణం, సీత నత్తువారింటి కంపుట, సీత సమర్త, సీత సుభగోష్టి, సీతగడియ, సీత వామన గుంటలు, సీతమ్మవారి అలుక, సీత వసంతం, సీత దాగిలి మూతలు, సీత సురటి, సీత ముద్రికలు, సీత ఆనవాలు, సీత అగ్ని ప్రవేశం, సీత వేవిళ్ళు, సీత చెర, మాయ లేడిపాట మొదలయినవి సీతను కేంద్రంగా తీసుకుని ఆమెపై వ్రాసిన పాటలు. ఈ పాట లన్నింటిలోనూ వాడినభాష, భావం, శైలి అన్నీ కూడా పూర్తిగా జానపద సంబంధ మైనవే.

రామాయణం తర్వాత మహా భారతానికి సంబంధించిన పాటలు సంఖ్యలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమిస్తాయి. నలచరిత్ర, దేవ యానిచరిత్ర, సుభద్రాకళ్యాణం, సుభద్ర సారె, ధర్మరాజు జూదం, ద్రౌపదివల్వలు, పండుపాట, విరాటపర్వం, పద్మవ్యూహం, విశ్వరూపం, భగవద్గీత, సావిత్రిపాట, శశిరేఖాపరిణయం, గయోపాఖ్యానం, పరా సరమత్స్యగంధిసంవాదం, పాటలు బాగా వ్యాప్తిలో వున్నవాటిలో కొన్ని. విరాట, కర్ణ, శల్య పర్వములపాటలు, ఉత్తరదక్షిణ గోగ్రహణపాటలు అనేవి పెద్దపెద్ద పాటలు. అలాగే భాగవతానికి సంబంధించిన పాటలు కూడా అనేకం వున్నాయి. భాగవత కథ లలో కృష్ణుడంటే పల్లెవాసులకు మహా యిష్టం. అమాయకులైన యీ పల్లె ప్రజల హృదయాలలో కృష్ణుని ముద్రలు చెరిపినా చెరగనంత గాఢంగా నాటుకుని వుంటాయి. నిజానికి గోకులంలోని ఒక గొల్లపడుచు కృష్ణునిమీద చూపించే ఆరాధన, ప్రేమ–ఇదే లీలాసుక, జయదేవుడు మొదలయిన భక్త శిఖామణులకు సాహిత్యానికి పనికివచ్చే చక్కటి వస్తువుగా వుపయోగించింది. పల్లె జనం తమ మనసులతో ఆరాధన, శరీరంతో శృంగార రసామృతాలను గ్రోలి కృష్ణ తత్వాన్ని జీర్ణించుకున్నవారు. దానికితోడు చిన్నికృష్ణుని దుడుకుపనులు గ్రామీణులను విరివిగా ఆకర్షించాయి. ప్రహ్లాదచరిత్ర, వామనవిజయం, వామనచరిత్ర, అంబరీషో పాఖ్యానం, గజేంద్రమోక్షం, శ్రీకృష్ణ జననం, కాళింగమడుగు, శ్రీకృష్ణునిచల్దులు, బాలకృష్ణలీలలు, గుమ్మడుపాట, యశోద కొంగుపాట, జలక్రీడలు, రుక్మిణీకళ్యాణం, చిలుకరాయబారం, సత్యభామ సరసం, రుక్మిణీదేవిముచ్చట, రుక్మిణీదేవి సీమంతం, పారుజాతపల్లవి, ఉషాస్వప్నం, కుచేలో పాఖ్యానం, భ్రమరగీతాలు భాగవతంతో సంబంధంవున్న కొన్ని పాటలు. సత్య హరిశ్చంద్రపాట, అనసూయపాట, గోవు పాట, దత్తాత్రేయ జననం, దక్షయజ్ఞం, గంగవివాహం, గంగాగౌరిసంవాదం, లక్ష్మీ పార్వతులసంవాదం, త్రిపురాసురసంహారం, సవతుల కయ్యం, ఈశ్వర భృంగివాదం, మేనకపార్వతిసంవాదం, సురభందీశ్వరం, మార్కండేయజననం, సిరియాలరాజు చరిత్ర, ఛల్లనరాయకథ, కొమిరెల్లిమల్లన్న కథ, వరదరాజుపెండ్లిపాట, అందాలచరిత్ర, శ్రీరంగమహత్యం, తిరుమంత్రంపాట, దశావతారములపాట, లక్ష్మీదేవిస్వగతాలు, వెంకటేశ్వర్లవేట, చెంచీతకథ, ఏకాదశి మహాత్యం, వరహావతారచరిత్ర మొదలయి నవి యితర పురాణాలకు, మతానికి, ప్రాంతీయ గాథలకు సంబంధించిన ముఖ్య మైన పాటలు. ఈ జానపదపాటలను పరిశీ లించిచూస్తే ఒక విషయం వ్యక్తపడు తుంది. పల్లెవాసులు యీ పాటలలోని పాత్ర లతో పోల్చుకోవడం మనకు తరచుగా కను పిస్తుంది. ఈ పాటలను సంస్కృతంలోని మూలంతోగాని, తెలుగులోని మూలంతో గాని పోల్చిచూస్తే జానపదుల మనస్తత్వం, పురాణ పురుషులపై వారికుండే భక్తి ప్రప త్తులు, ప్రేమ మనకు వ్యక్తం కాగలవు.

## చారిత్రక పాటలు

జానపద పాటల్లో చారిత్రక పాట లంటే ప్రజలకు ఒక ప్రత్యేకమైన ఆసక్తి, విలువా వున్నాయి. వస్తువులోను, శైలిలోను, చెప్పే తీరులోను యివి యితర జానపద పాటలకు భిన్నంగా వుంటాయి. వీటిల్లో పరాక్రమానికి సంబంధించిన విషయం వుంటుంది గనుక వీటిని వీరపాటలు అంటారు. వీనినే చరిత్ర పాటలు అనికూడా అనడంకద్దు. దీనికి అను వైన ఏదో ఒక సంఘటన జరగటంతోనే యీ రకమైన పాటలు ఉత్పన్నమౌతుం టాయి. ఒక గాయకుడుగాని, ఒక కవిగాని హృదయవిదారకమైన దృశ్యాన్ని దేనినైనా చూడడం తటస్థించినప్పుడు వెనువెంటనే అతడు ఎంతో ఉత్సాహంతో ఆ సంఘటనను వివరిస్తూ గానం చేయడం ప్రారంభిస్తాడు. ఆ పాట ఒక వ్యక్తినుండి మరొక వ్యక్తికీ, ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి వ్యాపిస్తుంది. ఒక్కొక్కప్పుడు పాటలోని విషయం మారిపోయి కొత్తకథ తయారవు తుంటుంది. పాట ఒకచోటునుండి మరో చోటికి, ఒకరివద్దనుండి మరొకరివద్దకు ప్రయాణం చేసేటప్పుడు కొత్త సంఘటనలు వచ్చిచేరి పాట స్వరూపం ఊహించరా నంతగా మారిపోతుంటుంది. పాతపాటలో మనుషుల పేర్లూ, కొత్తవాటిలోని పేర్లూ ఒకదానిలో ఒకటి కలిసిపోతుంటాయి. ఆ విధంగానే ప్రాంతాల పేర్లు, సంఘటనలు మారిపోతూ వుంటాయి. ఒకానొక కాలానికి, సంఘటనకు సంబంధించిన యుద్ధతంత్రాలు,

ఆయుధాలు యితర పాటల్లో కలిసిపోతుంటాయి. ఈ రకపు పాటలు తల ఎత్తగానే వాటిని రికార్డు చేస్తేనే నిజమైన చరిత్ర వీటి నుండి లభ్యం కాగలదు. లేకపోతే కేవలం నోటిమీదుగానే నిలచివున్న యీ పాటలతో చారిత్రక సంఘటనలను నిర్ణయించడం చాలా కష్టంతో కూడుకున్న పని. ఇల్లాంటి పాటలు కాలం గడిచేకొలదీ అర్ధచారిత్రకాలు అయ్యి, ఆ తర్వాత కొన్ని తరాలకు పురాణ కథలు గాను, కట్టుకథలుగాను రూపొందుతుంటాయి. ప్రతి భాషలోను [illegible] చెందిన పాటలు వున్నాయి.

మామూలు జానపద పాటలకన్న వీర పాటలకు ఒక ప్రత్యేకమైన [illegible] వుంది. కేవలం కాలక్షేపానికీ, ఆనందానికే కాక యివి ప్రజలను ఉత్తేజపరచి, ధైర్య సాహసాలను వారిలో కలిగించి, వాటిని ఉద్దీపింపజేసి వారిని ధైర్యవంతులుగాను, దేశభక్తులుగాను తీర్చి దిద్దడానికి ఉపయోగపడతాయి. అనాదిగా ధైర్యసాహసాలకు, వీరత్వానికి ఆంధ్రదేశం పెట్టింది పేరు. ఎందరో వీరులు యీ దేశంలో జన్మించారు. బ్రహ్మనాయుడు, ఖడ్గతిక్కనవంటి యుద్ధవీరులు; బాలచంద్రుడు, కుమారరాముడు వంటి ధైర్యవంతులు; రుద్రమదేవి, మాంచాల, పార్వతీదేవి, రాణీ శంకరమ్మ వంటి వీరనారీలు యీ తెలుగుగడ్డపై జన్మించారు. వీరత్వం అనేది ఆంధ్రుల ప్రత్యేక గుణం. అటువంటి వీరారాధన, వీరపూజ ఆంధ్రదేశంలో పాత సాంప్రదాయంగా అయిపోయింది. కారెంపూడిలో పల్నాడు యుద్ధ వీరులకు వీరపూజ చేయడం, నెల్లూరు జిల్లాలోని గంగ జాత్రలు, ఆంధ్రదేశంలో వీరారాధన పవిత్రమైన ఉద్యమంగా వుంది అనడానికి చక్కటి ఉదాహరణలు. ఆంధ్రదేశమంతటాగల "వీరగల్లు" విగ్రహాలే ఆంధ్రదేశంలోని వీరపూజకు గల గౌరవాన్ని చెప్పక చెప్పుతాయి.

మియాసాబుకథ, సోమనాద్రికథ, వేమేశ్వరరావుకథ, శంకరమ్మకథ, సవాయివెంకటరెడ్డికథ, సదాసివరెడ్డికథ, పర్వతరామ మల్లారెడ్డికథ, సర్వాపాపని కథ, బల్లూరి కొండలరాయునికథ, కుమారరాయుని కథ అనేవి తెలంగాణాలో బాగా వ్యాప్తిలో ప్రచారంలో వున్న వీరపాటలు. పల్నాటివీరుల కథలు, కాటమరాజు కథ, దేశినాగురాజు కథ, బొబ్బిలి కథ, పెద్ద [illegible] కథ, అల్లూరి శీతారామరాజు కథ మొదలైనవి. ఆంధ్రదేశంలో ప్రచారంలోవున్న వీరపాటలు. [illegible] కథ. బల్లూరి కొండలరాయుని కథ, అర్ధచారిత్రకంగా పేర్కొనవచ్చు. మహాభారత కాలం నుండికూడా ద్వంద్వయుద్ధం అనేది భారతదేశంలో వ్యాప్తిలోవున్న యుద్ధసూత్రం. దీనికి విరుద్ధంగా ఏ వ్యక్తయినా ఎక్కువ మందిచేత మోసంతో చంపబడితే, ఆవ్యక్తి జానపదుల దృష్టిలో ఒక గొప్పవ్యక్తి అవుతాడు. వారే కొంతకాలానికి ఉపదేవతలుగా అయిపోతారు. దీని ఫలితమే వీరపూజ. హైదరాబాదు విమోచన పోరాటంలో అసువులు బాసిన వీరులు మెల్ల మెల్లగా ఆంధ్రదేశమంతా ప్రసిద్ధి కెక్కుతున్నారు.

## ముక్తి పాటలు

భక్తి, కర్మ, జననం అనేవి హైందవులకు మోక్షసాధనానికి మూడు మార్గాలు. వీటన్నిటిలో భక్తి సులభమైన మార్గం. అందుచేత శైవమతానికి, వైష్ణవ మతానికి యింకా యితర శాఖలకు సంబంధించిన భక్తిపాటలు వేలకొలది ఆంధ్రదేశంలో వ్యాప్తిలో కొచ్చాయి. అదృష్టవశాత్తు పూర్వకాలానికి సంబంధించిన పాటలు యింకా బ్రతికే వున్నాయి. జంగములు, హరిదాసులు యీ రకమైన పాటలుపాడి తమపొట్ట నింపుకుంటూ వుంటారు. భద్రాచల రామదాసు కీర్తనలు, తూము నరసింహదాసు కీర్తనలు, పరాంకుశదాసు, ప్రకాశదాసు, వెంకటదాసులకీర్తనలు తెలుగుదేశంలో వినిపిస్తూనే వుంటాయి. పాదములు, దరువులు, మేలుకొలుపులు, భూపాలాలు, లాలిపాటలు, జోలపాటలు, మంగళ హారతులు, స్తోత్రములు, తారావళులు, నామావళులు కూడా ముక్తిపాటల కోవకే చెందుతాయి.

[illegible] దేశంలో విజ్ఞానులేగాక నిరక్షరాస్యులైన గ్రామప్రజలుసైతం గొప్ప గొప్ప వేదాంత [illegible] వుంటారు. వేదాంతానికి సంబంధించిన యీ పాటలను తెలుగులో 'తత్వములు' అంటారు. ఈ తత్వాలు, చాలావరకు అద్వైత మతానికి సంబంధించినవి. ఈ పాటలు కుల, మత, వర్ణ విచక్షణనూ ఆచారాలనూ పూర్తిగా విమర్శిస్తూ వుంటాయి. యాగంటివారి తత్వాలు, పోతులూరి కాలజ్ఞానాలు, సిద్దప్ప పాటలు, లింగమూర్తి పాటలు, తత్వబోధామృత తత్వాలు, సీతపాట, రామరామ శతకము, నారాయణ శతకము, కందార్ధ దరువులు, శ్రీరామగీత, గురుగీత, తారకామృతసారం, రాజయోగి పాటలు వేదాంత పాటలకు కొన్ని ఉదాహరణలు.

వైదిక క్రియలు, సామాన్యునికి అందుబాటులో వుండేవికావు. కాని సామాన్యులు కూడా కర్మద్వారా మోక్షసిద్ధిని నమ్మేవారు నోములు, వ్రతాలు మొదలయిన కర్మకు సంబంధించిన పాటలు జనపదాలలో సామాన్యస్త్రీలలో బాగా ప్రచారంలో వున్నాయి. చిలకముగ్గుపాట, నిత్యదానం నోముపాట, దీపదానం నోముపాట మోచేతి పద్మంపాట, కృత్తిక దీపాలపాట

పెండ్లిగుమ్మడిపాట, వరలక్ష్మీపాట, శ్రావణ శుక్రవారపుపాట, తులసిపాట, లక్షవత్తుల పాట, కామమేశ్వరిపాట మొదలైనవి ఆచారానికి సంబంధించిన పాటలు. బతుకమ్మ, బొడ్డెమ్మ పాటలు తెలంగాణాలో బాగా వ్యాప్తిలోవున్న పాటలు.

## స్త్రీల పాటలు

గృహజీవితంలో పురుషునికన్న స్త్రీ ప్రముఖపాత్ర వహిస్తున్నదిగనుక గృహ కృత్యాలకు సంబంధించిన కవితలోకూడా వీరికి ప్రత్యేకస్థానం వున్నది. ఈ సాహిత్యాన్నే స్త్రీలపాటలు అంటారు. వీటిలో కల్పనకన్న వాస్తవికతే ఎక్కువ. హైందవ స్త్రీకి మాతృత్వం ఒక వరం వంటిది. సర్వసాధారణంగా సంతానంలేని స్త్రీ ని సంఘం చిన్నచూపు చూస్తుంది. ఈ విషయాలకు సంబంధించిన పాటలను వాస్తవ రూపంలో ప్రజలు గానంచేస్తుంటారు. ఎవరికైనా సంతానం కలిగితే రకరకాలైన పాటలు పాడుతారు. పిల్లలను నిద్రపుచ్చేటప్పుడు లాలిపాటలు, జోలపాటలు పాడుతుంటారు. తల్లులు తమ కొడుకుల్ని ఏ రాముడిగానో, కృష్ణుడిగానో, శంకరుడిగానో ఊహిస్తూ, కుమార్తెలను ఏ సీతాదేవో, రుక్మిణో, గౌరిగానో భావిస్తూ పాటలు పాడుకుని ఎనలేని ఆనందాన్ని పొందుతుంటారు. స్త్రీ జీవితంలో వివాహం అతి ముఖ్యమైన ఘట్టం. దీని చుట్టూ అనేక సంఘటనలు — సాంప్రదాయక విషయాలు పరాచికాలు, క్రీడలు మొదలయినవి అనేకం ఆవర్తించి వున్నాయి. వీటిమీద ఎన్నో జానపద పాటలు వచ్చాయి. వీటిని పెళ్ళిపాటలు అనవచ్చు. ఈ పాటలు కొట్నాలతో ప్రారంభమై అప్పగింతలతో ముగుస్తాయి. కొట్నాలపాటలు, నలుగుపాటలు, గంథంపాటలు, కళ్యాణపాటలు, అలుకపాటలు, తలుపుదగ్గరపాటలు, బంతుల పాటలు, బువ్వంపాటలు, వధూవరుల పాటలు, ముఖంకడుగుపాటలు, కట్నాల పాటలు, మిధునవిధములపాటలు, అవిరేని పాటలు, వియ్యాలవారిపాటలు, అప్పగింతల పాటలు—ఇవన్నీ పెళ్ళిపాటల్లోని రకాలు. ప్రేమవివాహాలు సాగుతున్న యీ రోజుల్లో యీ పాతకాలపు పెళ్ళిపాటలుపాడే అలవాటు క్రమంకొ మృగ్యమైపోతున్నది. స్త్రీ గృహ జీవితం నల్లేర్పై బండిలా సాగితే సరేసరి. లేకపోతే ఆ యింటి కోడలు ఏ అత్తచేతిలోనో, భర్తచేతిలోనో, తోడికోడలు చేతిలోనో, యమయాతనలు అనుభవించక తప్పదు. ఈ గృహస్థ జీవితానికి సంబంధించిన విషయాలపై కొంత సాహిత్యం కూడా వుంది. ఈ పాటలన్నింటిలోనూ తెలుగు సంస్కృతి, తెలుగు జీవితము పూర్తిగా వ్యక్తపడుతూ వుంటాయి. సీత సమర్త, సీతగడియ, సీతమ్మవారి వసంతం, సీతవామనగుంటలు, సుభద్రసారె, రుక్మిణీదేవి సీమంతం, కౌసల్యాబారసాల అనే పాటలు సరదాగా పాడుకునే పాటలు.

## కార్మికుల పాటలు

పాటలు మనసులో ఉల్లాసాన్ని కలిగించడమేగాకుండా శ్రమనుకూడా మరిపింపజేస్తాయి. స్త్రీలు, పురుషులు పనులుచేస్తూ వున్నప్పుడు, చేస్తున్న పనిభారాన్ని మర్చిపోవడానికి అస్పష్టంగా ఏదో పాటను అనుకోకుండానే పాడడం ప్రారంభిస్తారు. ఈ రకపు పాటలను, బాణీలను అనేకమంది వ్రాశారు. వీటినే జానపదపాటలంటారు. ఇవి మెల్లమెల్లగా ఒకచోటినుండి మరోచోటికి వ్యాపిస్తూ వుంటాయి. పిండి విసురుతున్నప్పుడు, ఊడుస్తున్నప్పుడు, పొలం దున్నుతున్నప్పుడు, నారు నాటుతున్నప్పుడు, నీరు పెట్టుతున్నప్పుడు, విత్తనాలు చల్లుతున్నప్పుడు, పంట కోత కోస్తున్నప్పుడు, పడవనడుపుతున్నప్పుడు, రాళ్ళు చిదగ్గొడుతున్నప్పుడు, బరువులు ఎత్తుతున్నప్పుడు, రోడ్డురోలర్లను వెనక్కు-ముందుకు లాగుతున్నప్పుడు, ఇళ్ళుకడుతున్నప్పుడు, రోడ్లు వేస్తున్నప్పుడు, పల్లకీ మోస్తున్నప్పుడుఆయా పనులుచేసేవారు రకరకాలపాటలను పాడడం మనం చూస్తూనేవుంటాం. పాటలు హృదయంలోని బరువును తొలగించి మానసికమైన ఉల్లాసాన్ని కలిగించడమేగాకుండా శారీరకమైన అలసటను మరపించి ఉత్తేజాన్ని కలిగిస్తాయి. ఈ కార్మికులపాటల్లో వస్తువుకు పరిమితి అంటూ లేదు. ఎదిబడితే అదే దానికి వస్తువు. వృత్తులకు సంబంధించిన పాటలు, శృంగారపాటలు, ప్రాంతీయ కథలకు సంబంధించినపాటలు, దుఃఖ కథలకుసంబంధించిన పాటలు, ఆరాధనకు సంబంధించిన పాటలు—యివన్నీ కార్మికులు తరచుగా పాడుతుండే పాటలే. ఈ కార్మికుల పాటలలో చాలా పాటలు ఆయా పనులకు సరిగ్గా సరిపోయినట్టు వుంటాయి. ఈ పాటలలోని క్రమబద్ధమైన తాళం ఆయా పనులలో అవయవాల కదలికకు సరిపోయి వుంటుంది. అవయవాల కదలికగాని, ఉచ్ఛ్వాస, నిశ్వాసాలుగాని యీ పాటలకు లయబద్ధమైన తాళాలుగా వుంటాయి. ఈ పాటలలోని సంగీతమేగాకుండా, వీటిలోని స్త్రీ-పురుష భావాలు తరచుగా కార్మికులను గిలిగింతలు పెడుతుంటాయి. ఖరీదైన వస్త్రధారణ, తిండి, ఆభరణాలవల్ల కార్మికులకు జీవితంలో కొంత ఆనందంకలిగే అవకాశం వుంది. అలాగే స్త్రీ-పురుష సంబంధమైన ఆనందం సర్వసాధారణంగా వారి జీవితంలో అధిక ప్రాముఖ్యతను కలిగివుంటుంది. ఈ విషయాన్ని ఫ్రాయిడ్ తన "లిబిండో" సిద్ధాంతంలో వివరించాడు. కార్మికుల పాటలలో యీ సిద్ధాంతపు స్వరూపం మనకు గోచ

రిస్తుంది. ఈ మోటు పాటల్ని కష్టమైన పనులుచేసే కార్మికులు–ముఖ్యంగా బరువులు ఎత్తే కార్మికులు – తరచుగాపాడుతుంటారు.

## పిల్లల పాటలు

పిల్లలపాటలు జానపద పాటల్లో ఒక ప్రత్యేకమైన విభాగంగా ఏర్పడ్డాయి. ఈ పాటలు చంటిపాపల మనసులవలె మృదువైనవీ, వారి ముఖాలవలె కళకళలాడేవీనూ, వీటిని ముఖ్యంగా రెండు వర్గాలుగా విభాగించ వచ్చు. ఒకటి–పిల్లల గురించి పెద్దవాళ్ళు [illegible] వుంటూనే వున్నపాట లివి. రెండు – పిల్లలు తమంతతాముగా కూర్చుకున్నవి. ఇవి ఒక [illegible] పాటలు. పెద్దలు కూర్చిన పాటలలో లాలి పాటలు, జోలపాటలు ఉదహరించ వచ్చు. ఈ పాటల్లోని భావం పిల్లలకు అర్థమేకాదు. కాని వీటిలోని సంగీతమూ, లయ పిల్లలు నిద్రపోయేట్టూ, ఆడుకునేటట్టూ చేస్తాయి. వివిధ వయసులో వున్న పిల్లల గురించి పెద్దవాళ్ళు వ్రాసిన పాటలు పిల్లవాడు స్వయంగా పాడగలిగే వయసువరకూ అంచెలు అంచెలుగా పెరుగుతూ వస్తాయి. ఈ పాటల్లో మొట్టమొదట పిల్లలకు శబ్దాన్ని' తర్వాత లయను, ఆపైన అభినయాన్ని బోధించే ప్రయత్నం మనకు అగుపడుతుంది. మొట్టమొదటిది ఆకర్షించడానికి, రెండవది ఉత్సాహపరచడానికి. మూడవది వాళ్ళ చిన్న శరీరాలకు ఎక్సర్ సైజు కలిగించడానికి.

ఇక, పిల్లలు పాడే పాటలలో కొన్ని స్వయంగా తమంత తాము కూర్చుకున్నవి. మరికొన్ని పెద్దవాళ్ళు కూర్చిన వాటిని కొద్దిగా మార్చినవి వున్నాయి. అనుకరణలో పిల్లలు కొన్ని కొన్ని మాటలను. శబ్దాలను పదే పదే వాడడంలో కృతకృత్యు లౌతారు గాని భావం మాత్రం ఎగిరిపోతూ వుంటుంది. అందుచేత యివి 'అర్థంలేని లయల'తో వుంటాయి. బాలురూ, బాలికలూ పాడుకునే ఆటపాటలు చాలామట్టుకు యిలాంటివే. చెమ్మ చెక్క, బిట్టి, గుడుగుడు గుంచం, బుజబుజ రేకులు, చిటిచిటి చెర్ర, కోతి కొమ్మచ్చి ఈ రకపు ఆటపాటలకు కొన్ని ఉదాహరణలు.

## శృంగార పాటలు

ఉన్నత ప్రమాణాలతోకూడి పండితుల కొరకై ఉద్దేశించబడిన సాహిత్యంలోవలెనే జానపదులకు సంబంధించిన సాహిత్యంలోను [illegible] వున్నాయి. పాటలు పాడుకునే జానపదుల అభిరుచులకు తగ్గట్టుగా యిందులో శృంగార [illegible] అందుచేత వీటిని ఉన్నతమైన సాహిత్య ప్రమాణాలతో పరిశీలించి చూడకూడదు. ఈ పాటలలో సీతారాములను గురించి ఉన్నప్పటికీ (ప్రౌఢ సాహిత్యంలో యిదే ఉత్కృష్టమైన ప్రేమగా అభివ్యక్తీకరించ బడుతుంది) వారి ప్రేమ తరచుగా మోటుగా వర్ణింపబడుతుంది. ఈ భావాలు కేవలం యీ పాటలను వ్రాసినవారిమీద ఆధారపడివుంటాయేగాని పాటలలోని పాత్రలకు సంబంధించినవికావు. కొన్నిపాటలు సాంఘిక కట్టుబాట్లను అధిగమించి, పరస్పర ఆకర్షణకు లోనుగావడానికి అవకాశాలు కల్పిస్తునప్పటికీ కొన్నికొన్ని పాటల్లో ఉత్కృష్టమైన ప్రేమకూడా చక్కగా వ్యక్తం చేయబడుతూ వుంటుంది. సర్వసాధారణంగా జానపద గేయాల్లో జీవితంలోని లోటుపాట్లు సరిదిద్దే శక్తిగాని, పాత్రలను ఆదర్శవ్యక్తులుగా భావింపచేసే శక్తిగాని వుండదు. జీవితాన్ని యథాతథంగా నిర్వచించడమేయివిచేస్తాయి. జీవితంలోని వైవిధ్యమంతా యీ పాటల్లో కనుపిస్తుంది. అందుచేతనే వీటిలో నీచత్వము, ఉన్నతత్వమూ; మోటయిన ప్రేమ, ఉత్కృష్టమైన ప్రేమా ఒకదానితో ఒకటి పెనవేసుకునే వుంటాయి. అయినప్పటికీ సాంప్రదాయమూ, చట్టమూ అంగీకరించే ప్రేమను వ్యక్తం చేస్తూవున్న పాటలు చాలా వున్నాయి.

సీతగడియ, ఊర్మిళాదేవినిద్ర, సీతమ్మవారి అలుక, సీతాదేవివేవిళ్ళు, సీతాదేవి ఆనవాలు మొదలయినపాటలు ఉత్కృష్టమైన ప్రేమను వ్యక్తంచేసేవాటికి ఉదాహరణలు. సుభద్రకళ్యాణం, నలచరిత్రపదం, శశిరేఖాపరిణయం, గోపికాస్త్రీలజలక్రీడలు, ఉషాస్వప్నం, రుక్మిణీదేవివిముచ్చట, చిలకరాయబారం, సత్యభామసరసం, పారిజాతపల్లవి, భ్రమరగీతాలు. మొదలయినవి శృంగార భావాలతోకూడిన చక్కటి పాటలు. లక్ష్మమ్మకథ, సన్యాసమ్మకథ, ఎరుకుల నాంచారికథ, వీరరాజమ్మకథ మొదలయిన విషాదగీతాలు నిజమైన గృహస్థుల ఉన్నత ప్రేమను వ్యక్తంచేస్తుంటాయి. గంగ వివాహం, కొమరెల్లిమల్లన్నకథ, వరదరాజుపెండ్లిపాట, అందాలచరిత్ర, చెంచీతకథ శృంగారభావాన్ని కలిగివున్న పాటల్లో ఆదర్శవంతమైనవిగా భావించదగ్గపాటలు. గల్ మోహనరంగపాట, వెంకయ్య–చంద్రమ్మ పాట, నారాయణమ్మ పాట, సిరిసిరిమువ్వపాట, కామునిపదాలు, జాగర పాటలు, గోంగూరపాటలు మొదలయినవి సామాన్య జానపదులు పాడుకునే విచిత్రమైన పాటలు.

## అద్భుతమైన కథల పాటలు

గ్రామాల్లోని చదువూ, సంధ్యా లేని సామాన్య ప్రజలు చిన్నపిల్లలవలె ఆశ్చర్యకరమైన విషయాన్ని వినడానికి యిష్టే ఆకర్షింపబడతారు. అద్భుతమైన కథలలో కనుపించే మహత్తరశక్తియెడల భక్తీ, భయమూ ఏర్పరచుకుంటారు. తాము

ఆపదలలో వున్నప్పుడు, కథలలో వలె, ఏ మహత్తర శక్తో వచ్చి తమను కాపాడుతుందని నమ్ముతుంటారు. బాల నాగమ్మకథ, గాంధారి కథ, పసల బాలరాజు కథ, కాంభోజరాజు కథ, ధర్మాంగద పాము పాట, ఈ రకపుపాటల్లో బాగావ్యాప్తిలో ఉన్నవాటిగా పేర్కొనవచ్చు. ఈ పాటల్లోగల సత్యమే జయము అనే సిద్ధాంతమే అశేషమైన జానపదులను ఆకర్షించడానికిగల ముఖ్య కారణం.

## విషాదగీతాలు

జానపదులు ప్రేమతర్వాత అద్భుతానికి, దుఃఖానికి సమాన ప్రాముఖ్యతనుయిస్తారు. సర్వసాధారణంగా వీరి జీవితాల్లో ఆనందం కన్న దుఃఖమేఎక్కువగా వుంటుందిగనుక, జానపద పాటల్లో విషాదగీతాలే ఎక్కువగా వున్నాయి. ఆదర్శ జీవితాన్ని వ్యక్తంచేస్తూ దుఃఖాన్ని మరిచిపోయేట్టుగా జానపదులు పాటలను మలచరు. జానపద పాటల్లో మర్యాదపాలు కొంచెం తక్కువగానే వుంటుంది. బాధను అణిచి వేయడానికిగాని, అధిగమించడానికి కాని వీలుగా ఈ పాటలు ఉద్దేశపూర్వకంగా, ఒకానొక ధ్యేయంతో కూర్పుచేయబడినవి కావు. ఒక వ్యక్తి యొక్క ధైర్యసాహసాలను, పట్టుదలను వీరు అభినందిస్తారు. పొగుడుతారు. ఆ వ్యక్తి దుష్టులతో పోరాడి వాళ్ళ మాయోపాయాలకు బలైతే అందుకు సానుభూతి చూపిస్తారు, కన్నీళ్ళు కురిపిస్తారు. విషాద గీతాల్లో కన్యకమ్మవారి పాట మొదటిది. కన్యక తనుచేసిన త్యాగంవల్ల దేవతఅయ్యి అందరిచేతా — ముఖ్యంగా వైశ్యుల చేత ఆరాధింపబడుతున్నది. చనిపోయిన భర్తతో పాటు అతని చితిపై ఆహుతై పోయిన స్త్రీలకు సంబంధించిన కథలను పేరంటాండ్ల పాటలు అంటారు. సహగమనం చేసినవారికి మానవాతీత శక్తులు లభిస్తాయని ఒక నమ్మకం. ఈ సహగమనాన్ని బ్రిటిషు ప్రభుత్వంవారు నిషేధించారు. ఈ నాటికి కూడా, ఆ విధంగా చనిపోయినవారిని ఆంధ్ర దేశం అంతా పూజిస్తూనే వున్నది. కామమ్మ కథ, లక్ష్మమ్మకథ, సన్యాసమ్మకథ, మండ పేట పాపమ్మకథ, ఎరుకమ్మకథ, తిరుపతమ్మ కథ, వీరరాజమ్మకథ—ఇవన్నీ భర్తలతో పాటు వారి చితులపై సహగమనం చేసిన స్త్రీల జీవితాలను, వారి బాధలను, త్యాగాలను వివరించే విషాదకథలు యితివృత్తాలుగా గల పాటలు. ఎరుకుల నాంచారికథ, రాములమ్మ పాట, సరోజనమ్మపాట, మూసిపోంగు పాట మొదలయినవి తెలంగాణాలోవ్యాప్తిలో వున్న కొన్ని విషాద గీతాలు.

అది తెలుగు దేశంలో బాగా వ్యాప్తిలో వున్న జానపదపాటల సంక్షిప్త చరిత్ర. వేలకొలది ప్రచారంలో వున్న అచ్చుకాని యీ జానపద పాటలను సేకరించి భద్రపరిచే ప్రయత్నం చేయకపోతే, మరికొంత కాలానికి ఆధునిక నాగరికత పల్లె ప్రాంతాలకు కూడా వ్యాపించి, యివి రూపుమాసిపోయే ప్రమాదం వుంది. సాహిత్యం దృష్టితోనేగాక ఈ పాటలు సాంఘికంగాను, సాంస్కృతికంగాను, భాషా విషయకంగాను కూడా మరింత ఉపయోగకరములు. నిఘంటువుల్లో లభ్యం కాని పదాలు, చక్కటి జాతీయాలు, ప్రతిష్ఠమైన భావాలు యీ పాటల్లో మనకు కనుపిస్తూ వుంటాయి. వీటిలో చాలా చక్కటి ప్రాంతీయ కథలు వున్నాయి. సమర్థులైన కవుల చేతులలో యివి పడితే చక్కటి కావ్యాలుగా రూపొందుతాయనడంలో సందేహం లేదు. వివిధ ప్రణాళికలతోను, బహుళార్థ సాధక ప్రాజెక్టులతోను భారత దేశాన్ని పునర్వ్యవస్థీకరించేందుకు అన్ని విధాలా ప్రయత్నిస్తున్న యీ రోజులలో గ్రామాలలో ఇప్పటికీ అధిక సంఖ్యాకులుగా వున్న నిరక్షరాస్యులను విద్యావంతులుగా చేయడానికి జానపదపాటల్లోని భాష, వివిధ రీతులు చక్కటి ప్రచార సాధనాలుగా వుపయోగిస్తాయి. ఈ జానపద పాటలను భద్ర పరచడంలోనూ, ఉపయోగించుకోవడంలోనూ కొంతమంది ఉత్తర హిందూస్తానం వారు—ముఖ్యంగా బెంగాలీవారూ, హిందీ వారూ—చాలా ముందుకు వెళ్ళారని చెప్ప వచ్చు. ఈ కృషిలో ఆంధ్రదేశం వెనుక బడదని ఆశిస్తున్నాను. 

## సవరణ

"ఆంధ్రప్రదేశ్" 1963 అక్టోబరు సంచికలో ప్రచురించబడిన "ఉపాధ్యాయుని దృష్టిలో ప్రస్తుతవిద్య" అనే వ్యాస రచయిత సరైన చిరునామా యిది : శ్రీ ఎస్. ఆర్. కె. మూర్తి, అసిస్టెంట్ లెక్చరర్ (ఇంగ్లీషు), ప్రభుత్వ ఆర్ట్స్, సైన్స్ కళాశాల, ఆదిలాబాదు.

*భారతయూనియన్‌లోని నూతన రాష్ట్రం :*

# నాగా రాష్ట్రం

భారతయూనియన్‌లో అన్ని హంగులు కలిగిన ఒక రాష్ట్రంగా నాగా రాష్ట్రం 1963 డిశంబరు మొదటి తేదీన ఏర్పడింది.

భారతయూనియన్‌లో కొత్తగా పదహారవ రాష్ట్రాన్ని ఏర్పరచడానికి ప్రభుత్వం నిశ్చయించినట్లు ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 1960 ఆగష్టు మొదటి తేదీన లోకసభలో ప్రకటించారు. తరువాత రెండు సంవత్సరాలకు 1962 ఆగష్టులో నాగారాష్ట్ర నిర్మాణానికి లోకసభలో ఆయన ఒక బిల్లును ప్రవేశపెట్టారు. 1962 ఆగష్టులో లోకసభవారు ఈ బిల్లును ఆమోదించారు. లాంఛనప్రాయంగా ఈ రాష్ట్ర ప్రారంభోత్సవ దినంగా డిశంబరు మొదటి తేదీని రాష్ట్రపతి నిర్ణయించారు.

నాగారాష్ట్రం భారత యూనియన్ రాష్ట్రాలన్నింటిలోకీ చిన్నది. ఇది దేశ తూర్పు సరిహద్దున బర్మాను ఆనుకొనివుంది. ఈ రాష్ట్ర జనాభా 3,70,000. విస్తీర్ణం 6366 చదరపు మైళ్ళు. జనసాంద్రత చాలా తక్కువ; అంటే ఒక చదరపు మైలుకు 62.5 మాత్రమే. దీమాపూర్‌లోని కొన్ని వందల చదరపు మైళ్ళ విస్తీర్ణం మాత్రమే గల మైదాన ప్రదేశాలు మినహా మిగతా ప్రాంతమంతా పర్వత శ్రేణులతో ఆవరించివుంది. ఇవి సముద్రమట్టానికి 2000 అడుగుల ఎత్తు మొదలు 10,000 అడుగుల ఎత్తు వరకు వుంటాయి. నాగా గ్రామాలు చాలా వరకు కొండ శిఖరాలపై వుంటాయి. అక్కడి ప్రజలు నీటి సరఫరాలో ఇబ్బందులను ఎదుర్కొంటుంటారు. ఇరుకైన లోయలలో, కొండవాలులలో వీరు సేద్యం చేస్తారు. నాగాప్రాంతంలో సంవత్సరానికి సగటున 80 అంగుళాల వర్షం కురుస్తుంది. ఇక్కడ ప్రజలు సమృద్ధిగా కూరగాయలు పండించడానికి, వరి పండించడానికి ఈ నీరు సరిపోతుంది. మైదాన ప్రదేశాలలో చెరకు, ప్రత్తి కూడా పండుతుంది.

## సాహసవంతులు, నిరాడంబరులు

నాగా ప్రజల జీవితానికీ, సంస్కృతికీ సంబంధించి ఏదైనా సాధారణ చిత్రణ చేయడం కష్టసాధ్యం. ఈ ప్రాంతంలో నివసించే 16 ప్రధాన తెగల వారిలో చాలా మంది, భిన్న భిన్న సంప్రదాయాలకు చెందినవారు కావడం, వారి పండుగలు, అలవాట్లు వేరు వేరుగా వుండడమే దీనికి కారణం. అయినప్పటికీ నాగా ప్రజలు సాహసవంతులనీ, నిరాడంబరులనీ, కష్టించి పని చేస్తారనీ, అతిథి మర్యాదలు చేసే వారనీ, సంగీత, నృత్యాలు వీరికి చాలా ప్రీతిపాత్రమైనవనీ నిక్కచ్చిగా చెప్పవచ్చు. వీరు ఆటపాటలతో ఉల్లాసంగా గడిపినప్పటికీ కార్యశూరులు. తమ జీవనానికై

నాగా రాష్ట్రంలో రోడ్ల నిర్మాణం ఒక బృహత్తర కార్యక్రమం. ప్రస్తుతం 2000 మైళ్లకు మించి రోడ్లు ఉన్నాయి.



కష్టించి పని చేస్తారు.

పదిహేను సంవత్సరాల క్రితం ఈ ప్రాంతంలో సుమారు 150 మైళ్ళ నిడివి గలరోడ్లు మాత్రం వుండేవి. ఈ రాష్ట్రంలోని 858 గ్రామాలలో [illegible] మోటారు లేక ఏదైనా శకటాల ద్వారా వెళ్ళడానికి వీలుండేది కాదు. కాని ఇప్పుడు 2000 మైళ్ళకంటే ఎక్కువ నిడివి గల రోడ్లు ఇక్కడ వున్నాయి. ఈ రోడ్లపై జీపుల ద్వారా ప్రయాణం



సుందరమైన శాలువలు నాగా జాతీయులకు గర్వకారణ మైనవి. ఒక ఎంపోరియంలో కొత్తరకం శాలువలను నేయడంలో నిమగ్నమైఉన్న నాగాబాలికలు.

చేయవచ్చు. దాదాపు ముఖ్యస్థలాలన్నింటికీ ఈ విధమైన రోడ్డు సౌకర్యాలున్నాయి. ఇంకా కొన్ని రోడ్ల నిర్మాణం జరుగుతున్నది. మూడవ ప్రణాళిక ముగింపు నాటికి, అంతర రాష్ట్ర ప్రయాణాలు సులభంగా, చౌకగా, సత్వరంగా జరగడానికి వీలుగా స్వంత రవాణా వ్యవస్థను నెలకొల్పాలని ఇక్కడి పరిపాలనా వ్యవస్థ వారు ఆశిస్తున్నారు.

విద్యారంగంలో కూడా ఈ రాష్ట్రం శీఘ్రపురోభివృద్ధిని సాధిస్తున్నది. వచ్చే అయిదు సంవత్సరాల కాలంలో ప్రతి గ్రామంలోనూ ఒక ప్రాథమిక పాఠశాలను ప్రారంభించాలని పరిపాలనా వ్యవస్థవారు లక్షిస్తున్నారు. 716 పాఠశాలలు, కళాశాలల్లోనూ రెండు ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు, రెండు డిగ్రీ కళాశాలలు, 28 ఉన్నతపాఠశాలలు వున్నాయి. జనాభాతో నూటికి 19 వంతుల మంది అంటే 69,000 లకుపైగా విద్యార్థులున్నారు.

ఈ విద్యార్థులు చదువు సంధ్యలను శ్రద్ధగా, దీక్షగా సాగించడంతో పాటుగా తమ విరామ సమయంలో తలిదండ్రులకు వ్యవసాయ పనులలో సహాయ పడతారు. అంతేగాక గుడిసెలు నిర్మించుకోవడంలో, సుందరమైన శాలువలు మొదలైన వాటిని నేయడంలో కూడా తోడ్పడతారు. ఇక్కడ చేతి పరిశ్రమలు ఎక్కువగా లేవు. అయితే నేతపనివారలు, వృత్తిపనివారలు ప్రదర్శించే నిపుణతనుబట్టి ఈ రాష్ట్రంలో [illegible] లు, చేతిపరిశ్రమల అభివృద్ధికి మంచి అవకాశాలున్నట్లు వెల్లడవుతుంది. ముడి సరుకులకు సబ్సిడీ లభింపజేయడం ద్వారా ప్రభుత్వం గ్రామస్థులకు సహాయం చేస్తున్నది. నాగాప్రాంతపు వస్తువులకు ప్రచారం చేకూర్చడానికి ఢిల్లీ, కలకత్తా, గౌహతి లలో నాగా వస్తువుల విక్రయశాలలను తెరిచే పథకం ఒకటి వుంది.

వ్యవసాయం ఈ రాష్ట్రవాసుల ప్రధాన జీవనాధారం. కోహిమా జిల్లాలోని అంగామీలు చప్పరములను తయారుచేయడంలోసిద్ధహస్తులు. అంగామీ ప్రాంతంలో జరిగే ఈ విధమైన వ్యవసాయం ప్రపంచ ప్రసిద్ధి గాంచింది. మిగతా రెండుజిల్లాల ప్రజలతో [illegible] విధమైన [illegible] విధానాన్ని ప్రోత్స

హించడానికి కృషి జరుగుతున్నది. లోగడ పూర్వపద్ధతిలో సేద్యంచేయబడిన క్షేత్రాలలో క్రమంగా ఈ సేద్యవిధానం అవలంబింపబడుతున్నది. నాగాప్రజలలో నూటికి 80 వంతులకుపైగా వ్యవసాయంపై ఆధారపడతారు. సేద్యానికి తగినంతగా వర్షపాతం వున్నప్పటికీ, భూమి సారవంతమైనదైనప్పటికీ, ఇక్కడవ్యవసాయంచేయడానికి లభించేభూమి తక్కువ. పూర్తి స్వయం సమృద్ధతకు ఇది చాలదు. సంప్రదాయ సిద్ధమైన పూర్వ వ్యవసాయ (ఝుమ్మింగ్) పద్ధతివల్ల భూమి నుంచి సంపూర్ణంగా ప్రయోజనం పొందడం జరుగలేదు, 1963 వ సం. మధ్యకాలం నాటికి పరిపాలనా వ్యవస్థవారి ప్రయత్నం మీద 2 లక్షల 17 వేల ఎకరాలమండలవిస్తీర్ణాన్ని సమీకరించ గలిగారు. వ్యవసాయం చేయడానికి సుమారు 7 లక్షల ఎకరాల భూమి లభించగలదని అంచనా. ఈ భూమిని సేద్యయోగ్యం చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. సేద్యం నిమిత్తం ఇతోధికంగా భూములను అభివృద్ధి పరచడానికీ, మేలుజాతి విత్తనాలు పంపిణీ చేయడానికీ, వ్యవసాయ పనిముట్లు కొనుగోలుకు సబ్సిడీలు ఇవ్వడానికీ. నీటిపారుదల కాలువలు త్రవ్వడానికీ 1957వ సంవత్సరం నుంచి రెండుకోట్ల రూపాయలకు పైగా ఖర్చు చేయడం జరిగింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఇక్కడ ప్రజలకు వివరించడానికీ, మొకక్‌చుంగ్, ట్యున్సాంగ్ జిల్లాలలో, చప్పరముల పద్ధతిని ప్రచారంచేయడానికీ కృషి జరుగుతున్నది. విత్తనాలు మొదలైన వాటిని సరఫరాచేసేందుకు ప్రభుత్వం ఒక పెద్ద ప్రదర్శన క్షేత్రాన్ని నెలకొల్పింది. ఆధునిక సేద్య విధానాలను గూర్చి రైతులకు తెలియజేసేందుకై మరో 75 ప్రదర్శన కేంద్రాలు కూడా ఇచ్చట వున్నాయి. ఎద్దులతో దున్నకం జరిపే పద్ధతిని కూడా ఇటీవల ప్రభుత్వం ప్రవేశపెట్టింది. మైదాన ప్రదేశాలలో ట్రాక్టర్ల సహాయంకూడా తీసుకోవడం జరుగుతున్నది.

రాష్ట్రంలో 16 అభివృద్ధి బ్లాకులు వున్నాయి. వీటిలో నాలుగు బ్లాకులు గిరిజన సంక్షేమాభివృద్ధి బ్లాకులుగా మార్చబడినాయి. మిగతా బ్లాకులన్నీ కూడా నాలుగవ ప్రణాళికాంతం నాటికి గిరిజనాభివృద్ధి బ్లాకులుగా మార్చబడతాయి. ఇక్కడ పరిపాలనా వ్యవస్థ వారిని ఎదుర్కొంటున్న మరో అత్యవసరసమస్య ప్రజారోగ్యం. రాష్ట్ర బడ్జెటులో అధిక భాగాన్ని సహజంగానే ఈ పథకాలకు కేటాయించడం జరిగింది,

దాదాపు పది సంవత్సరాలక్రితం ఇక్కడ చిన్న ఆసుపత్రులు కొన్ని మాత్రమే వుండేవి. కాని ఇప్పుడు పూర్తి హంగులు గల సాధారణ ఆసుపత్రులు 24కు పైగా ఈ రాష్ట్రంలో పనిచేస్తున్నాయి.

## నీటి సరఫరా

ప్రజారోగ్యం, మంచినీటి సరఫరా– ఈ రెండు సమస్యలకు ప్రత్యక్ష సంబంధం వుంది. నాగా గ్రామాలు మామూలుగా ఎత్తయిన కొండశిఖరాలపై వుంటాయి కాబట్టి గ్రామీణ స్త్రీలు దూర ప్రదేశాలకు వెళ్ళి చెలమలనుంచి, కొండ కాలువలనుంచి నీళ్ళు తెస్తుంటారు. ఈ పనిలోనే వారు ఎక్కువగా నిమగ్నమై వుంటారు. ఈ జానపదులకు ఇతోధికంగా విరామం కలిగించడానికీ, ఆరోగ్యం, మంచినీటి సౌకర్యాలు కల్పించడానికీ పారిపాలనా వ్యవస్థ వారు రూ. 12 లక్షలకు పైగా వెచ్చించి ప్రజలకు గొట్టాల ద్వారా నీటి సరఫరా సదుపాయాలు చేకూర్చారు. ఇంకా అనేక పథకాలు అమలు జరుగుతున్నాయి. గ్రామాలన్నింటికీ ప్రాతిపదికమైన ఈ సదుపాయాలను కలిగించడానికి పరిపాలనా వ్యవస్థ పథకాలు రూపొందించింది.

నాగా రాష్ట్రంలో జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తికి మంచి అవకాశాలు వున్నాయి. గత రెండు సంవత్సరాలలో ఎనిమిది పట్టణాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కలిగించడం జరిగింది. చౌకగా విద్యుదుత్పత్తి జరగడం ప్రారంభం కావడంతో కొత్త, ఆధునిక పరిశ్రమలు చాలా శీఘ్రగతిని అభివృద్ధిచెందగలుగుతాయని పరిపాలనా వ్యవస్థ ఆశిస్తున్నది.

డింపూర్‌నుంచి కోహిమావరకు జాతీయ రహదారిపై ప్రయాణం చేసినట్లయితే పచ్చని చెట్లతో నిండిన ఎత్తయిన కొండలు మనకు అంతటా దర్శనమిస్తాయి. అయితే ఈ రాష్ట్రంలో 127 చదరపుమైళ్ళ రిజర్వు అడవులు మాత్రమే వున్నాయి. అడవులను పెంపొందించడంపట్ల పరిపాలనా వ్యవస్థ వారు శ్రద్ధవహిస్తున్నారు. ప్రస్తుతం ఆదాయమార్గం ఇది ఒక్కటి కావడమే దీనికి కారణం.

ఈ ప్రాంతంలో పలురకాలైన చెట్లు ఎదుగుతాయి. తేలికగా, గట్టిగా వుండే కలప ఇక్కడ లభిస్తుంది. కొన్ని చోట్లలో గడ్డి, వెదురు చెట్లు, ఓషధులు విస్తారంగా వుంటాయి.

వివిధ ఫలవృక్షాలను పెంచడానికి కూడా పరిపాలనా వ్యవస్థవారు ప్రయత్నిస్తున్నారు. అరటి, నారింజ వంటి ఫలాలు, జీడిపప్పు మొదలైన వాటిని ఈ రాష్ట్రంలో పెద్దఎత్తున పండించవచ్చని తలంచబడుతున్నది. రుచికరమైన ఏపిల్ రకాల ఉత్పత్తిని పెంపొందించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

చాలా కాలంగా బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా వేరుగావున్న నాగా ప్రాంతం ఇప్పుడు నవ్యోత్తేజంతో పూర్తి హంగులుగల రాష్ట్రంగా ఆవిర్భవిస్తున్నది. ఇక్కడ శాంతి భద్రతలను నెలకొల్పి, స్వార్థపరులు ముఖ్యంగా ఉద్ధారకులమని చెప్పుకునే విదేశస్థుల దుష్ప్రచారానికి లోనై పెడత్రోవపట్టిన ప్రజలను సక్రమమార్గంలో పెట్టడమే ప్రస్తుత మన ప్రధాన సమస్య. ★

## సంగ్రహ ప్రకటనలు

### ఆహారధాన్యాల అమ్మకందార్లకు లైసెన్సులు

17-10-1963వ తేదీతో విడుదలఅయ్యే ఆంధ్రప్రదేశ్ గెజెట్ అసాధారణ ప్రకటనలో ప్రకటించడానికై 1963 సంవత్సరం ఆంధ్రప్రదేశ్ ఆహారధాన్యాల అమ్మకందారుల లైసెన్సు ఉత్తరువును గూర్చి ప్రభుత్వం ఒక ప్రకటనను జారీచేసింది. ఈ ఉత్తరువు వెనువెంటనే అమలులోకి వస్తుంది.

ఈ ఉత్తరువు ప్రకారం కొనుగోలుదారులు, అమ్మకందారులు, నిలవచేసేవారు ఏవిధమైన ఆహారధాన్యాలను అమ్మేటందుకైనా ఆయా పరిధుల అమ్మకము, నిలువలు అధికారం వహించే వాణిజ్య పన్నుల అధికారినుంచి లైసెన్సు సర్టిఫికెట్టును పొందవలసి వుంటుంది. 10 క్వింటాలులు గాని, అంతకన్న ఎక్కువగాని ఆహారధాన్యాలను నిలువచేసినవారిని అమ్మకానికై నిలవచేసినట్టు భావించబడుతుంది.

లైసెన్సుకొరకు, రిన్యూవలుకొరకుచేసే దరఖాస్తులు అందుకొరకు ఉద్దేశింపబడిన పత్రం 'ఎ' పై పూరించి, పంపించాలి. ఈ పత్రాలు లైసెన్సు అధికారులవద్ద లభ్యం కాగలవు. రిన్యూవలుదరఖాస్తు, వారి లైసెన్సు గడువు తీరుటకు కనీసం 15 రోజులు ముందుగా పంపించాలి.

ఇప్పుడు యివ్వబడుతున్న లైసెన్సు యివ్వబడిన తేదీనుండి 1964 మార్చి 31 తేదీవరకూ అమలులో వుంటుంది. ఆతరువాత ఒక ఏడాదిలోపు కాలానికి అది తిరిగి రిన్యూవలు చేయించుకోవలసి వుంటుంది.

లైసెన్సులు జారీచేయుడానికి వసూలు చేసే ఫీజు :

| | |
|---|---|
| లైసెన్సు యివ్వడానికి | రూ. 5/- |
| లైసెన్సు రెన్యూవలు చేయడానికి | రూ. 2/- |
| డూప్లికేటు లైసెన్సు యివ్వడానికి | రూ. 10/- |

లైస్సెన్సులో చెప్పబడిన షరతులు, విధానాలు, వర్తకునిచేగాని లేక అతని ప్రతినిధిచేగాని వ్యతిరేకించబడినచో ఆ లైసెన్సు రద్దుపరచబడి లేక నిలిపివేయబడి దానిపై ఇతర చర్యలు తీసుకోబడును. అయినా అట్లు రద్దుపరచబడిన లేక నిలిపివేయబడిన వాజ్యమునకు కారణమును వర్తకుడు తెలియజేయడానికి అవకాశం యివ్వబడుతుంది.

ఈ ఉత్తరువుకు వర్తించే ఆహారధాన్యాలు ఇవి : గోధుమ, పంట (ధాన్యం), బియ్యం (ఊకతీసినవి), జొన్న, సజ్జ, మొక్కజొన్న, బార్లీ, చిన్నతరహా కాయధాన్యాలు (రాగి, కొర్ర మొ॥), ఉలవలు మొదలయిన పంటధాన్యాలు, ఊక. పొట్టులేని యితర కాయధాన్యాలుగూడా పంటధాన్యం కోవలోకి వస్తాయి.

### ధరల పట్టీలు

1963 ఆంధ్రప్రదేశ్ వస్తువుల ధరల పట్టీలప్రదర్శన ఉత్తరువును 13-11-1963వ తేదీతో విడుదల అయ్యే ఆంధ్రప్రదేశ్ అసాధారణ గెజిట్‌లో ప్రచురణ నిమిత్తం ప్రభుత్వం ఒక ప్రకటనను జారీచేసింది. ఇది గెజిట్‌లో ప్రచురింపబడిన 16వ రోజు నుండి అమలులోకి వస్తుంది.

ఈ ఉత్తరువు ప్రకారం వీధులలో తిరుగుతూ చిల్లర వస్తువులను అమ్మేవారుమినహా ఏ సరుకులనైనా హోల్‌సేల్‌గా గాని, చిల్లరగాగాని అమ్మడానికిగాను నిలవచేసినవారూ, అమ్ముతున్నవారూ తాము అమ్ముతున్న పరిసరాలలో ముఖ్యస్థలంలో అమ్మకానికి వుంచిన సరకుల ధరల పట్టీని అందరికీ కనిపించేట్లు వుంచాలి. ఈ ధరలపట్టీ ఇంగ్లీషులోగాని లేదా ఆ జిల్లాలో వాడుకలో గల ముఖ్యమైన భాషలోగాని వివరంగా, వివిధ తరగతులకు చెందిన సరుకుల ఎదురుగా విడివిడిగా వ్రాయబడి, అడుగున వర్తకుని సంతకం కలిగిఉండాలి.

వర్తకుడు వసూలుచేసే ధర లెక్కగట్టి చూసినపుడు ఇక్కడ ఉదహరించిన ధరలకు మించి వుండకూడదు. (ఎ) రాష్ట్ర ప్రభుత్వం గాని, జిల్లా కలెక్టరు గానీ ఆ వర్తకుడు అమ్మవలసిన ధరనునిర్ణయించినప్పుడు (బి) పైన 'ఎ'లో వివరించినట్లు ధర నిర్ణయించకపోతే వాటిని తయారుచేసినవారుగాని లేక వాటిని పంపిణీ చేసినవారుగాని నిర్ణయించినధరకు (సి) పైన 'ఎ' 'బి' లలో చెప్పినట్లు ధర నిర్ణయింపబడకపోతే ఆ ప్రాంతంలోని వర్తకుల ప్రతినిధుల సంఘం నిర్ణయించిన ధరకు (డి) పైన 'ఎ' 'బి' 'సి' లలో చెప్పబడినట్టు ధర నిర్ణయించబడకపోతే హైదరాబాదులోని సివిల్ సప్లయ్ కమీషనరుగాని లేదా ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వం నియోగించిన ఏ అధికారిగాని అరువు, రొక్కం అమ్మకాలకు నిర్ణయించిన ఆయా లాభాలప్రకారం బజారులో ఆ సమయంలో లభిస్తున్న ధరప్రకారం అమ్మవలసి వుంటుంది. ధరల పట్టీలో ఉటంకించిన ధర

లకుమించి వర్తకుడు సరకులను, అమ్మరాదు.

ఈ ఉత్తరువును ఏ వర్తకుడైనా వ్యతిరేకిస్తున్నట్టు, లేదా అతిక్రమించ బోతున్నట్టు అనుమానం కలిగితే సివిల్‌సప్లయిస్ డైరెక్టరు గాని, జిల్లా కలెక్టరుగాని, వాణిజ్య పన్నుల అధికారిగాని లేదా వారు తమ తరపున వినియోగించుకునేవారుగాని తమతమ అధికార పరిధుల మేరకు ఆయా వర్తకుల కొట్లలో ప్రవేశించుటకు, తనిఖీ చేయడానికి, సరకును జప్తుచేయడానికి అధికారం గలదు. వారు ధరల పట్టీని చూపించమని అడగటానికి లేదా మరి ఏ యితర సమాచారమన్నా చెప్పమనడానికి అంతేగాక ఆ వర్తకానికి సంబంధించిన పుస్తకాలు, యితరపత్రాలు పరిశీలించడానికి అధికారం గలదు.

వర్తకుడు సరకు కొనుక్కున్న ప్రతి వానికి కొనుగోలుదారునిపేరు, సరియైన చిరునామా, అమ్మకం జరిగిన తేది, అమ్మిన సరుకు, దాని పరిమాణము, గుణము, ధర, వసూలుచేసిన మొత్తంసొమ్ము మొదలయిన వివరాలతోకూడిన రసీదును యివ్వవలసి వుంటుంది. ఉప్పు, బొగ్గు, చార్‌కోల్, పంట చెరకు విషయంలో ఒక్కొక్క దానికి 5 రూ. మించనంతవరకు, రెండుగాని అంతకు ఎక్కువ సరకులకు 10రూ. మించనందాను అమ్మకం జరిగినప్పుడు వర్తకుడు కొనుగోలుదారునకు రసీదు యివ్వనవసరం లేదు.

ఈ ఉత్తరువు వర్తించే వస్తువులు: గోధుమలు, ధాన్యం, బియ్యం, రాగి, చోళ్ళు, జొన్నలు, మొక్కజొన్నలు, సజ్జలు, అరికలు, కొర్రలు, బార్లీ, ఉలవలు, పై పంటధాన్యాలకు సంబంధించిన ఏ పిండి అయినా, కాయధాన్యాలు, ఉప్పు, మిరపకాయలు, సుగంధ ద్రవ్యాలు, కండసారి చెక్కెరతో సహా పంచదార, భక్షణీయమైన అన్ని నూనెలు, అన్నిరకాల వనస్పతి, డబ్బాపాలు, చంటిపిల్లల ఆహారములు, నెయ్యి, వెన్న, టీ, కాఫీ, రొట్టె, బిస్కట్లు, ప్రత్తి, అల్లికవస్తువులు, బొగ్గు, చార్‌కోల్, పంటచెరకు, అన్ని రకాల బట్టలసబ్బులు, టాయిలెట్ సబ్బులు, అచ్చు కాగితాలు, వ్రాత కాగితాలు, కిరసనాయిలు మినహా పెట్రోలు, దాని యితర పదార్థాలు.

1948 సం. పు ఫ్యాక్టరీల చట్టంలోని సెక్షన్ 51, 52, 53 ల నుండి రాష్ట్రంలోని అన్ని ఫ్యాక్టరీలను 1963 నవంబరు 1 వ తేదీనుండి 3 నెలలపాటు ప్రభుత్వం మినహాయించింది.

ఈ విధంగా లభించే ఆదాయాన్ని జాతీయ రక్షణనిధికి విరాళంగా యివ్వడంపై ఫ్యాక్టరీలో పనిచేసే అధిక సంఖ్యాకులయిన కార్మికులనుండి వ్రాతపూర్వకంగా సమ్మతి తీసుకున్నప్పుడే, లేదా ఫ్యాక్టరీలోని అధిక సంఖ్య కార్మికులకూ సమ్మతయిన కార్మిక సంఘం అక్కడ వున్నట్టయితే దానినుండి వ్రాతపూర్వకంగా సమ్మతి బడసినప్పుడే యీ మినహాయింపు వర్తిస్తుంది.

## పేరు మార్పు

కృష్ణా జిల్లాలో ఉన్న 'మసులిపట్నం' పేరును 'మచిలీపట్నం'గా మార్చాలని ప్రభుత్వం ఆదేశించింది. యీ ఉత్తర్వు తక్షణం అమలులోకి వస్తుంది.

## పశువైద్యశాలలో ఫీజు విధింపు రద్దు

ఆంధ్ర ప్రదేశ్‌లోని పశువైద్యశాలలలోకి చికిత్సకై పశువులను తీసుకవచ్చే యజమానులనుండి ఫీజు వసూలు చేయడం ప్రస్తుతం అమలులో ఉంది. అంతేగాక ప్రభుత్వ ఆసుపత్రులలోకి ఎద్దు అయిన ఆవులను గేదెలను దాటించడానికి తీసుకవచ్చే యజమానులనుంచి కూడా ఫీజులను వసూలు చేయడం జరుగుతున్నది.

పశువైద్యశాలలను అందరికీ అందుబాటులో ఉంచడానికి వివిధ అభివృద్ధి పథకాల వ్యాప్తికి వీలుగా పశు వైద్యశాలలకు చికిత్సకై తీసుకవచ్చే పశువులపై విధించే ఫీజును తక్షణం రద్దుచేయాలని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. అయితే యీ విధంగా చికిత్సకై చేర్చుకోబడిన పశువులకు అవసరమైన గ్రాసాన్ని యజమానులే తెచ్చుకోవాలి.

## ఆటోరిక్షా ఛార్జీలు

ఆంధ్రప్రదేశ్‌లో నమోదు అయి తిరుగుతున్న ఆటోరిక్షాలకు దిగువ తెల్పిన ఛార్జీ రేట్లను నిర్ణయించాలని ప్రభుత్వం రాష్ట్ర రవాణా సంస్థను ఆదేశించింది. ప్రతి సింగిల్ జర్నీకి కనీసం 50 నయాపైసలకు లోబడి ప్రతి మైలుకు లేక 1.61 కిలోమీటర్‌కు 0-30 నయాపైసలు. ప్రతి 5 నిముషాలకు అంతకు తక్కువ కాలానికి అగు నయాపైసల చొప్పున వెయిటింగ్ చార్జి.

## దేవాలయ పునరుద్ధరణ సంఘం

అహోబిలంలోని శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దేవాలయాన్ని పునరుద్ధరించి అభివృద్ధి పర్చడానికీ, దీనికై ప్రజలనుండి, ప్రజాసంస్థలనుంచి విరాళాలు, చందాలు ప్రోగుచేయడానికీ ఒక దేవాలయ పునరుద్ధరణ సంఘాన్ని ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ముఖ్యమంత్రి యీ సంఘానికి అధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

## చక్కెర ఎగుమతికి పర్మిట్లు

రాష్ట్రంనుండి చక్కెరను ఎగుమతి చేయడానికి తమ అధికార పరిధిలోనివారికి ఆయా కలెక్టర్లు పర్మిట్లు జారీ చేయడానికై జిల్లా కలెక్టర్లు అందరికీ ప్రభుత్వం అధికారం ఇచ్చింది.

దిగుమతి చేసుకునే రాష్ట్రంగానీ, భారత ప్రభుత్వం జారీచేసిన విడుదల ఉత్తర్వు ఆధారంగాగానీ కలెక్టర్లు యీ పర్మిట్లను జారీ చేస్తారు.



# మరిన్ని ముత్యాలు

తామరలు

మొనలావులించి
వాసన నల్ల బసిగొని,
లే దేటి గము
లెంగి లింపకుండ —
నెడసూర గొని
వేచి సుడియు
తెమ్మెరలచే
బొడము పుప్పొడి
పోలి వోవకుండ —
ధరణి కూటమున
మే యెరలి పద్మిని మేన
మొలతెంచు
మధు మద మొలుకకుండ —
మేల్కని గోమిని
మెలగి మై మురిసిన
బొదిగొన్న యకరువు
సెదరకుండ —
దెలిసి జక్కవ
లొండొంటి గలయ
దారు కలకలంబున
రేకులు కదలకుండ —
మున్నకొనివచ్చి
గణికా సమూహితోడ
వరదు బూజించె
పసిడి తామరల
గిరిజ —

—నన్నెచోడుడు.

ప్రసాధన క్రియ

శృంగార రాజ్యలక్ష్మికి
ముడిగలిసిన గతి,
హంస తిలకంబు
గబరి బూన్చి;
మరు రాజధానికి
మణివప్రమిడు గతి,
గటి, నూత్నరత్న
మేఖల యొనర్చి;
ఎలదూడు
చక్రవాకులకు
మేపించిన గతి,
హారలత
సన్నుగన నమర్చి;
సౌభాగ్య లావణ్యా
సతుల దూన్చియ చూచుగతి,
గర్ణముల వసుఖచిత
కర్ణపూరములు వెట్టి;
తూగాడ బొలుతు రొండ్లు
నవయవంబుల కన్నింటి
కవయమైన
పసదనంబు నూల్కొల్పి,
భావ మెసగ జేసి
రుమకు శృంగారంబు
చెలువు మిగుల.

—నన్నెచోడుడు.

చంద్రఖండం

స్ఫురిత ప్రవాళ
లతికా త్యరుణ ద్యుతి
దెగడు మృడు
జటా టవిలోనన్ —
కరమొప్పె జంద్రఖండం,
బరుణాంబుజ
వనము నడిమి
హంసియు వోలెన్.

—నన్నెచోడుడు.

అద్భుతం

కలయో! వైష్ణవ మాయయో!
ఇతర సంకల్పార్థమో!
సత్యమో!
తలపన్నేరక యున్నదానన;
యశోదాదేవి గానో!
పర స్థలమో!
బాలకు డెంత;
యీతని ముఖస్థంబై
యజాండంబు ప్ర
జ్వలనం బందగ
నేమి హేతువొ
మహోశ్వర్యంబు చింతింపగన్.

—పోతన.

నీతి

అకొన్న కూడె యమృతము,
తాకొంకక నిచ్చువాడె దాత,
ధరిత్రిన్ సోకోర్చువాడె
మనుజుడు,
తేకువకలవాడె
వంశ తిలకుడు సుమతీ —

—బద్దెన.

కలంచునా ?

ప్రాంచద్భూషణ బాహుమూల
రుచితో

పాలిండ్లు పొంగార,
పై యంచుల్ మోవగ
కౌగిలించి అధరం బాసింప,
హా శ్రీహరీ యంచున్
బ్రాహ్మణు డోర మోమిడి
తదీయాంస ద్వయంబంటి
పొమ్మంచుం ద్రోచె;
కలంచునే సతుల మాయల్
ధీర చిత్తంబులన్.

—పెద్దన.

కౌటుక బరిణ

తరుణ తర
శశిమండాలాత్యరుణ రుచులు
గొడగు లెదగ్రుచ్చి

నడినెత్తికొనిన
సాంద్ర తిమిర పటలంబు
వ్రాలు పారె
దీపదీప్తి పరివృతంబైన
కజ్జల పాత్ర వోలె.

—నన్నెచోడుడు.

ఎండ

తలచిన డెందము గందును,
బలికిన నోరెల్ల బొక్కు
త్రొక్క కాలిన చెప్పులు గనుగు
ననగ, బటుతర —
విలయానల భాతి
నెండ, వేసవిగాంచెన్,
ఉరు నిదాఘాతపాహతి,
గరుల తలలు వ్రస్సి,
లోపలి ముత్యముల్
పరుస మెఱసి,
మంగలములోని
ప్రేలాల భంగి దూలి,
ప్రేలిపడ గానె
గట్టెండ పిడువరించి.

—నన్నెచోడుడు.

జడి

గురుగుం, జెంచలి, దుమ్మి,
లే దగిరిసాకుం,
దింత్రిణీ పల్లవోత్కరముం
గూడ బొరంటి నూనియలతో
గట్టావి కుట్టారు
కోగిరముల్మెక్కి,
తమిం గొమ లొప్పలము వో
గ్రేపు ల్మెయులాన్నక,
మే కెరుపుం గుంపటి
మంచ మెక్కిరి,
ప్రభుత్వైకాప్తి
రెడ్ల జడిన్.

— శ్రీకృష్ణదేవరాయలు

పదజాలం

నదమూ పొక్కిలి,
జాంబూనదమూ మెయిచాయ,
కోకనదమూ పదము,
ఆ పదమూ జడ,
నడుము వియత్పదమూ,
నూగారు గూఢ పదమూ
చెలికిన్.

—కూచిమంచి తిమ్మకవి.

సురనది

తరుణతర తరణి కిరణ
స్ఫుకటం బికంబింకు
నభవు జూటాటనిలో
సురనది వాలిచె
లతాంత స్థిర కింశుక
వనము నడిమి
హంసియ వోలెన్.

—నన్నెచోడుడు.

చందమామ

సంధిలు పూర్వ దిక్సతి
మణికాంచి పై రంజిల్లు
నాయకరత్న మొక్కో ?
విలసిల్లు నద్దేవి
వృత్త స్తనాంతరా పూరిత
కాశ్మీర పుంజ మొక్కో ?
తనరారు నా హరిత్తరళాక్షి
పరిపక్వ బింబారుణాధర
బింబ మొక్కో ?
మేలిల్లు నబ్జాల ఫాలతటంబున
విలసిల్లు రోచన తిలక మొక్కో ?
మొవ్వ మొప్ప దన
సమాగమంబునకు
నా రమణి వలన బర్వు
రాగ మొక్కో ?
అనగ దరతరంబ
తనరె,
నత్యరుణాంగ భాతి
గునలయైక బాంధవుండు.

—నన్నెచోడుడు.

వేకువయినా....

అకటా ! యేమని దూఱుదాన
నిను నాథా, వేగుజామయ్యె
పొందికగా పాదములొత్త
రమ్మనుట గానీ,
ఒంటి యేమో కదా
నికటశోణికి
చేర రమ్మనుటగానీ,
కొంత నెయ్యంపు పూనికతో
కన్నుల నత్తి యుంచుటయె గానీ
లే దొకింతేనియున్.

—వింగళి సూరన.

వేదన

జనకు డుండెడు ననుష్ఠాన వేదిక
జూచు,
జూచి క్రమ్మరబోయి చూడవచ్చు;
స్నానార్థ నియమిత
జలజాకరము జూచు,
జూచి క్రమ్మఱ బోయి చూడ
వచ్చు;
నిజహస్త పోషిత
కుజవల్లికల జూచు,
జూచి క్రమ్మరబోయి
చూడవచ్చు;
కుజ కోటర కుటీర
క్రోడవీథులు జూచు,
చూచి క్రమ్మర బోయి
చూడవచ్చు
తండ్రి బాయంగలేని
సంతాప జలము,
అత్తవారింట కేగెడు
హర్ష జలము
గోరువెచ్చని పాలిండ్ల
కొనలు దడుప
అడప దడపను
పయ్యెద దుడుచుకొనుచు.

—పిల్లలమర్రి వినవీరభద్రుడు.



## అనంతపురం జిల్లా

*చెరువుగట్ల మరమ్మతు :*

విపరీతమైన వర్షాలు కారణంగా పెనుకొండ పంచాయతీ సమితికి చెందిన మాకలపల్లి, శుద్ధకుంటపల్లి, నల్లూరు, చల్లపల్లి, పెద్దిపల్లి గ్రామాలలో గట్లు తెగిపోయిన నీటి పారుదల చెరువుల మరమ్మతుకు ఆయా గ్రామాలలోని గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాలు, రక్షణశ్రామిక బ్యాంకులు తక్షణం తగు చర్యలు తీసుకోవడంవలన సకాలంలో పని పూర్తయ్యింది. ఇక్కడ మొత్తం రూ॥ 5,000 ల విలువ మేరకు పని చేయబడింది.

*ఎరువుల పంపకం :*

రాయదుర్గ పంచాయతీ సమితిలో 21 మణుగుల మేలుజాతి విత్తనాలు, 1188 మణుగుల ఎరువులు పంచబడ్డాయి.

## చిత్తూరు జిల్లా

*శ్రమదానం :*

మదనపల్లి పంచాయతీ సమితిలో తూగవండ్లపల్లి గ్రామంలోని గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం సభ్యులు శ్రమదానంతో 6 ఫర్లాంగుల రోడ్డును నిర్మించారు. మొత్తం రూ॥ 1,500 ల ఖరీదుచేసే శ్రమదానాన్ని వీరు యిచ్చారు.

## తూర్పుగోదావరి జిల్లా

*గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాలు :*

1963 అక్టోబరు, నెలలో కోటనందూరు గ్రామంలో 10 మంది స్త్రీలతోసహా మొత్తం 115 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంలోను, 90 మంది రక్షణ శ్రామిక బ్యాంకులోను సభ్యులుగా చేరారు.

*ఎరువుల పంపిణీ :*

సీతానగరం పంచాయతీ సమితిలో రైతు [illegible] 3744 [illegible] వులు, యితరఎరువులు పంపిణీచేయబడ్డాయి. 28 ఆధునిక వ్యవసాయ పనిముట్లు చేర్చబడ్డాయి. వ్యవసాయదారుల సంఘం కూడా ఒకటి ప్రారంభించ బడింది.

## గుంటూరు జిల్లా

*సహాయ కార్యక్రమం :*

ఈమని పంచాయతీ సమితిలో వరదల వల్ల నష్టపోయినవారికి సహాయపడే కార్యక్రమం క్రింద ప్రాథమిక చర్యగా 10 బస్తాల ధాన్యం సేకరించి పంచిపెట్టబడింది.

*విత్తనాలు, ఎరువుల పంపకం :*

వినుకొండ పంచాయతీ సమితిలో 339 మణుగుల మేలుజాతి విత్తనాలు, 613 మణుగుల రసాయనికపు ఎరువులు, 63 ఆధునిక వ్యవసాయ పనిముట్లు పంచిపెట్టబడ్డాయి.

## కరీంనగరం జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం :*

సుస్తులపూర్ పంచాయతీ సమితికి చెందిన ఇందుర్తి గ్రామంలో అక్టోబరు 29 వ తేదీ నుండి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. పరిసర గ్రామాలనుండి ఎన్నికచేసిన 50 మందికి వ్యవసాయం, పశుపోషణ ఆరోగ్యం పారిశుద్ధ్యం, విద్య, పంచాయతీరాజ్ మొదలయిన వాటిలో శిక్షణ యివ్వబడింది.

*స్త్రీల శిక్షణ శిబిరం :*

కల్లెడ పంచాయతీ సమితి వెల్లుమట్లలో బ్లాకు స్థాయిలో ఒక స్త్రీల శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేసింది. ఈ శిబిరంలో 65 మంది మహిళలు పాల్గొన్నారు.

*రోడ్డు నిర్మాణం :*

రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులు పున్నుగూడెం నుండి దుమ్మన్నపేట వరకూ ఒక రోడ్డును నిర్మించారు. ఈ నిర్మాణానికి వీరు యిచ్చిన శ్రమదానం కూలీ రూపంలో రూ॥ 1,300 ల మేరకు వుంటుందని అంచనా వేయబడింది.

## నల్గొండ జిల్లా

*ప్రణాళికా సమాచారగోష్ఠి :*

నవంబరు 14 వ తేదీన న్యాయ, సమాచారశాఖా మంత్రి నల్గొండలో జిల్లా ప్రణాళికా సమాచార గోష్ఠికి ప్రారంభోత్సవం చేశారు.

*రోడ్డు పనులు :*

నల్గొండ జిల్లా పరిషత్‌కు చెందిన కమ్యూనికేషన్ విషయాల స్థాయీ సంఘం వివిధ



బ్లాకులలో 15 రోడ్డు పనులు చేపట్టడానికి రూ॥ 5.59 లక్షలు మంజూరు చేసింది.

హోంగార్డుల శిక్షణ :

నల్గొండలో మూడునెలల హోంగార్డుల శిక్షణను జిల్లా పోలీసు సూపరింటెండెంట్ ప్రారంభోత్సవం చేశారు. 110 మంది ఈ శిక్షణలో పాల్గొన్నారు.

వ్యవసాయదారుల శిక్షణ శిబిరం :

మోతుకూరు పంచాయతీ సమితికి చెందిన ముర్పిరియాల గ్రామంలో మూడురోజుల పాటు ప్రత్యేక వ్యవసాయంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. మేలుజాతి వ్యవసాయ కార్యక్రమాలలోను, పశువుల అభివృద్ధిలోను, గ్రామ పంచాయతీలలోను, సహకార సంఘాలలోను 50 మందికి శిక్షణ యివ్వబడింది.

## నిజామాబాదు జిల్లా

శిక్షణ శిబిరం :

మోర్తాడ పంచాయతీ సమితి చౌటుప్పల్ గ్రామంలో నిర్వహించిన మూడురోజుల గ్రామ సహాయకుల శిక్షణ శిబిరానికి నవంబరు 3 వ తేదీన ప్రణాళికా, పంచాయతీ రాజ్ శాఖల మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం :

నిజామాబాద్‌లోని జిల్లా పౌరసంబంధాల అధికారి కార్యాలయంలో జిల్లా సమాచార కేంద్రానికి నవంబరు 8 వ తేదీన న్యాయ, సమాచారశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

---

## విద్యుచ్ఛక్తి

తాడేపల్లి–నాగార్జునసాగర్–హైదరాబాదు 132 కె. వి. లైన్ :– 132 కె. వి. తాడేపల్లి–నాగార్జునసాగర్–హైదరాబాదు విద్యుత్ ప్రసార మార్గాన్ని 1963 అక్టోబరు 13 వ తేదీన(66 కె. వి.) వినియోగంలోకి తేవడం జరిగింది. మాచ్‌ఖండ్ విద్యుత్కేంద్రం నుంచి మహబూబ్‌నగర్, సంగారెడ్డి ఫీడర్ లైన్లద్వారా తెలంగాణాకు సుమారు 2,500 కి.వా.ల వరకువిద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం జరుగుతున్నది.

ఇప్పటివరకు విడివిడిగా వున్న ఆంధ్ర, తెలంగాణా విద్యుత్ ప్రసారాలను కలుపుతుంది కాబట్టి ఇది రాష్ట్ర గ్రిడ్‌లో ముఖ్యమైన భాగం. ఇది ఎగువ సీలేరు, కొత్తగూడెం విద్యుత్కేంద్రాలనుండి కోస్తా ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని లభింప జేయగలుగుతుంది. ఈ విద్యుత్కేంద్రాలను మూడవ ప్రణాళిక ముగింపులో వినియోగంలోకి తెస్తారు.

190 మైళ్ళ పొడవునవుండే ఈ విద్యుచ్ఛక్తి ప్రసారమార్గం 70,000 కి. వా. ల విద్యుచ్ఛక్తిని ప్రసారం చేయగలుగుతుంది. ఇది కృష్ణానదిని నాగార్జునసాగర్ ఆనకట్ట వద్ద దాటుతుంది. అక్కడ 2757 అడుగుల (280 అడుగుల ఎత్తుగల టవర్లపై) ఒకేఒక స్పాన్‌ను ఏర్పాటు చేశారు. రాష్ట్రంలోని ఇటువంటి 'స్పాన్' లలో యిది పెద్దది.

## అవనిగడ్డ వంతెన

కృష్ణా జిల్లా చల్లపల్లి – అవనిగడ్డ – నాగాయలంక రోడ్డు చాలా ముఖ్యమైనది. ఈ రోడ్డు 23/8 వ మైలువద్ద తూర్పు కాలువపై ప్రస్తుతంవున్న ఉక్కు వంతెన పడిపోయే స్థితిలోవుంది. ఈ వంతెనకు ఒక్కొక్కటి 14 అ. 9 అం.ల చొప్పున 4 స్పాను లున్నాయి. ప్రవాహానికి ఎగువన పాత వంతెనకు 15 అడుగుల దూరంలో రూ. 1.5లక్షలవ్యయంతోక్రొత్తవంతెననిర్మించారు. దీనికి ఒక్కొక్కటి 18 అ. 6 అం. ల చొప్పున 4 స్పాను లున్నాయి. ఈ వంతెన పనిని 3½ నెలల వ్యవధిలోనే పూర్తిచేశారు. వంతెనకు 1963 అక్టోబరు 10 వ తేదీన ప్రజారోగ్యశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేశారు. భవనాలు, కమ్యూనికేషన్ల మంత్రి సభకు అధ్యక్షత వహించారు.

అభ్యుదయం

*

# 'రణభేరి'

విఖ్యాతాంధ్రకవులు

జాతీయైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరాలైన

గేయముల రెండవ సంపుటి

**వెల 00-25 న. పై.**

ఇతర ప్రచురణలు :

| | | |
|---|---|---|
| శంఖారావం : (గేయాలు) | రూ. 0-25 | న. పై. |
| కనువిప్పు : (బుర్రకథ) | రూ. 0-25 | ,, |
| చైనా ద్రోహం : పిం భారత్ (బుర్రకథలు) | రూ. 0-25 | ,, |
| పాంచజన్యం : (బుర్రకథ) | రూ. 0-25 | ,, |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | రూ. 2-75 | ,, |
| వందేమాతరం : ( నాటిక ) | రూ. 1-00 | |


ప్రచురణకర్తలు :

సమాచార పౌర సంబంధాలశాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాద్



క్రతిసత్వం అంతా సాంద్రీభూత మయినట్టు కొండలు ఒక దానితో ఒకటి కలిసిపోయి ఆ కలయిక వలయాకారంగా ఏర్పడింది. ఆ ప్రదేశంలో.

కొండలకు సహితం గుండె వుందనీ, ఆదను కలిగినప్పుడు అవికూడా ప్రవిస్తా యనీ నిరూపించటానికేనా అన్నట్లుగా విశాల మయిన అరణ్యం వంటి లోయలో లోతయిన నీటి నీలిమతో తొణికిస లాడుతూవుంది, నిండుగా సరస్సు.

దట్టంగా పెరిగిపోతున్న అరణ్యాన్ని అదుపులోకి తేవటానికన్నట్లుగా చెట్లుకొట్టి, కట్టెప్రోగు చేసి, ఎగుమతి చేస్తూ వుంటారు, లోయలోని చిన్న పల్లెజనం.

పట్టణాలలో పందిరి మంచాలు మీద హాయిగా కునుకులు తీస్తూ ఆపులించే అదృష్ట వంతులకి కలప అనుదినం ఉపయోగ పడేందుకు అనువయిన విధంగా అందించ టానికి.మార్గం ఆలోచించి, ఏర్పరచిన రైలు మార్గం ఎగుమతి స్వీకరించి, తలవూపి. ఒక్క దగ్గుదగ్గి, వెళుతూ వుండే చోట వుందొక రైలు స్టేషను.

ఆ సరస్సు తీరంలోని పల్లెలో జన్మించి, ఆ అడవిలోని కలప ప్రోగుచేసి, ఆ స్టేషనులో గూడ్సు బండిలో ఎగుమతి చేస్తూ జీవిస్తూ వుంటాడు తిరుపతి కొండవంటి గుండెతో.

గూడ్సు ఎక్కడినుంచి వస్తుందో, ఎక్కడికి వెడుతుందో అనే మీమాంస — ఆ లోయలో పుట్టి, పెరిగి. అతడి భార్యను కోల్పోయిన తిరుపతికి — తెలియ లేదు.

చనిపోక ముందు జీవించివున్న తిరుపతి భార్య ఏం చేస్తూ వుండేదో అతనికి లీలగా జ్ఞాపకం వుంది.

అన్నం వండేది. ఇల్లూ వాకిలీ ఊడ్చేది. సరస్సు ఒడ్డున ఉన్న స్థలంలో పిచ్చి పిచ్చి పూల మొక్కలు నాటి ఏదో తోట అంటూ

# బాటపడిన చోటు

ఎవరో గవర్నమెంటు వారు పెంచమంటే నీళ్ళుపోసి సాకుతూ పసిపిల్లల్ని ముద్దులాడినట్టు మొక్కల్ని పెంచుతూ వుండేది.

అదేం సరదాగా వుండేదో తిరుపతికి మాత్రం తెలియదు కాని దూరంగా వున్న పట్టణంలోని మనుష్యులు [illegible] ఖర్చుపెట్టుకొని వచ్చి లోయలో తిరిగి, కాళ్ళు నొప్పులు గమనించకుండా కొండ లెక్కి. సరస్సులో నీళ్ళు త్రాగి ఉద్యాన వనంలో కూర్చుని ఊరికినే చుట్టూ చూస్తూ 'ఆహా' 'ఓహో' అనుకోవటం మాత్రం జరుగుతూ వుంటే ఇదీ ఒక వింతే అనుకునే వాడు.

తిరుపతి భార్య తోటలో పని చేస్తూ వుండేది.

సరస్సులో నీరు కడవతో తెచ్చి, పూల మొక్కలకు పోస్తూ ఒకరోజు ఆమె కాలు జారి నీళ్ళలో పడి మరణించింది.

మరణించిన ఆమె తన పిల్లల్ని ఇద్దర్ని తిరుపతికి వదిలింది.

భార్యలేని తిరుపతి పిల్లల ముఖాలలో భార్య ముఖం కవళికలు చూచి మురిసి పోతూ వుండేవాడు.

పిల్లలలో మొదటి వాడు గోపి. వాడికి పన్నెండు సంవత్సరాలు పూర్తిగా లేవు. వాడి శరీరం ఉక్కు. అమ్మ సరస్సులో పడి చనిపోతున్న సమయంలో వాడే దగ్గర వుంటే తప్పకుండా బ్రతికించే వాడు. చేప పిల్లలకు ఈదులాడటం పుట్టుకతో వచ్చినట్లు ఆ పిల్లాడికి ఈతలో ఇంతా అంతా అనరానంత సరదా.

రెండో వాడు బుజ్జి. వాడికి ఎనిమిది సంవత్సరాల కంటే ఏ మాత్రం వయస్సూ లేదు.

భార్యమీద వుండే మక్కువ పిల్లలమీద కేంద్రీకృత మయింది తిరుపతికి భార్య గో[illegible]

అతని ప్రేమ అయితే పిల్లల్ని చుట్టుకుంది కాని తల్లిలేని లోపంతో వాళ్ళు బాధ పడుతూ వుండే క్షణాలలో అతను పిల్లలకి దూరమయిపోతూ వుంటే క్రుంగిపోతూ సహించలేక పోయేవాడు.

తిరుపతి ఎందుకు రెండో పెళ్ళి చేసుకోలేదో తెలియదు. మానిని వైపు మనస్సు మొగ్గలేదు కాని మద్యం వైపు తూలి పోయాడు.

భార్యను గుర్తు తెచ్చుకోకుండా వుండటం కోసం తప్పని సరిగా అలవాటు చేసుకొన్న మద్యపానం మాత్రం పిల్లల్ని గుర్తుకు రాకుండా చేస్తూ వుంది.

రాత్రీ పగలూ ఇదీ విధానం అనేది లేకుండా కలప వాగిన్లలో ఎగుమతి చేస్తూ వుండే తిరుపతి ఎప్పుడు ఇల్లు విడిచి పెట్టే వాడో, మరెప్పుడు ఇంటికి వచ్చేవాడో పిల్లలకి తెలిసేది కాదు.

ఏదో మామూలుగా వచ్చిన కూలీతో గింజలు తెచ్చుకొని ఇంత ఉడకేసుకొని నాలుగు మెతుకులు తిని ఏదో సారాయి త్రాగి నిద్రపోయే తిరుపతికి సక్రమ మయిన విధానం లేకుండా పోయింది, జీవితంలో.

పిల్లలకి తల్లిలేదు. తండ్రి ఆదరణ లేదు. అయితే తండ్రి ప్రేమ వాళ్ళకేమీ దూరం కాలేదు. అయితే దాని స్వరూపం పిల్లలకేమీ తెలియదు.

వేళకు అన్నంలేక, నిద్రపుచ్చే అమ్మలేక పిల్లలు ఎక్కడో ఆడుకొని అన్నం వుంటే తిని లేకపోతే అడివిలో కాయలు తిని [illegible] అయిపోయారు.

కల్లుగానీ, సారాయి గానీ త్రాగినప్పుడు కారంగా వుండే మాంసం ముక్కలు గానీ, చేప ముక్కలుగానీ వేయించుకొని వేడిగా తినటం అలవాటు అయిపోయింది, తిరుపతికి.

ఒకరోజు చేపను తెచ్చి, బండమీద రుద్ది పొలుసు పోగొట్టి, ఉప్పుతో తోమి జోము కడిగేసి ముక్కలు ముక్కలుగా తరిగి ఉప్పూ కారమూ వేసి బాగా కలిపి, మంగలంలో నూనె వేసి అందులో ముక్కలు వేయించి, రుచిచూచి, చట్టిలో భద్రంగా పెట్టి మూకుడు మూత వేసి సారాయి త్రాగి రావటం కోసం ప్రక్కనే వున్న అంగడిలోకి వెళ్ళాడు.

అప్పటిదాకా ఎక్కడో ఆడుకుంటూ వున్న గోపీ, బుజ్జీ వచ్చారు.

వేపుడు చేపముక్కల కమ్మని వాసన ఇల్లంతా క్రమ్ముకుంది. బాల్య చాపల్యమూ, కడుపులో జఠరాగ్ని చాంచల్యమూ వున్న పిల్లలు మూకుడు మూత తీసి చూచి ముచ్చట పడి మురిసి పోయారు.

లాలాజలం జ్వలించి, నోరు తడుపుకొని నాలికతో పెదాలు నాక్కొంటూ బుజ్జి మెల్లిగా 'అన్నయ్యా' అన్నాడు.

బుజ్జి అలా పిలవటంలో ఆంతర్యం అర్థం చేసుకొన్న గోపీ తనకీ ఆసక్తి కలుగుతూ వుండగా 'ఏం' అన్నాడు.

'తిందామా ?'

'నాన్న తంతాడు !'

'ఒక్క-ముక్క !'

గోపీ ఆలోచించాడు. అందులో చాలా ముక్కలున్నాయి. ఒక్కముక్క తీసుకున్నంత మాత్రాన నాన్నకి తెలియదు. పైగా సారాయి త్రాగిన మైకంతో వచ్చి ఉన్నంత వరకు తినేస్తాడు. అలా భావించి 'సరే తీసుకో !' అన్నాడు.

బుజ్జి అమృతం స్వీకరించ బోతున్నంత ఉత్సాహంతో మూతతీశాడు. గుప్పున మధుర మయిన పరిమళం గదంతా నాట్యం చేసింది.

ముక్క తీసుకొన్నాడు. వేడిగా వుంది. అయినా మెల్లి మెల్లిగా కొరుక్కు తినటం ప్రారంభించాడు. పెదాలకు నూనె అయినా, ముక్కుకి కారం తగిలినా ఏమీ లెక్క చేయటం లేదు బుజ్జి.

అంత ఆప్యాయంగా బుజ్జి తింటూవుంటే గోపీకి కూడా నోరు వూరింది. సంకోచంతో 'బుజ్జీ నేను కూడా ఒకటి తీసుకోనా' అని అడిగాడు.

ఏం సంకోచం లేకుండా 'ఓ దానికేం తీసుకో, బలే బాగావుంది' అన్నాడు ఆలోచన అనవసరం అనే ధోరణిలో.

గోపీ ఒకముక్క తీసుకున్నాడు. అది కొంచెం పెద్దదిగా వుంది. అంతలో బుజ్జి ముక్క అయిపోయింది.

అన్నముక్క వైపు, చట్టివైపు చూస్తూ 'నా కేమో చిన్నదీ నీ కేమో పెద్దదీనా' అన్నాడు చేతులు వూపుతూ.

'నువ్వు చిన్నాడివీ, నే నేమో పెద్దాడినీ' అన్నాడు గోపీ తనకేదో ఆధిక్యతా అర్హతా వున్నాయన్నట్లుగా.

అలా మాట్లాడు కుంటూ వాళ్ళిద్దరూ చట్టిలోవున్న వేపుడు చేపముక్కలు మొత్తం పూర్తిగా తినేశారు.

ఇద్దరూ లేచి కుండలో వున్న మంచినీళ్ళు ముంతతో ముంచుకొని కడుపునిండా కాళీ లేకుండా త్రాగి త్రేన్చుతూ, హాయిగా ఒకరి నొకరు చూచుకుంటూ బాగా వున్నాయి కదా అంటే బలే బాగా వున్నాయనుకుంటూ వున్నాగ

అంతలో వేడిగాలి వీచింది. సారాయి కంపు తగిలింది. పూటీగా తాగిన తిరుపతి యిల్లుగా వచ్చాడు.

త్రాగిన మనిషి తూలాలని కానీ, ఎవ ర్నయినా తిట్టాలని కానీ అంటే తిరుపతి ఒప్పుకోడు. వేడి కారం ముక్కలు నాలుగు తిని ముసుగు పెట్టి నిద్ర పోతే చాలు అంటాడు.

వస్తూనే 'ఇప్పటిదాకా ఎక్కడున్నారు' అని అడిగాడు.

'ఆడుకుంటూ వున్నాం.'

తిరుపతి చట్టి దగ్గరకు పోయాడు. మూత లేదు. ముక్కలు లేవు. గుండె గతుక్కు మంది. ఆశ నిరాశ అయిపోయింది. కోపం బాధలోనుంచి పుట్టి పెరిగి కొండల ఎత్తు అయింది.

పిల్లలంటే ఎంత ఆప్యాయత వున్నా ఆ సమయంలో మాత్రం విపరీతంగా కోపం వచ్చింది. వాళ్ళే తినివుంటారని అనుకోగానే బాధ తీవ్రమయింది. అంత కష్టంలోనే అడి గాడు.

'చేపముక్కలు ఏమయ్యాయి ?'

బుజ్జికి ఏడ్పు వస్తూవుంది. ఏం చేయాలో చిన్నబుర్ర ఆలోచించలేక పోతూవుంది. కళ్ళుమూయకుండా పిచ్చి వాడిలాగాచూడడం తప్ప ఏమీ మాట్లాడలేక పోయాడు.

గోపీకి అకస్మాత్తుగా ఆలోచనవచ్చింది. 'మాకేమీ తెలియదు. పిల్లులు ఏమయినా తిన్నాయేమో !' అన్నాడు.

అన్నయ్యా బలే గొప్పగా సమాధానం చెప్పాడని బుజ్జి ఎగిరి గంతేసినంత ఆనందం పొందాడు.

ఆమాట వినటంతో తిరుపతి కోపం పరాకాష్ఠ నందుకుంది. కోపంతో ఎర్రబడి వణుకుచున్న ముఖంవైపు భయంతో వణుకు తున్న పిల్లలు చూడలేక పోయారు.

'నన్ను అడిగితే వద్దనీ, మీకు పెట్ట కుంటా తినేవాడిని గాదు. అడగలేదు అదే తప్పు. పోనీ తిన్నారు, మీరే తిన్నారని నాకు తెలుసు. దొంగతనం చేశారు. పోనీ అడిగాను. దానికి జవాబు చెప్పారు. అది అబద్ధం. ఇలా తప్పులు చేయటం, దొంగ తనాలు చేయటం, అబద్ధాలు చెప్పటం మీకు ఇంత చిన్నతనంలోనే అలవాటు అయితే రేపు దేశాలే నాశనం చేస్తారు. పిల్లితిందా ? మీరు తినలేదూ !? అయితే ఈ దెబ్బలుకూడా మీరు తినవద్దు' అంటూ గోపీ వీపుమీద రెండు గుద్దులు గుద్దాడు.

గోపీ ఏమీ అనలేక ఏడవటం ప్రారం భించాడు. వాడి ఏడుపు చూస్తే బుజ్జికి ఏడుపు వచ్చింది. భయంతోనే చెప్పాడు.

'నాన్నా ! నాన్నా ! అన్న తినలేదు. నేనే తిన్నాను' అని చెప్పాడు.

నాన్నకి తనమీద ప్రేమ ఎక్కువనీ, తననేమీకొట్టడనీ నమ్మకంతో అన్న దెబ్బలు తినటం చూడలేక అలా చెప్పాడు.

'అలాగా ?' అంటూ తిరుపతి బుజ్జిని నెత్తిమీద చాచి కొట్టాడు. వాడు నేలమీద పడిపోయాడు.

దెబ్బలు ఓర్చుకోలేని చిన్న తమ్ముడు అలా అయిపోవటంతో గోపీకి దుఃఖం కలిగింది.

'నాన్నా ! నాన్నా ! వాడు తినలేదు. నేనే తిన్నాను, మరెప్పుడు తిననునాన్నా, కొట్ట వద్దు నాన్నా' అంటూ ఏడవటం ప్రారంభించాడు.

'ఇద్దరూ కలిసి చేసినపని అన్నమాట' అని గోపీ జుట్టు పట్టుకొని సారాయి తాగిన మత్తుతో బాగాకొట్టాడు.

'కుయ్యో మొర్రో' మని ఇద్దరూ ఏడుస్తూ వుంటే 'ఈ దెబ్బలు తినటం ఆ ముక్కలు తిన్నట్లు లేదేం ?' అని తప్పించుకొని పారిపోయే గొడ్డును కట్టేసి కొట్టినట్టుగా బాదాడు.

తప్పి పోతామేమో అనే భయం కలిగి పిల్లలు 'చస్తున్నాం బాబోయ్' అనగానే చనిపోయిన భార్య గుర్తుకువచ్చి కొట్టటం ఆపాడు.

వాళ్ళచేత నిజం చెప్పించగలిగి నందుకు ఒకడిని కొడుతుంటే తప్పించటానికి మరొకడు ప్రయత్నించటం గమనించ గలిగి నందుకు అంతమత్తులోను ఆనందం కలిగినా కోపం మాత్రం తగ్గిపోలేదు.

'ఇలా చూడండి. అక్కడ గాలాలు వున్నాయి. అవితీసుకొండి'

పిల్లలు తీసుకున్నారు.

'సరస్సు దగ్గరకు పొండి. చేపలుపట్టుకు రండి. చేపలు పడలేదంటూ ఎక్కడోతిరిగి వట్టి చేతులతో వచ్చారా తాట వలుస్తాను. తెలిసిందా ?'

తెలిసిందన్నట్టు తలలూపారుఏడుస్తూనే.

'వెళ్ళండి'

వెళ్ళిపోయారు.

ఇంత పొగికారం నాలికకు తడి చేసుకొని, మరింత ఉప్పునమిలి ముసుగు పెట్టుకొని పడుకొని నిద్రపోయాడు తిరుపతి ఆ మధ్యాహ్నం.

గాలాలు పట్టుకొని పిల్లలిద్దరూ సరస్సు వైపు నడక సాగించారు.

తండ్రి పెద్దగాలం లాగా తలంపుకి వచ్చాడు.

సరస్సు సమీపించి ఒకచోట గోపీ ఆగటంతో బుజ్జీకూడా ఆగాడు.

అక్కడ వాళ్ళ అమ్మ కాలుజారి పడి చనిపోయింది. అక్కడ లోతు ఎక్కువ.

గాలాలకు ఎరలు గుచ్చి నీళ్ళలో వేశారు.

అక్కడ చనిపోయిన అమ్మ పిల్లలకు మేలు చేయాలన్నట్టుగా ఎక్కువ చేపలు పడేటట్టు చేస్తుంది అని గోపి అనుకుంటాడు.

ఆరోజు వాళ్ళు ఎంత సేపు కూర్చున్నా ఒక్కచేపకూడా పడలేదు.

ఇద్దరికీ విసుగు పుడుతూవుంది, ఎరలు రాలి పోయాయేమోనని మళ్ళీ మళ్ళీ చూస్తున్నారు,

ఆ సరస్సులో చేపలు పట్టుకో కూడదు. పట్టుకోవటం దొంగతనం అవుతుంది.

పిల్లలు దొంగతనం చేయటం సహించని తిరుపతి దొంగతనం చేయటానికే పంపాడు.

ప్రకృతి సౌందర్య పరామర్శ కోసం వచ్చిన యాత్రికులు తిరుగుతూ వున్నారు.

చాలా సేపు అయింతర్వాత బుజ్జి పట్టుకున్న గాలం బెండు మునిగింది.

గాలంకి కర్రవుంటుంది. దానికి గట్టితాడు వుంటుంది. మధ్య బెండు వుంటుంది. బెండుకు మళ్ళీ తాడు వుంటుంది. తాడు చివర ఇనుప ముల్లులాంటి కొక్కి వుంటుంది. దానికి చిన్నచేపగాని, మాంసం ముక్కగాని, వానపాముగాని ఎరగా చుడతారు. ఆ ఎర తినటంకోసం చేప వస్తుంది. తింటుంది. అంతలో గొంతులో కొక్కి గుచ్చుకుంటుంది. అది పోవాలని ప్రయత్నించి, పోలేక గింజుకుంటూ గింజుకుంటూ, తన్నుకు లాడుతుంది. అలా జరుగు తున్నప్పుడు గాలం బెండు మునుగుతుంది.

బెండు మునగటంతో చేప పడిందని తెలుసుకున్న బుజ్జి చేతిలో వున్న కర్ర లాగాడు.

గట్టిగా వుంది. రాలేదు. ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది.

'అన్నాయ్' అన్నాడు బుజ్జి.

'ఏం' అంటూ గాలం లాగటానికి సతమత మవుతున్న వాడిని చూచి చేతిలో గాలంకర్ర నేలలోగుచ్చి 'వస్తూన్నా వుండు' అంటూ దగ్గరకు పోయాడు.

గోపీ గాలం లాగాడు. రాలేదు. బరువుగా వుంది. లాగలేనంత పెద్దచేప పడిందనిపోల్చుకోవటానికి ఎంతో సేపు పట్టలేదు.

అదే గాని ఒడ్డుకి లాగితే అదొక్కటే చాలు. మరేమీ పట్టుకోనక్కరలేదు.

విసిరి లాగకుండా నెమ్మదిగా గుంజటం ప్రారంభించాడు గోపీ.

గొంతులో వున్న కొక్కెం కదలటంతో బాధపుట్టి చేప తన్నుకు లాడింది కాబోలు తాడు తెగిపోయింది.

కర్ర ఒక్కటే మిగలటంతో సంగతంతా ఇద్దరికీ అర్థమయిపోయింది.

ఆ సమయంలో బెండుపైకి తేలింది.

అప్పుడు బుజ్జికి ఆలోచన వచ్చింది.

గాలం దూరమవుతూ వుంది.

చేపలు పట్టుకు రమ్మని చేపలకూర తిన్నందుకు నాన్న కొట్టి పంపాడు. చేపలు లేకుండాపోతే మళ్ళీ కొడతాడు.

గాలంకూడా లేకుండా యింటికి పోతే తప్పకుండా దెబ్బలు తగులుతాయి.

చేపలా దొరకలేదు. గాలమా పోతూ వుంది.

ఏం చేయాలో తెలియని బుజ్జి ఏంత లోతుందో తెలియని సరస్సులో ఏలా ఈదాలో తెలియక పోయినా దూకాడు.

దూకటానికి మనస్సు ఒప్పుకుంది. శరీరం అంగీకరించింది. అయితే ఈదటానికి మనస్సు త్వరపెడుతున్నా నేర్పులేని శారీరక యంత్రం ఈదలేకపోతూ వుంది.

అమ్మ చనిపోయింది అక్కడే. అక్కడే లోతు ఎక్కువగా వుంది.

అక్కడ నీళ్ళలో పడినవాళ్ళు బ్రతకరని గోపీ నమ్మకం.

తమ్ముడు దూకాడు. చేపగానీ, గాలంగానీ వాడికి చిక్కవు. అయితే వాడుకూడా తమకు దక్కడు. గుండె బిక్కుబిక్కు మంటూ వుంది.

వాడికి ఈతరాదు. నీళ్ళంటేనే వాడికి భయం.

ఊపిరి ఆడటంలేదు కాబోలు తన్నుకులాడుతున్నాడు, అయినా గాలం తేవాలని వాడి తాపత్రయం.

గోపీ ఎగిరిదూకాడు. తమ్ముడి దగ్గరకు పోయాడు. వాడు లోపలికి పోవాలంటాడు. గోపీ వెలుపలికి రావాలంటాడు. ఇద్దరూ అపాయకరమయిన చోటులో పేచీ పడుతున్నారు.

ప్రాణభయం బుజ్జికి లేదు. ప్రాణం పోవటం గోపీకి ఇష్టంలేదు.

బలవంతంగా గోపీ బుజ్జిని ఒడ్డుకు లాక్కొని వచ్చాడు.

గట్టుకు చేరిన తరవాత చిన్నవాడు ఏడ్పు ప్రారంభించాడు. తన అభీష్టం నెరవేరలేదు.

వాడు ఏడవటంచూస్తే పెద్దవాడికి వళ్ళు మండిపోతూవుంది.

వాడు మళ్ళీ నీళ్ళలో దిగాలని తొందర పడుతున్నాడు. వద్దన్నా వినిపించుకోవటం లేదు.

అక్కడ నీళ్ళలో దిగటం ప్రమాదంఅని తెలియక బుజ్జీ వెళుతుంటే అన్న ఆపలేక పోతున్నాడు.

చిన్నవాడి మారాం మరీ ఎక్కువయి పోతూంది. అన్న సహించలేక పోయాడు.

కోపం ఆపుకోలేక కొడితే వూరుకుంటాడని రెండు దెబ్బలు వేశాడు.

వాడి ఆగటం ఇంకా ఎక్కువవుతూంది. గోపీకి నిజంగా కోపం వచ్చింది. గట్టిగా రెండు బాదాడు.

ఒకరకంగా బాధపడుతున్న బుజ్జిని బాధ కలిగించుకోవద్దని చెప్పుతూ బాధపడుతున్న గోపి మరొకరకంగా బాధపెట్టాడు.

పిల్లలిద్దరు కొట్టుకుంటున్నారని యాత్రకు వచ్చిన యువకుడు ఒకడు చూచి అనుకున్నాడు.

ఒక పెద్దవాడు యింకో చిన్నవాణ్ణి కొడుతున్నాడని తలంచిన వ్యక్తి, చిన్నవాడయిన గోపీని పెద్దవాడయిన తను కొట్టి ధర్మం నిర్వర్తించా ననుకున్నాడు.

తన అన్నని అనవసరంగా, అకారణంగా ఎవడో కొడుతూ వుంటే బుజ్జి చూచి సహించలేక పోయాడు.

అన్నని ఏ చేయి అయితే తాకిందో ఆ చేతిని బుజ్జి కొరికాడు.

యువకుడికి వళ్ళు మండిపోయింది.

బుజ్జి దగ్గరకు పోయి లాగి కాలుతో ఒక్కటి తన్నాడు.

తీర్పు తీర్చటానికిపోయిన వ్యక్తి తీర్పు తీర్చబడటానికి ముద్దాయి అయిపోయాడు.

బుజ్జికి కసి పుట్టింది.

కాలుతో తన్నికూడా న్యాయంచేశానను కుంటూనే యువకుడు వెళ్ళిపోతున్నాడు.

బుజ్జి పరుగెత్తుకుంటూపోయి వెళుతున్న యువకుని ఎగిరి రెండు కాళ్ళతో రొండి మీద తన్నాడు.

ఆ తాపుకి తట్టుకోలేక బలవంతుడులాగా బలప్రయోగం చేసి ధర్మం రక్షించబోయిన యువకుడు తూలిపోయి, తూలుతూ నీటిలో పడ్డాడు.

సరస్సునపడ్డ మరుక్షణంలో దిక్కు తెలియక ఒడ్డు ఎటో అర్థంకాక సుకుమారంగా పెరగటంతో ఈదటంరాక నేల కాలుకు తగలని లోతుకావటంతో మునిగిపోతూ, నీళ్ళు తాగుతూ వున్నాడు.

గోపీ అంతా పరికించాడు. ఆ యువకుడికి ఆపద సామీప్యంలో వుందని గ్రహించటానికి అరక్షణం కూడా అవసరం లేకపోయింది.

గోపీ నీళ్ళలోకి దిగాడు. గబగబా ఈదుకుంటూ యువకుడి దగ్గరకు పోయాడు. మునిగిపోతున్న అతనిని జొక్కా పట్టుకొని లాక్కొచ్చి గట్టున వదిలేసి ఒడ్డెక్కాడు.

ఆ యువకుడు లేచివచ్చి బుజ్జిని కొడతాడేమోనని గోపీకి భయం కలిగింది.

వెంటనే తమ్ముడిదగ్గరకు పోయి వాడి భుజం పట్టుకొని పరుగెత్తుకుంటూ వెళ్ళి పోతున్నాడు. పడుతూ లేస్తూ బుజ్జీకూడా వెంట వెళుతున్నాడు.

ఆ యువకుడికి కోపం లేదిప్పుడు. హృదయంలో కృతజ్ఞత పొంగుతూవుంది.

వాళ్ళిద్దరూ అన్నదమ్ములని మంచి కోసం తగాదా పడ్డారని తలంచాడు.

మనస్సంతా వెన్నెల వెల్లువ అయిన తనని చూచి కొడతాడు అనే భయంతో పారిపోతున్న ప్రాణదాతని చూచి ఆలోచనలేక అర్థంకాక, పిలిచేనోరు రాక అయోమయంగా అలాగే చూస్తూ వుండిపోయాడు యువకుడు.

ఎవరికీ అందనంత దూరంగా కొండపైకి ఎక్కి ఇద్దరూ కూర్చున్నారు.

మానవత్వం ఉన్నత శిఖరం అధిరోహించినట్లు అక్కడ నుంచి దిగిపోయి దానవత్వం పంచల్లో పడిగాపులు పడలేమన్నట్లు ఇద్దరూ కూర్చున్నారు.

(మిగతా 65 వ పేజీలో)

# ప్రశ్నోత్తరావళి

శ్రీ జి. వెంకటరెడ్డి, మల్లారెడ్డిగూడెం, నల్గొండ జిల్లా.

ప్రశ్న : నల్గొండ జిల్లా, హుజూర్ నగర్ తాలూకా మల్లారెడ్డి గూడెంలో గత 16 సంవత్సరాల నుంచి వున్న పోలీసు స్టేషన్ను మేళ్ళచెరువుకు మార్చారా? అయితే ఎందుకు?

సమా : ప్రజల ప్రయోజనం దృష్ట్యా మల్లారెడ్డిగూడెంలో వున్న పోలీసు స్టేషన్ను అక్కడి నుంచి మేళ్ళచెరువుకు తరలించడం జరిగింది.

శ్రీ ఆర్. వి. రామారావు, గంటిపాడు, కృష్ణాజిల్లా.

ప్ర: "గిబ్బెర్లిక్" ఆమ్లాన్ని పరిశోధిస్తున్న శాస్త్రవేత్తలు, దీనిని మన తరంలో వ్యవసాయ రంగంలో పరిశోధించబడిన అరు అపూర్వమైనసాధనాలలో ఒకటిగా పరిగణిస్తున్నట్లు ఒక పత్రికలో వ్రాయబడింది. ఈ ఆమ్లాన్ని మన దేశంలోని వ్యవసాయ శాస్త్రనిపుణులు పరీక్షించారా? అయితే వారి ప్రయోగాల ఫలితాలేమిటి? జపాను శాస్త్రవేత్తలు పరిశోధిస్తున్న "తెల్లపౌడరు" ఏమిటి? ఈ రసాయనిక పదార్థం ఎక్కడ లభిస్తుంది?

స: "గిబ్బెర్లిక్" ఆమ్లం, "జపాను తెల్ల పౌడరు"—ఈ రెండూ బహుశా ఒకే పదార్థం అయివుంటాయి. దీనిని ఆయా జపాను సంస్థల నుంచి పొందవచ్చు.

"గిబ్బెర్లిక్" ఆమ్లాన్ని అంతరాజు పేటలోని ప్రాంతీయ పండ్ల పరిశోధనా కేంద్రంలో పరిశీలిస్తున్నారు. వివిధ పండ్ల విషయంలో ఇప్పటివరకు జరిపిన ప్రయోగాలలో వెల్లడైన అంశాలు కొన్ని దిగువ పేర్కొనబడినవి :-

(1) జామ : నాగపూర్, సహరన్ పూర్ గింజలులేని రకాలలో "గిబ్బెర్లిక్" ఆమ్లం (500 పి. పి. ఎం.) ప్రయోగించడంవల్ల ఫలాల కాపులో 3 శాతం మొదలు 100 శాతం వరకు పెరుగుదల ఏర్పడింది. అంకురమప్పుడు దీనిని (500, 1000 పి. పి. ఎం.) వేయడంవల్ల లక్నో-46, లక్నో-49, బనారసి, అలహాబాదు, స్మూత్ గ్రీన్ వంటి గింజలు వుండే రకాలలో గింజలులేని స్వభావం వచ్చింది.

(2) ద్రాక్ష : అనాబెషాహీ, కిష్ మిష్ రకాల పిందెలకు దీన్ని వేయడం వల్ల వాటి పరిమాణం 14.4 శాతం వరకు పెరిగింది. కిష్‌మిష్ రకంలో పరిపక్వకాలం ఏడురోజులు ముందుగా ఆసన్నమైంది. గుత్తులలో పండ్ల సంఖ్య కూడా హెచ్చింది.

(3) నారింజ, నిమ్మ వగైరా : "గిబ్బెర్లిక్" ఆమ్లా (300.పి.పి.ఎం)న్ని ఉపయోగించడంవల్ల సత్‌గుడి తియ్యనారింజలో గింజలులేని స్వభావం వచ్చింది. ఫలాల కాపులో 67 శాతం మొదలు 100 శాతం వరకు పెరుగుదల కలిగింది. ఇదే రసాయనికపదార్థం 'పుమ్మెలో'లో ఫలాల కాపును 74 శాతం మొదలు 100 శాతం వరకు పెంచింది. 33.5 శాతం ఫలాలలో గింజలులేని స్వభావాన్ని కలిగించింది. కాగా 600 పి. పి. ఎం. వాడకంవల్ల 66.6 శాతం ఫలాలలో గింజలు లేకుండా పోయాయి. నిమ్మలో ఈ ఆమ్లం (300 పి. పి. ఎం.) వల్ల కాపు 15.05 శాతానికి పెరిగింది. 70 శాతం మేరకు గింజలు తగ్గాయి. 'డెన్సీ టాంగరిన్'లో -300 పి.పి.ఎం. ప్రయోగంవల్ల—పండ్లు 33.3 శాతానికి పెరగ్గా, 600 పి. పి. ఎం. వాడకంవల్ల గింజలు 71.4 శాతం మేరకు తగ్గాయి.

(4) మామిడి : (నీలం) 500 పి. పి. ఎం. వేసిన నీలం రకం పండ్లు అండాకారంలో వుండి పిక్కలు బీజాంకుర రహితంగా వున్నాయి. 300 పి. పి. ఎం. ను 2, 4-డి 5 పి.పి.ఎం. తో కలిపివేయడంవల్ల పిక్క బరువు 31.3 శాతానికి తగ్గింది.

(5) 'సపోట' : ఈ ఆమ్లం (300 పి. పి. ఎం.) వల్ల ఫలాల కాపు 60 శాతానికి పెరిగింది. పండ్లలో గింజలు లేవు.

(6) 'ఫాల్సా' : 300 పి. పి. ఎం. వాడకంవల్ల ఫలాలకాపు 34 శాతానికి హెచ్చింది. కొన్ని పండ్లలో గింజలు లేకుండా పోయాయి

(7) అత్తి : 25 పి. పి. ఎం, 100 పి. పి, ఎం ను 2,4,5 టి 50 పి.పి.ఎం., సి. ఐ. పి. ఏ. 100 పి. పి. ఎం. తో కలిపి వాడటంవల్ల సైజు 25 శాతానికి

పెరిగింది. కాయలు రాలడం 30 శాతం వరకు తగ్గింది.

(8) బెండ: ఈ అమ్లా (100 పి. పి. ఎం) న్ని ఉపయోగించడంవల్ల గింజలులేని కాయలు ఉత్పత్తి అయ్యాయి.

శ్రీ బి. వెంకటరావు, ఖమ్మం, ఖమ్మంజిల్లా.

ప్ర: ఖమ్మం జిల్లాలో కాకర్లవాగుకు అడ్డంగా నిర్మించదలచిన గ్రామ చెరువుకు సంబంధించిన వివరాలను తెలపండి.

స: కొత్తగూడెంవద్ద కాకర్లవాగుకు అడ్డంగా చెరువు నిర్మించడానికి దర్యాప్తులు పూర్తయ్యాయి. అంచనాలు పరిశీలనలో వున్నాయి.

ఇది ఆబీ తరుణంలో 925 ఎకరాలకు నీటి పారుదల చేయగలుగుతుంది. ఖర్చు అంచనా రూ॥ 3.28 లక్షలు.

అంచనాలను ప్రభుత్వం మంజూరు చేసిన పిమ్మట పని ప్రారంభించబడుతుంది.

శ్రీ క్యామాచారి, గ్రామాధికారి, ఉండ్యాల, మహబూబ్‌నగరం జిల్లా.

ప్ర: మక్తాల్ తాలూకాలోని మరికల్ నుంచి ఆత్మకూరు తాలూకాలోని ఉండ్యాల వరకు ఎటువంటి రోడ్డును నిర్మిస్తున్నారు?

స: సి. ఆర్. ఎఫ్. క్రింద మరికల్ నుంచి ఉండ్యాల వరకు మొరం రోడ్డును నిర్మించడానికి మంజూరీ లభించింది. దీని పొడవు 12 మైళ్ళ 2 ఫర్లాంగులు. త్వరలోనే రోడ్డు నిర్మాణం చేపట్టబడుతుంది.

శ్రీ ఎన్. చలపతిరావు, గరిమనపెంట, ఉదయగిరి తాలూకా, నెల్లూరు జిల్లా

ప్ర: కావలి తాలూకాలో చింతలదేవి వాగుకు అడ్డంగా నిర్మించదలచిన రోడ్డు వంతెనకు సంబంధించిన వివరాలను తెలియజేయండి. గరిమనపెంట గ్రామం వరకు ఆ రోడ్డును పొడిగిస్తారా?

స: ఆదిమూర్తిపురం నుంచి తూర్పు బ్రాహ్మణపల్లి (చింతలదేవి వాగు) వరకు ఇప్పుడు గ్రామ రోడు వుంది. ఈ గ్రామరోడ్డు నిడివి 2 మైళ్ళ 4 ఫర్లాంగులు. బృహత్తర ప్రణాళిక [illegible] రూ॥ 0.59 లక్షల వ్యయంతో ఓ. డి. ఆర్. (ఇతర జిల్లా రోడ్లు) స్టాండర్డ్స్‌కు పైస్థాయికి పెంచడానికి ప్రతిపాదించారు. బృహత్తర ప్రణాళికలో, తూర్పు బ్రాహ్మణపల్లి నుంచి తూర్పు ఎర్రబల్లి, గరిమనపెంటల మార్గంగా తూర్పు రంపదొడ్ల వరకు రోడ్డు (ఓ. డి. ఆర్.) నిర్మించే ప్రతిపాదన ఒకటి వుంది. 15 మైళ్ళ 4 ఫర్లాంగుల పొడవువుండే ఈ రోడ్డు నిర్మాణాన్ని బృహత్తర ప్రణాళిక నాలుగవ దశలో రూ॥ 6.74 లక్షల వ్యయం (ఉప్పుటేరుపై నిర్మించబడే వంతెనకు అయ్యే రూ॥ 31,000/-ల ఖర్చుతో సహా) తో చేపట్టడానికి ప్రతిపాదించబడింది.

శ్రీ సాంబశివరావు, గుండాడు గ్రామం, కరీంనగర్ జిల్లా.

ప్ర: పంచాయతీ ఎన్నికల పిమ్మట బ్లాకులను వాటి సంఖ్యను తగ్గించేందుకు - పునర్విభజిస్తారని వదంతిగా వుంది. వివరాలు తెలియజేస్తారా?

స: బ్లాకుల పునర్విభజనకు సంబంధించిన ప్రతిపాదనలు ఇంకా ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి.

శ్రీ వై. నారాయణరెడ్డి, చామలూరు, జమ్మలమడుగు తాలూకా, కడప జిల్లా.

ప్ర: మారుమూల గ్రామాలలో నివసించే మేము ఏవైనా కుటుంబ నియంత్రణ క్లినికుల నుంచి ప్రయోజనం పొందవచ్చా. పోస్టు ద్వారా సలహాలు పొందడానికి వీలుందా?

స: కడప జిల్లాలో దిగువ పేర్కొన్న స్థలాలలో గ్రామీణ కుటుంబ నియంత్రణ క్లినికులు పనిచేస్తున్నాయి. వాటిలో ప్రజలు కుటుంబనియంత్రణ సర్వీసులు పొందవచ్చు. కుటుంబనియంత్రణలో సలహా సంప్రదింపుల కొరకు ప్రజలు తమకు దగ్గరలోనున్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో వైద్యాధికారిని సంప్రదించవచ్చు.

| పంచాయతీ సమితి పేరు | ప్రాథమిక ఆరోగ్య కేంద్రం పేరు | గ్రామీణ కుటుంబ నియంత్రణ క్లినికు పేరు |
|---|---|---|
| ముద్దనూరు | కొండాపురం | కొండాపురం |
| పోరుమామిళ్ల | నర్సాపురం | నర్సాపురం |
| కోడూరు | కోడూరు | కోడూరు |
| కమలాపురం | పైసంపల్లి | పైసంపల్లి |
| ప్రొద్దుటూరు | కల్లూరు | కల్లూరు |
| పులివెందుల | బిదంచెర్ల | బిదంచెర్ల |

శ్రీ బి. రామశంకరరావు పట్నాయక్, రాజ్యలక్ష్మీపురం, శ్రీకాకుళం జిల్లా.

ప్ర: పార్వతీపురం తాలూకా జయకోట సమీపంలో జంఝావతి నదికి అడ్డంగా రిజర్వాయరు నిర్మించబడనున్నట్లు అధికారికంగా తెలియ

వచ్చింది. పని ఎప్పుడు ఆరంభిస్తారు. దీనికి ఎంత డబ్బు మంజూరైంది.

స: రాజ్యలక్ష్మీపురం గ్రామ సమీపంలో జంఝూవతి నదికి అడ్డంగా ఆనకట్ట నిర్మించే విషయంలో ప్రారంభ పరిశీలన జరిపి, ప్రత్యక్ష, పరోక్ష ఖర్చులతో సహా రూ॥ 57.71 లక్షల వ్యయంతో కూడిన అంచనాలను పరిశీలనార్థం పంపించటం జరిగింది. ఈ పథకాన్ని ప్రభుత్వం ఆమోదించిన వెంటనే సమగ్ర పరిశీలన జరపడానికి తగు చర్యలు తీసుకోంటాము.

శ్రీ జి. కోదండరామరెడ్డి, సోమపరం, భువనగిరి తాలూకా, నల్గొండ జిల్లా.

ప్ర: జనగాము తాలూకాలో రామచంద్ర గూడెం సమీపంలో ప్రభుత్వం ఒక ప్రాజెక్టును నిర్మిస్తున్నట్లు తెలుస్తున్నది. ఇది నిజమైనట్లయితే దీనిని గూర్చిన వివరాలు తెలపండి.

స: మీరు ప్రస్తావించిన ప్రాజెక్టు, వరంగల్ జిల్లా, జనగామ తాలూకాలోని కొన్నె వాగు అనే ప్రాజెక్టు అయినట్లు కనిపిస్తున్నది. ఈ ప్రాజెక్టు స్థలం రామచంద్ర గూడెం గ్రామానికి పశ్చిమాన సుమారు ¾ మైలుదూరంలో వుంది. ఈ ప్రాజెక్టుకు సంబంధించిన పరిశీలనలు ఇటీవల జరిగాయి. ఖర్చు అంచనాలు సిద్ధంచేయబడుతున్నాయి. దీనికిబహుశా రూ॥ 8.38 లక్షలు వ్యయమవుతాయి. ప్రాజెక్టు నిర్మాణాన్ని 1963-64 వ సంవత్సరంలో చేపట్టి 1966 ముగింపు నాటికి పూర్తి చేయడానికి ఉద్దేశించారు. కట్ట పొడవు 3,000 అడుగులు వుంటుంది. ఎత్తు (గరిష్ఠ) 37 అడుగులు; సగటు ఎత్తు 26 అడుగులు. ఈ చెరువు 84.29 ఎం.సి. అడుగుల నీటిని నిలవచేయ గలుగుతుంది. దిగువ పేర్కొన్న గ్రామాలలో ఆబీతరుణంలో 797 ఎకరాలకు ఇది నీటి పారుదల చేయగలుగుతుంది.

రామచంద్రగూడెం,
జనగామ తాలూకా —210 ఎకరాలు

ఆకారపల్లి,
జనగామ తాలూకా —410 ఎకరాలు

బుందుగుల్,
భువనగిరి తాలూకా —177 ఎకరాలు

---

(62 వ పేజీ తరువాయి)

అక్కడ నుంచి చిన్నగా తెల్లగా దూరంగా కనిపించే సరస్సూ, స్టేషనులోంచి బయలుదేరి పొగలువదులుతూ వానపాములా వెళుతున్న గూడ్సుబండీ, బొమ్మరిళ్ళలాంటి పల్లెలోని గుడిసెలూ, ఇంజను విడిస్తే ఆకాశంలోకి పోతూ సుడులు తిరుగుతున్న పొగా, అరచేతి అద్దంలాగా అస్తమించబోతున్న సూర్యుడూ, పసివాళ్ళ మనస్సులను జాగృతం చేశాయి.

నల్లని రాయిమీద కూర్చున్న గోపీ వడిలో తలపెట్టుకున్నాడు బుజ్జి. వాడి తల నిమురుతూ ఆప్యాయంగా ఆకాశంలోకి చూస్తున్నాడు తల్లిలేని పిల్లవాడు గోపీ.

'కొండదిగి ఇంటికి వెళ్ళటానికి పిల్లలు ఇద్దరూ భయపడుతున్నారు.

చీకటి పడుతూ వుంది.

క్రిందకు దిగితే యువకుడు కొడతాడేమో !

చేపలుగానీ, గాలాలుగానీ లేకుండా యింటికి వెళితే నాన్న తంతాడేమో !

అంతే ! అక్కడే కూర్చున్నారు.

సూర్యాస్తమయం అయింది. చంద్రోదయమూ అయింది.

చల్లని చంద్రుని చేతుల స్పర్శతో తిరుపతి హృదయం ఆర్ద్రమయింది.

సారాయి మత్తు తొలిగి పోయింది.

పిల్లల్ని వెదుకుతూ బయలు దేరాడు. సరస్సు తీరంలో జరిగింది అంతా విని నిండుగా గాలి పీల్చుకొని 'బాబూ' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

లోయంతా ప్రతిధ్వనించింది.

కొండపైకి పోయాడు తిరుపతి.

నాన్న రావటం చూచి కొడతాడేమోననే భయంతో పిల్లలు వణికి పోతున్నారు.

ద్రవించిపోయిన హృదయంతో తారుమారవుతున్న తిరుపతి ఆప్యాయంగా పిల్లల్ని దగ్గరకు తీసుకొని గుండెలకు హత్తుకున్నాడు.

మరుక్షణంలో ఇద్దరినీ చెరొక భుజం మీద కూర్చోబెట్టుకొని తిరుపతి కొండ దిగుతూవున్నాడు.




# సంఘం మెచ్చని మాతృత్వం

— ఇల్లిందల సరస్వతిదేవి

"గోరంత దీపమ్మ కొండలకు వెలుగు, చిన్న మా అబ్బాయి మా కళ్ళ వెలుగు" అనుకుంటూ కన్నబిడ్డను ఎగురవేసి ముద్దాడుతుంది తల్లి. ఆ బిడ్డ ఎంత అనాకారంగా ఉన్నా తల్లికి ముద్దే. అందుకే కాకిపిల్ల కాకికి ముద్దన్నారు అనుభవజ్ఞులు. ఈ ప్రపంచంలో కడుపు తీపికంటె మధురమైన పదార్థం లేదు. బిడ్డను పొత్తిళ్ళలో పొదివి పట్టుకుని, హృదయానికి అదుముకొని, ఎన్ని కష్టాలయినా పడి పెంచి పెద్ద చేసి—తన సర్వస్వమూ ఆ బిడ్డ కందించి తనివిదీరా ఆనందించాలని కన్నతల్లి ఆశిస్తుంది. ఆ బిడ్డ కొరకు మాతృమూర్తి చేసే త్యాగానికి అవధులు ఉండవు. భర్తను ఎదిరించినా—అతడు పెట్టేకష్టాలు భరించినా—దేహ కష్టము చేసినా అంతా ఆ బిడ్డకొరకే.

కన్న బిడ్డకొరకు ఇంతత్యాగము చేయగల మాతృ హృదయము కూడా పరిస్థితుల ప్రభావమువల్ల అమృతానికి బదులు హాలాహలాన్ని చిందిస్తుంది. తల్లికంటికి వెలుగయి ముద్దు పాపడుగా కనబడవలసిన బిడ్డ పెనుభూతంగా కనబడే పరిస్థితులు ఒక్కొక్కప్పుడు ఏర్పడతాయి; తల్లిహృదయము వాత్సల్య పూరితము కాకపోగా పిశాచ నిలయ మైపోతుంది; సుతిమెత్తని మనసు పాషాణ మైపోతుంది. [illegible] మేలిమి బంగరు ఛాయతో ముద్దుల మూట గట్టుతున్న పసిపాపడిని కుంతి ఏం చేసింది? మనసు రాయి చేసుకుని నిర్దాక్షిణ్యంగా పెట్టెలో పెట్టి నదిలో వదిలిపెట్టింది. అతడు పెరిగి పెద్దవా డయినతరువాత సూతపుత్రుగన్న పేరుతో సంఘంలో అన్యాయం జరిగింది. కన్యాపుత్రుడు కనుక అగౌరవం కలిగింది. దుర్యోధనుడు అతడికెంత సాంఘికంగా గౌరవ ప్రతిపత్తిని కలిగించి అంగ దేశానికి రాజును చేసినా అతడి హృదయ కుహరంలో ఒకమూల జరిగిన అన్యాయం గూడుకట్టుకుని బాధపెట్టుతునే ఉన్నది. ఈ లోకంలో సక్రమసంతాన మని ప్రజలందరూ విశ్వసించి చేసే గౌరవ మర్యాదలకు ఏదిసాటి? కూటికి పేద కావచ్చు—కులానికి పేద కావటము ఎవరికీ ఇష్టము ఉండదు.

ఆరుమాసాల క్రిందట కాకోలు కాచిగూడెం స్టేషన్ రోడ్డుమీద ఉన్న నర్సింగు హోములో ఎనిమిది రోజుల ఆడపిల్లను అమ్ముతా రని విని జనం వెళ్ళి చూడటము మొదలుపెట్టారు. చూసి వచ్చిన వాళ్ళు పిల్ల చాలా అందంగా ఉన్నదనీ, ముద్దుగా ఉన్నదనీ చెప్పుకుంటూ పోతున్నారు. [illegible] దృష్టితో వెళ్ళేవారు కొందరూ, కుతూహలము కొద్దీ చూసివద్దామనుకునే వారు కొందరూ ఆనాడు నర్సింగుహోము ముందర గుంపులు గుంపులుగా గూడారు. ఆ బిడ్డ వెల పాతికరూపాయలు. మధ్యాహ్నము ఒంటి గంటవరకూ చూసిపోయేవారే గాని పాతిక రూపాయలు పెట్టి కొన్నవారు లేరు. కొంత సేపటికి యజమాని అదలింపులతో ఆ స్థలము నిర్మానుష్యమయి పోయింది.

అంతచక్కటి పాపను కన్న తల్లి అవివాహిత. పురుడు వచ్చిన మూడవనాడు ప్రసూతి గృహానికి చెల్లించవలసిన సొమ్ము చెల్లించి, బిడ్డను "మీ యిష్టము వచ్చినట్టు చేసుకో"మ్మని వెళ్ళిపోయిందట.

పదిసంవత్సరాల నాడు కాదు—పది నెలల క్రిందటి మాట. నగరములోని ప్రయివేటు నర్సింగుహోములో ఒక పాపను ఇలాగే అమ్మకానికి పెట్టారు. మూడు నాలుగు నెలలు ఎదురు చూచినా—ఎవరూ కొనలేదు. చివరకు ప్రసూతి గృహ యజమానే ఆ పిల్లను పెంచుకోవలసి వచ్చింది. ఆయనవద్ద ఇరవై సంవత్సరాల పిల్లవాడు ఒకడు ఈ విధంగానే పెరుగుతున్నాడు.

ఇలా మనము పరిశీలించి చూస్తూవుంటే రెండుమూడు నెలలకొక బిడ్డ తల్లిదండ్రులు ఉండికూడా అనాధగా వదలిపెట్టబడటము కనబడకపోదు. బొంబాయి నగరములో ప్రతిదినమూ పదికీ ఇరవైకీ మధ్య అక్రమసంతానము జన్మించుతూ ఉంటుం దని పురపాలక సంఘంవారు అంచనా వేశారు. కన్నబిడ్డలను పులివిస్తరాకు పారవేసి నట్టుగా చెత్తకుండీలలో పారవెయ్యటమూ, గుడ్డలలోచుట్టి గోడవతల పారవెయ్యటమూ పట్టణాలలోనూ గ్రామాలలోనూ జరుగుతునేఉన్నది. అయుర్దాయంకలపాప ఏడుపు ఏజాలిగుండెకలవారికో వినబడుతుంది. కఠినులెవరో కని పారవేశారనిశపిస్తూ యింటికి తీసుకువెళ్ళి స్నానము చేయించి పెంచుకుంటారు. ఆయుర్దాయము లేని పాపాయిలు పెంటకుప్పల పాలవుతారు. ఇటువంటి పసిపాపను క్రిందటి సంవత్సరము కుక్కలు హైదరాబాదు నగరములోని కేన్సరుహాస్పిటలు కాంపౌండులోకి ఈడ్చుకు వచ్చాయి. అక్కడి అధికారులెవరోచూసి పోలీసు రిపోర్టు ఇచ్చేసరికీ పిల్లకు ఒక చెయ్యిలేదు. అప్పటికే కాకులకో కుక్కలకో ఆ చెయ్యి ఆహార మయిపోయింది.

కన్న బిడ్డలను జాలిలేకుండా వదలిపెట్టేవాళ్ళల్లో కూడా కఠినులతోపాటు మాతృహృదయము కలవారుకూడా ఉంటారు. వీళ్ళు నిర్జనప్రదేశములో బిడ్డలను పడ వెయ్యకుండా నలుగురూ తిరిగేచోట బట్టలలో చుట్టబెట్టి పడుకోబెట్టుతారు. ఏ తెల్లవారు జామునకో పడుకోబెట్టితే ఆ వేళకు లేచేవారెవరో తీసుకుపోయి తాము పెంచుకోవటమో లేక ఎవరికయినా ఇవ్వడమో జరుగుతూ ఉంటుంది. పట్టణాలలోకంటె పల్లెటూళ్ళల్లో ఊరిబయట పొదలచాటున చెట్లచాటున బిడ్డలను వదలిపెట్టేవారుఎక్కువ మంది ఉంటారు. అక్కడ కుక్కలూ నక్కలూ ఈడ్చుకు పోయింది ఎవరూ చూడరు. బొంబాయి నగరములో రెండు సంవత్సరాల క్రిందటకూడా ఈ విధంగానే జరుగుతూ ఉండేది కాని ఇప్పుడు ఇటువంటి బిడ్డలు పురపాలక సంఘమువారు అధిక సంఖ్యలో నెలకొల్పిన కేంద్రాలలో ఉయ్యేలల్లో ఊగుతూ ఉన్నారు. కొందరినితల్లులూ బంధువులూ అనాధ శరణాలయాలలో చేరుస్తున్నారు. సంఘ సంక్షేమ ఏజెన్సీలద్వారా కొందరు బిడ్డలు దత్తతకు ఇవ్వబడుతున్నారు.

బిడ్డలను ఇంత దారుణంగా కనిపారవేసేవారు అవివాహితలో విగతభర్తృకలో అయి ఉంటారు. వీరి మాతృత్వానికి సంఘము ఒప్పదు. సంఘానికి వెరచి ఇటువంటి దారుణకృత్యాలకు కన్నతల్లులు పాల్పడుతూ ఉంటారు.

ఈ విధంగా పుట్టిన బిడ్డలను పెంచే శరణాలయాలు అక్కడక్కడ మాత్రమే ఉన్నాయి. ఇటువంటివాటిలో బొంబాయి నగరములో ఉన్న జోసెఫ్ శరణాలయ మొకటి. హైదరాబాదు నగరములో శ్రీమతి ధగే నడుపుతున్న రాధాకృష్ణ హోము ఒకటి. అయితే అక్కడికి ఎవరు తీసుకువెళ్లాలి? తీసుకు వెళ్ళినవారిని ఎవరయినా అనుమానిస్తే? ఇలా ఆలోచనలు చేసిచేసి ఏ నౌకరు చేతికో యిచ్చి పంపినవారున్నారు. హోముకు పంపిన కొన్నాళ్ళకు "మాకో పాప పెంపకానికి కావా"లని అడిగి తెచ్చుకున్నవాళ్ళు ఉన్నారు. సంఘాన్ని ఎదుర్కోలేక లోకానికి కన్నుమూయాలని ఉపాయాలు పన్నినా బయటికి తెలియక మానవు. ఎప్పుడో పాతికేళ్ళనాడు ఒకామె జబ్బుగా ఉన్నదని బొంబాయి వెళ్ళింది. మందు తీసుకుంటున్నానని స్నేహితులకు ఉత్తరాలు వ్రాస్తూ ఉండేది. ఒక ఏడాది తరువాత ఆరు నెలల బిడ్డతో తిరిగి వచ్చింది. పెంచుకుంటున్నానని ఆమె చెప్పితే ఎవరు నమ్మతారు? ఆ పిల్ల ఆమెకు పుట్టినదేనని చాటుగా అందరూ గుసగుసలాడారు. ఆమె కన్నతల్లే—కాని తల్లిలా పెంచటానికి తీసుకువచ్చానని స్నేహితులతో చెప్తుంటే, నోరార నేనే తల్లినని అందరితో చెప్పుకునే భాగ్యము ఆమెకు లేదుకదా అని జాలి వెయ్యక మానదు. కాని ఆమెపడిన కక్కుర్తికి అసహ్యించుకునేవాడు లేకపోలేదు. ఆమెకు తన ముఖ్యస్నేహితుడు మిస్టర్ సామ్యూల్‌వచ్చి ఆ బిడ్డను చూడకపోయెనని కించగా ఉండేది. కాని ఆమె బొంబాయినుండి తిరిగి వచ్చిన తరువాత అతడు ఆ గడప తొక్కలేదు.

ఏదయినా—కనటమువరకూ పరిస్థితులను ధైర్యముతో నెట్టుకువచ్చేవారే ధైర్యవంతులుగా కనబడతారు. అధైర్యము కలవారు రెండు మూడు నెలలు రాగానే భయపడిపోతారు. స్వయంకృతాపరాధాన్ని ఎవరితో చెప్పుకోవటానికీ నోరురాదు. మాయజేసిన వాడు మళ్ళీ కనబడడు. తండ్రిని చూస్తేనే హడలు. తల్లితోచెప్తే ఆమె ఈ సమస్యను తీర్చగలదా? ఇది చిన్నసమస్యా ఏవో మాటలుచెప్పి త్వరలో తీర్చటానికి?

కుటుంబములో మిగతా ఆడపిల్లల పెళ్ళిళ్ళన్నీ దీనిమీద ఆధారపడి ఉంటాయి. ఇంటి గౌరవమూ ప్రతిష్ఠా దీనిపైననే ఆధారపడి ఉంటాయి. కన్నకడుపు తలుచుకుంటే మనసు నీరయిపోతుంది. ఏం చెయ్యటానికీ తోచదు. కాలూ చెయ్యి ఆడదు. పెద్ద సంసారమూ పదిమంది బిడ్డలూ సాంఘిక ప్రతిపత్తీ అనే సమస్యలు లేకపోయినట్లయితే ఆమెను దూరతీరాలకు తీసుకొని వెళ్ళి కాన్పు అయిన తరువాత — 'దొరికిన పాపాయి' అన్న పేరుతో ఇంటికి తీసుకుని వచ్చి పెంచుకుంటారు. లేదా ఈ మచ్చను

కప్పిపుచ్చగల ఆర్థికస్తోమత ఉంటే ఏ ఊరయినా పంపవచ్చు. మరొక ఊళ్ళో ఉంచి మంచి చదువులు చెప్పించ వచ్చు — ఏమీ జరగనట్టు!

పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడూ — అమ్మాయిలు ఇటువంటి సమస్యలు తీసుకు వచ్చినప్పుడూ ఎటూ తోచక తండ్రికి ఆగ్రహము రానూ వచ్చు — తల్లి చికాకు పడనూ వచ్చు.

ఇటువంటి భయంకర పరిస్థితులను ఊహించిన అమ్మాయిలు తాము దగాపడ్డామని తెలుసుకోగానే ఆత్మహత్యలకూ, భ్రూణ హత్యలకూ, శిశు హత్యలకూ పూనుకుంటున్నారు.

సూక్ష్మంగా ఆలోచించిచూస్తే అబ్బాయిల బాధ్యతా రాహిత్యమూ, అమ్మాయిల అమాయకత్వమూ మనకు ఈ సందర్భములో స్పష్టంగా కనబడతాయి.

మనదేశములో ఇరవై ఏళ్ళ పిల్లవాడి కంటె పదిహేనేళ్ళ పిల్లకు ప్రాపంచికజ్ఞానము ఎక్కువ ఉంటుందంటారు అనుభవజ్ఞులు. పదిహేనేళ్లు పైనబడిన అమ్మాయిలు తగిన జాగ్రత్త లేకుండా తేనె చిలికిన మాటలను నమ్మటమేమిటి? ప్రాణంకంటె మానమే గొప్పదని ఘోషిల్లే కుటుంబాలలో పుట్టి — క్షణంలో కన్యాత్వాన్ని గోల్పోవటమేమిటి?

దీనికి సమాధానముగా వాళ్ళకు నైతికవిలువలు తెలియవని అనుకోవాలి. లేక భ్రమ ప్రమాదానికి లోనైనారనైనా అనుకోవాలి. అయితే చేతులు కాలిపోయిన తరువాత చేసేదేమిటి? చేయవలసింది ఏమైనా ఉన్నదా?

ఇది పెద్ద ప్రశ్న. ఈ చిక్కును విడ తీయటము సామాన్యమైన పనికాదు. సంఘానికీ ప్రభుత్వానికీ ఇది ఒక సమస్య. నైతిక విలువలకూ ప్రాణానికీ మధ్య పెద్ద సంఘర్షణ.

దేశంలో ఒకవైపున పుట్టిన బిడ్డలను కుక్కలూ నక్కలూ మన కళ్ళముందరే ఈడ్చుకుపోతూ ఉంటే చూస్తూ ఊరుకోవటమా? కన్న తల్లిదండ్రులు ప్రచ్ఛన్నంగా ఉండి సంఘగౌరవాన్ని పొందుతూ బిడ్డలను ప్రసూతి గృహాలపాలు చేస్తే — ఆ బిడ్డల అమ్మకము జరుగుతూ ఉంటే చెవులతో వింటూ — కళ్ళతో చూస్తూ ఊరుకోవటమా? బిడ్డల గొంతు పిసికి చెత్తడబ్బాలలో పారవేస్తూ ఉంటే కళ్ళు మూసుకోవటమా? అందుకని నైతిక ప్రవర్తనకు ప్రాధాన్యత ఇవ్వక పోవటమా?

ఒకదానికొరకు మరొక దానిని బలి యివ్వటము అవివేక మనిపించుకుంటుంది. ఒకదాని కొరకు మరొకదాని విలువలు తగ్గించటమూ అవ్యక్త మనిపించుకుంటుంది. దేని విలువలు దానివే. దేనిస్థాయి దానిదే.

తాము త్వరపడినా — పొరపడినా కన్నతల్లికి బిడ్డలు గౌరవంగా బ్రతకాలనే ఉంటుంది. వాళ్ళకు మంచి భవిష్యత్తు ఉండాలనే ఉంటుంది. వీటికి హామీ లభించితే కన్నతల్లి ఘాతుక చర్యలకు దిగదు. తల్లి కాబోతున్నానని గ్రహించగానే బావులకూ చెరువులకూ పరుగులెత్తదు. కన్నప్పటికీ బిడ్డలను వదలించుకోవాలని చూడదు.

తమ పుటుక పేదరికప్పు ఐయినా సరే గౌరవప్రదంగా ఉండాలని ప్రతివ్యక్తీ కోరుకుంటాడు. మర్యాద హీనంగా ప్రవర్తించే వాడయినా మర్యాదకు విలువ యిస్తాడు. ఈ రకంగా పుట్టిన బిడ్డలకు తమ పుట్టుకకు సంబంధించిన చరిత్రలు తెలియకుండా అందరూ సమాన గౌరవముతో పెరిగే అవకాశాలు మనకు కావాలి. అటువంటి అవకాశాలను కల్పించే సంస్థలు సంఘపరముగా అందరికీ అందుబాటులో ఉండేట్టుగా స్థాపన కావాలి. ఇటువంటి భద్రతలేకపోతే బ్రతికి ఉన్న బిడ్డలు కూడా మట్టిపాలౌతారు. నైతికంగా దిగజారిన కన్నతల్లులు కఠినాత్ములై ఘోరకృత్యాలకు పాల్పడతారు.

ప్రపంచములో అందరూ ఆదర్శాలను అందుకోలేరు. అందుకని బ్రతికే హక్కును పోగొట్టుకోకూడదు.

# బాలల క్లబ్బులు

## బాలానందం

నేటి బాలలే రేపటి పౌరులు. వీరి సంక్షేమం కేవలం ప్రభుత్వానికేకాక ప్రజలకుకూడా సంబంధించిన ప్రధాన అంశం. అయితే ఇప్పటివరకు ఈ విషయంలో ఏమంత కృషి జరుగలేదు. ఈ విషయంలో మనందరి పైనా గొప్ప భారం వుంది.

బాలల క్లబ్బుల స్థాపనోద్యమం వారి మనోల్లాస కార్యక్రమంలో ఒక భాగం.

పిల్లల విశ్రాంతి సమయాన్ని కేవలం ఆటలకే పరిమితం చేయడం మంచిది కాదు. ఒక్క ఆటలు మాత్రమే వారికి జీవితంలో తగు అవకాశాలను కల్పించలేవు. పరిపోషించవలసిన, పెంపొందించవలసిన పిల్లల ఇతర వ్యాపకాలు అనేకం వున్నాయి. వీటిని పరిపోషించడానికి, పెంపొందించడానికి మన ఇళ్ళలో సాధ్యపడదు. వీటికి తగు సాధన సామగ్రులను తలిదండ్రులు సమకూర్చలేరు. ఇండ్లు, పాఠశాలలలోని ఈ వెలితిని, లోటును బాలల క్లబ్బులు పూరిస్తాయి. విద్యావిషయకంగా ఇవి అపూర్వమైనవి.

బాలల క్లబ్బులను గురించి మనం ఆలోచించినప్పుడు 9-11 సంవత్సరాల మధ్య వయస్కులైన పిల్లలను మనం దృష్టిలో పెట్టుకోవాలి. జీవితసౌధానికి ఈ ప్రాయం పునాది వంటిది. ప్రాతిపదికమైన అలవాట్లు ఒంటబట్టడానికి ఈ వయస్సు యుక్తమైనది. ఎవరైనా బాలుడు లేక బాలికకు సంగీత సాధన లేక భాషాభ్యాసం పట్ల వున్న అసక్తిని గూర్చి తెలుసుకోవడానికిగానీ, వస్తువుల సేకరణ లేక తయారీలో వారికిగల అభివేశాన్ని గ్రహించడానికిగానీ ఈ వయస్సే తగినది. స్వతంత్రమైన పిల్లల విషయంలో పెద్దలకంటే సమవయస్కులైన స్నేహితుల ప్రభావమే ఎక్కువగా కానవస్తుంది. ఈ వయస్సు పిల్లలుకూడా బాధ్యతల భారం వహించగోరుతారు. సంతోషప్రదమైన కార్యకలాపాల ద్వారా సాంఘిక వ్యక్తిత్వాన్ని వికసింపజేసి తద్వారా పిల్లల కొరకు ఏదైనా చెప్పదగిన విషయాన్ని సాధించడానికి ఈ వయఃవర్గం పూర్తిగా తగినది. పిల్లలు స్వతస్సిద్ధమైన కళాకారులు. వారిలో మనుష్యుల హృదయాలను రంజింపజేయగల సహజ సౌందర్యపిపాస వుంటుంది. పిల్లలకు ఆటపాటల ద్వారా ప్రత్యక్షంగా, పరోక్షంగా బోధన చేయడానికి ఈ వయస్సు సరైనది. మోటారుకారు మోడల్‌ను తయారుచేసే పిల్లవాడు, దానిని తయారుచేయడంలో కారును గూర్చి అనేక విషయాలు తెలుసుకుంటాడు. విమానం తయారుచేయడానికి చెక్కలు, జిగురు, బట్ట తదితర పరికరాలను ఏవిధంగా కూర్చాలో ఈ అభ్యాసం వల్ల పిల్లలు నేర్చుకోగలుగుతాయి. విమానాలను ఎలా ప్రయోగించాలో, వాటిని ఏవిధంగా తయారుచేయాలో వాటి విషయంలో ఎలాంటి జాగ్రత్త తీసుకోవాలో తెలుసుకోగలుగుతారు. జీవితంపట్ల నిశ్చితమైన ఒక అభిప్రాయాన్ని ఈ విధమైన అభ్యాసం వారికి కలిగించగలుగుతుంది. పరిశుభ్రతనూ, కార్యనిర్వహణలో మెలకువనూ, ఏకాగ్రతనూ, కాలం, వస్తువుల వినియోగంలో పొదుపరితనాన్ని ఇవి పెంపొందిస్తాయి.



### క్లబ్బు కార్యకలాపాలు

బాలల క్లబ్బుల స్థాపనలో పెద్దలు శ్రద్ధ వహించి పనిచేసి నప్పటికీ వాటిని పిల్లలే స్వయంగా నిర్వహించడం మంచిది. ఇందువల్ల పిల్లలలో బాధ్యతలు నిర్వహించే దక్షత పెంపొందుతుంది. అత్యవసర ఖర్చులకొరకు బాలురందరినుంచి స్వల్పమైన ఫీజు వసూలు చేయవచ్చు. ప్రతి క్లబ్బుకూ వయోజనుల కౌన్సిలు వుండాలి. వారు పిల్లలకు సహాయపడాలి. వారి కార్యక్రమాలలో మార్గదర్శకత్వం వహించాలి. అంతేగాని

వారినిఅంతగా నిర్బంధించరాదు. ఇంటికీ పాఠశాలకు సహాయకారిగా వుండేట్లు క్లబ్బు కార్యకలాపాలను నిర్వహించాలి. ఈ రెండిటి ప్రయోజనాలకు భిన్నంగా ఈ కార్యకలాపాలు వుండకూడదు.

బాలల క్లబ్బు వయోజన నాయకుడు ప్రత్యేకరకమైన అర్హతలు కలిగివుండాలి. పిల్లలపట్ల అతనికి ప్రేమ, సానుభూతి వుండటం అవసరం. పిల్లల మనస్తత్వం క్షుణ్ణంగా తెలిసినవాడై వుండాలి. సాధ్యమైనంతవరకు తాను నెపథ్యంలోనే వుంటూ పిల్లల కార్యకలాపాలకు, మార్గదర్శికాగల దక్షుడై వుండాలి. క్లబ్బు నిర్వాహణకై అతను సాధన సంపత్తులను సమకూర్చుకో గలిగివుండాలి. బాలల ఇబ్బందులను గ్రహించి వాటిని తగు విధంగా నివారించ గలిగి వుండాలి.

బాలల క్లబ్బులు సంగీతం, నటన, నాట్యం, చిత్రలేఖనం మొదలైన వాటిని ప్రోత్సహించాలి. అంతేగాక బొమ్మలు తయారుచేయడం, నవారు, బుట్టలు అల్లడం, తోటపని, వడ్రంగం, నేతపని, అల్లకం మొదలైన చేతి పనులు నేర్చుకోవడానికి సౌకర్యాలను కూడా కల్పించాలి. కుట్టుపని, ఎంబ్రాయడరీ తరగతులు,చేతిపని క్లబ్బులు, వంటపని క్లబ్బులు, పాటలు, కోలాటం క్లబ్బులను కూడా బాలబాలికల కొరకు ప్రోత్సహించ వచ్చు. పిల్లలు ఆడుకోవడానికి ఒక తోట లేదా ఖాళీస్థలం, పనిముట్లను వుంచడానికై ఒక చిన్నగది, పారిశుద్ధ్యపు ఏర్పాట్లు, నీటి సౌకర్యాలు క్లబ్బు ప్రారంభించడానికి ఇవి చాలు.

ఒక క్లబ్బులో 24 కంటే ఎక్కువ మంది పిల్లలు వుండకూడదు. ప్రతి ఆరుగురు పిల్లలకూ వయోజనుడైన ఒక నాయకుడు వుండాలి. తమ క్లబ్బు కార్యకలాపాలను నిర్వహించడానికి ఈబృందాలు నెలకుమూడు పర్యాయాలు సమావేశం కావచ్చు. నాయకుని పర్యవేక్షణక్రింద వీరి కార్యక్రమాలు కొనసాగాలి. క్లబ్బులో సౌకర్యాలు చక్కగా వున్నట్లయితే పిల్లలు స్వయంగా వచ్చి చేరుతారు.

# గులాబి కోరిక

"గులాబీపువ్వు! గులాబీపువ్వు
గ్రుచ్చుతా వెందుకే నన్ను నువ్వు?"

"మురిపాలబాల! సరదాల బాల
మరి నువ్వు నన్ను త్రుంచుతా వేల?"

"జడలోన నిన్ను ముడుచుటకు కాదు
గుడిలోని స్వామి మెడలోకే కదోయి"

"మరి ఎందు కింక ఆరాట మింత ?
మురిపాలబాల వివరించు సుంత !"

"మన దేశనేత మహిమాన్వితుండు దూత
జనియించినట్టి రోజగుట చేత...."

"అతనెవరు? నెహ్రూ తాతయ్యయేన?
అతని జన్మదిన మీరోజె యౌన ?"†

"ఔనేగులాబి! ఔను యీరోజె !
అతని కీవన్న ఎనలేని మోజె!"

"అని నేనుగూడ వినియుంటి బాల
అతని దరిజేర మనసాయె చాల !"

"నీ కోర్కె దీర్తు నేడె నిజమ్ము
నీ కోయి టనలు అందుల కమ్ము!"

"పూలనేస్తమ్ము, బాలనేస్తమ్ము
ఇల నెహ్రూతాత కెంతో యిష్టమ్ము!"

"నిను గాంచి నెహ్రూ మనసార మెచ్చు
నీ కోర్కె దీర్ప కోటునకు గ్రుచ్చు!"

"అయితె యింకేల ఆలస్య మేల ?
కోయు మోబాల! అవస్య మీవేళ!!"

— అలపర్తి వెంకట సుబ్బారావు

† నవంబరు 14.

## బాలల థియేటరు

పిల్లలు నాటకాలు వేయడానికి ఒక థియేటరు వుండడంవల్ల వారు పిరికితనం లేకుండా రంగస్థలంపై ధైర్యంగా నటించడానికి, అలవాటు పడగలుగుతారు. ఈ నాటకాలలో వేషాలు వేయడానికి అవసరమైన వస్త్రాలు మొదలైనవాటిని పిల్లలు తామే ఇండ్లనుంచి తెచ్చుకోవాలి. భౌగోళిక, చారిత్రక, శాస్త్రీయమైన చలన చిత్రాలు, జీవిత చరిత్రలకు సంబంధించిన చిత్రాలు పిల్లలను బాగా ఆకర్షిస్తాయి. ప్రత్యేక ప్రదర్శనలను ఏర్పాటు చేసి వాటికి నామమాత్రపు ఫీజుపై పిల్లలందరికీ ప్రవేశం లభింపజేయవచ్చు. ఇలాంటి ప్రదర్శనలు ఒక గంట లేదా గంటన్నర సమయాన్ని మించివుండకూడదు.

నీతి కథలు, హాస్యకథలు, పాటలు, పజిళ్ళు, జానపద గేయాలు, ఆరోగ్యం, పారిశుద్ధ్యంపై ప్రసంగాలతో కూడిన ప్రత్యేక రేడియో కార్యక్రమాలను ఏర్పాటు చేయవచ్చు. మన దేశంలో పిల్లలకు అనువైన పుస్తకాలనుఇంకా తయారుచేయవలసివుంది. పిల్లలకొరకు ఒక గ్రంథాలయాన్ని తెరిచి దానిలో ఆకర్షణీయమైన సచిత్ర గ్రంథాలను, పట్టికలను, ఆల్బములను వుంచాలి.

సంగీత శిక్షణకు సౌకర్యాలు కల్పించాలి.

పెయింటింగు, డ్రాయింగు అభ్యసించడానికి రంగులు, చార్టుపేపర్లు, బ్రష్షులు మొదలైన వాటిని ఇవ్వాలి. పూలు కత్తిరించడానికి సాదా కాగితం ఇవ్వాలి. మోడల్స్ తయారు చేయడానికి కార్డు బోర్డులు లభింపజేయాలి. బొమ్మలు తయారు చేయడానికి పూసలు, దారం మొదలైన వాటిని ఇవ్వాలి.

పిల్లల బృందాలకు ప్లాట్లను కేటాయించి వాటిలో పూలు, కూరగాయలు పండించడాన్ని ప్రోత్సహించాలి. వనభోజనాలు, కాంప్ ఫైర్, విజ్ఞాన పర్యటనలను కూడా క్లబ్బు కార్యకలాపాలతో చేర్చవచ్చు.

వీటన్నింటితో పాటుగా బాలల క్లబ్బు కార్యకలాపాలు పిల్లలను సద్వర్తనులుగా రూపొందించాలి.

క్లబ్బు సభ్యులు ఒక బృందంగా—వంట చేయడం, బట్టలు ఉతకడం, ఊడ్వడం, శుభ్రం చేయడం తెలుసుకొని వుండాలి. అంతేగాక సమాజం, వ్యక్తిగత పరిశుభ్రతకు సంబంధించిన విషయాలన్నీ వారికి తెలిసి వుండాలి. వడ్రంగం, నేతపని వంటి కొన్ని చేతి పరిశ్రమలలో కూడా ప్రావీణ్యత వుండాలి.

పిల్లలు తమ స్వతస్సిద్ధమైన ప్రతిభను సాధ్యమైనంత వరకు పెంపొందించుకొని అభివృద్ధి చెందడానికి ఇల్లు, పాఠశాలల్లో జరిగే కృషికి తోడ్పడేట్లు చెయ్యడమే బాలల క్లబ్బుల ముఖ్యాశయం.

బాలల క్లబ్బులను నిర్వహించడం సామాన్యమైన విషయం కాదు. పిల్లల మనస్తత్వం, మన దేశావసరాల దృష్ట్యా ఆధునిక విద్యావిధానం, పద్ధతులు — వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకొని ఈ అంశాన్ని పరిశీలించవలసి వుంటుంది. తలిదండ్రులు, ఉపాధ్యాయులు, ఆ యా విషయాలలో నిపుణులైన వారితో కమిటీని ఏర్పాటు చేయడం వల్ల చాలా సహాయకారిగా వుంటుంది. ★

# బాలల దినోత్సవాలు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధాలశాఖకు సంబంధించిన రాష్ట్ర సమాచార కేంద్రం, హైదరాబాదు, సికింద్రాబాదుజంటనగరాలకు చెందిన 16 సంవత్సరాల లోపు వయస్సుగల విద్యార్థి, విద్యార్థినులకు వ్యాసరచన (ఇంగ్లీషు)లో, పెయింటింగ్‌లో పోటీలు నిర్వహించింది. 1963 నవంబరు 6 వ తేదీన ఇవి జరిగాయి. వీటిలో ప్రథమ, ద్వితీయులుగా నిర్ణయించబడిన వారి పేర్లు దిగువ పేర్కొనబడినవి :

**వ్యాసరచన పోటీ :**

ప్రథమ బహుమతి : కుమారి నర్గీస్‌షా, సెయింట్ ఎన్స్‌హైస్కూల్.

ద్వితీయ బహుమతి : కుమారి రేవతి రామచందర్, స్టాన్లీ బాలికల బహుళార్థ సాధక ఉన్నత పాఠశాల

**పెయింటింగ్ పోటీ :**

ప్రథమ బహుమతి : చి॥ దిలీప్‌కుమార్, లిటిల్ ఫ్లవర్ హైస్కూల్.

రెండవ బహుమతి : చి॥ వి. ఉపేందర్, హైద్రాబాద్ పబ్లిక్ స్కూల్.

1963 నవంబరు 27 వ తేదీన సమాచార పౌర సంబంధాలశాఖ కార్యాలయం ఆవరణలో ప్రత్యేకంగా జరిగిన సమావేశంలో శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి విద్యార్థులకు బహుమతులు ఇచ్చారు.

---

(72 వ పేజీ తరువాయి)

ప్రారంభోత్సవం చేరారు. భారీఇంజనీరింగ్ కార్పొరేషనుకు సంబంధించిన నాలుగు ప్రధాన ప్రాజెక్టులలో ఇది మొదటిది.

నవంబరు 18 : ఆసియా, దూరప్రాచ్యంలో ఎరువుల పరిశ్రమ అభివృద్ధికి సంబంధించిన ఐక్యరాజ్యసమితి తాలూకు తొలి సమావేశాన్ని కేంద్ర ఉక్కు, భారీ పరిశ్రమల శాఖామంత్రి సుబ్రహ్మణ్యం ప్రారంభించారు. 'ఇకేఫ్' ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసింది.

పార్లమెంటు శీతకాల సమావేశం ఆరంభమైంది.

చక్కెర ఎక్స్‌ఫ్యాక్టరీ ధరను కేంద్ర ప్రభుత్వం దేశంలోని వివిధప్రాంతాలలో రూ. 3/— ల మొదలు రూ. 8/— ల వరకు హెచ్చించింది.

నవంబరు 19 : శ్రీ ఎం. సి. చాగ్లా కేంద్ర విద్యాశాఖ మంత్రిగా, శ్రీ భక్తదర్శన్ కేంద్ర విద్యాశాఖ ఉపమంత్రిగా నియమించబడినారు. శ్రీ హుమాయూన్ కబీర్ పెట్రోలియం, కెమికల్స్ శాఖామంత్రిగా నియుక్తులయ్యారు.

## విదేశాలలో

అక్టోబరు 24 : గ్రీకుకవి జియోర్గస్ సెఫెరిస్‌కు 1963 వ సంవత్సరానికి సాహిత్యంలో నోబుల్ బహుమతిని బహూకరించారు.

అక్టోబరు 26 : అమెరికా మొదటి సారిగా జలాంతర్గామి నుంచి పొలారిస్ ఎ — 3 అస్త్రాన్ని ప్రయోగించింది.

అక్టోబరు 30 : "సహారా" వివాదాన్ని అంతమొందించడానికి మొరాకో రాజు, అల్జీరియా అధ్యక్షుల మధ్య జరిగిన ఒడంబడికపై సంతకాలు జరిగాయి.

నవంబరు 18 : ఫీల్డ్‌మార్షల్ అబ్దుల్ సలామ్ ఆరిఫ్ ఇరాక్‌లో అధికారం హస్తగతం చేసుకున్నారు.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

అక్టోబరు 25 : భారత దేశంలో పారిశుద్ధ్య వ్యవహారాలను పరిశీలించేందుకు నియమించ బడిన సలహా సంఘంవారు నగరానికి వచ్చారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎం. ఆర్. మల్కానీ ఈ సంఘం అధ్యక్షుడుగా వున్నారు.

అక్టోబరు 28: ప్రభుత్వ యాజమాన్యంలోని సింగరేణి కాలరీస్ వారు రుద్రంపూర్ డివిజన్‌లో చేపట్టిన త్రవ్వకం పనులను మద్రాసు గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

తిరుమల — తిరుపతి దేవస్థానం వారు హార్స్లీ కొండలపై నిర్మిస్తున్న శ్రీ వెంకటేశ్వర ఉన్నత పాఠశాల (ఇంగ్లీషు బోధన)కు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

అక్టోబరు 29 : కృష్ణా జిల్లాలోని తోటలవల్లూరు పంచాయతీ సమితిని ముఖ్యమంత్రి ప్రారంభించారు.

అక్టోబరు 31 : హైదరాబాదు చందూలాల్ బారాదరీలో స్థాపించ బడిన పారిశ్రామిక వాడకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

నవంబరు 6 : హైదరాబాదులో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ యూనానీ వైద్య గోష్ఠిని రాష్ట్ర గవర్నరు ప్రారంభించారు.

నవంబరు 9 : రాష్ట్ర శాసనసభ, శాసన మండలుల సంయుక్త సమావేశంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరు ప్రసంగించారు.

నవంబరు 10 : రెడ్‌క్రాస్ శతాబ్ద్యుత్సవాలను ముఖ్యమంత్రి ప్రారంభించారు.

హైదరాబాదులో జరిగిన మునిసిపల్ అధ్యక్షులు, కమీషనర్లు, ఆరోగ్యాధికార్లు, మునిసిపల్ ఇంజనీర్లు, టౌన్ ప్లానింగ్ ఆఫీసర్ల అయిదవ సంయుక్త సమావేశాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు.

నవంబరు 14 : 1963-64 వ సంవత్సరానికి గ్రాంట్లకు సంబంధించిన అనుబంధ పద్దులను రాష్ట్ర ఆర్థికమంత్రి శాసన సభకు సమర్పించారు.

నవంబరు 16 : సోవియట్ అంతరిక్ష యాత్రికులైన మేజర్ ఆడ్రియన్ నికొలేవ్, లెఫ్టినెంట్ కర్నల్ వాలెరి బైకొవిస్కీ, శ్రీమతి వాలంటీనా తెరిష్కోవా నికొలావ్ ఒకరోజు పర్యటనపై హైదరాబాదుకు విచ్చేశారు.

నవంబరు 18 : జిల్లాకలెక్టర్ల సమావేశాన్ని గవర్నరు హైదరాబాదులో ప్రారంభించారు.

నవంబరు 20 : ఆంధ్రప్రదేశ్ తాత్కాలిక గవర్నరుగా శ్రీ పి. చంద్రారెడ్డి పదవీ ప్రమాణ స్వీకారం చేశారు.

## భారతదేశంలో

అక్టోబరు 22 : 740 అడుగుల ఎత్తయిన భాక్రా ఆనకట్టను ప్రధానమంత్రి జాతికి అంకితం చేశారు.

అక్టోబరు 23 : హిందుస్థాన్ యంత్ర పరికరాల మూడవ ఫ్యాక్టరీకి ప్రధానమంత్రి పింజూర్‌లో ప్రారంభోత్సవం చేశారు. ఇది చండీఘర్‌కి 12 మైళ్ళ దూరంలో వుంది.

అక్టోబరు 28 : అఖిలభారత సెకండరీ విద్యావిషయాల మండలి రెండురోజుల సమావేశం ఢిల్లీలో ప్రారంభమైంది.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరు, మద్రాసు, కేరళ రాష్ట్రాలకు విద్యుచ్ఛక్తి సరఫరాకై ఒకే 'గ్రిడ్'ను నెలకొల్పడానికి ఉన్నతాధికార మండలి ఒకటి త్వరలో స్థాపింపబడుతుందని కేంద్ర నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి బెంగుళూరులో ప్రకటించారు.

అక్టోబరు 31 : న్యూఢిల్లీలో రెండు రోజుల పాటు జరిగిన రాష్ట్ర గవర్నర్ల సమావేశాన్ని రాష్ట్రపతి ప్రారంభించారు.

నవంబరు 2 : డాక్టర్ జీవరాజ్ ఎన్. మెహతా బ్రిటన్‌లో భారత హైకమీషనరుగా నియమించ బడినారు.

నవంబరు 5 : రాష్ట్రపతి నాలుగు రోజుల అధికార పర్యటనపై ఖట్మండు (నేపాల్) చేరుకున్నారు.

నవంబరు 9 : భారత తూర్పు రంగంలో సంయుక్త విమాన "శిక్షణవిన్యాసాలు" ప్రారంభ మయ్యాయి.

నవంబరు 10 : కొత్త ఢిల్లీలో జరిగిన రాష్ట్ర విద్యామంత్రులు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల మూడు రోజుల సమావేశాన్ని ప్రధానమంత్రి ప్రారంభించారు.

నవంబరు 14 : 1955 వర్కింగ్ జర్నలిస్టులు (ఉద్యోగ పరిస్థితులు) ఇతర నిబంధనల చట్టంక్రింద భారత ప్రభుత్వం, పూర్వ మధ్యభారత్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ జి. కె. షిండే అధ్యక్షతన వేతన నిర్ణాయక సంఘాన్ని నియమించింది.

నవంబరు 15 : రాంచీలో భారీ యంత్ర నిర్మాణాల కర్మాగారానికి ప్రధానమంత్రి

(మిగతా 71 వ పేజీలో)

# కొన్ని కొత్త పుస్తకాలు

## గ్రంథసమీక్ష

సమీక్ష

ఎ. ఎల్. నరసింహారావు

### బృందావని మంజీరాలు

రచన : కొలిపాక మధుసూదన గారు! ప్రచురణ : రాగసాహిత్య కళా పరిషత్, ఖమ్మం. వెల : ఒక రూపాయి.

ఈ చిన్ని పుస్తకంలో బృందావని మంజీరాలు, సౌగంధిక, క్షమామూర్తి అను మూడు గేయ రూపకా లున్నాయి.

"గానానికి అనుకూలంగా ధ్వనిపూర్వక స్వరాభినయం ప్రధానంగా దృష్టిలో పుంచుకొని యీ రూపకాల రచన కొనసాగించాను" అని రచయిత మనవిలో పేర్కొన్నారు.

దీనిలో మొదటి నాటిక రాధాకృష్ణులకు విచిత్రప్రేమ చిత్రించేది. రెండవది భీముడు ద్రౌపతికోసం సౌగంధిక పుష్పం తెచ్చి యివ్వడం. మూడవది బుద్ధదేవుని చరిత్ర. ఈ ఇతివృత్తాలు భారతీయులకు సుపరిచితాలు. శ్రీ మధుసూదనరావు వాటికి చక్కని శ్రవ్యరూపక కల్పన చేశారు.

రచనలోని రమణీయకానికి కొన్ని మచ్చు తునకలు :

రాధికా' .......
మధుర జీవన వసం
తదాను వాధికా,
నా ప్రేమ రసరాజ్య
కేళికా......! డోలికా
రాధికా — (7 వ పుట)

నవవసంత సుమనోహర
సమయము
నవవికసిత సుకుసోయుతవనము
కళానిలయమీ ప్రకృతి వలయం
చెలీ సుందరం......!
ఇలా మందిరం......!
థిరాన రావో కళాభాషిణీ!
నా దరిజేరుము మంజుభాషిణీ!
(16 వ పుట)

రాజ్యభోగాలను, ధర్మపత్నిని, ప్రియ పుత్రుణ్ణి విడిచివెళ్ళి జ్ఞానాన్ని సాధించి తిరిగి వచ్చిన బుద్ధుణ్ణి చూస్తూ యశోధర,

"..................
ఏచిరావాస స్వ
రసుఖము గోరితిరో
ఏమహా పెన్నిధా
నమ్ము నార్జించితిరో,
కడకు కాషాయ వ
ల్కలము, భిక్షాపాత్ర
కనుపించుచుండె నా
కనుల కంతియె నాథ!"

అంటుంది.

ఈ విధమైన సరళ శైలిలో చక్కగా సాగిన యీ నాటికలను విద్యార్థులు తమ ఉత్సవములలో చక్కని శ్రవ్యరూపకములుగా వినిపించ వచ్చును. దీని మాధుర్యము సంగీతయుతమైనప్పుడే రసజ్ఞులను అలంకరించగలదు.

### సమర గీతి

సంకలన కర్త : వే. నరసింహారెడ్డి; ప్రతులకు : నాగార్జున బుక్ డిపో, నారాయణగూడ, హైదారాబాద్; వెల : రూపాయి పావలా

భారత సరిహద్దులపై చైనీయులు దురాక్రమణ జరిపిన క్షణమునుండి భారతీయ కవి ప్రపంచము యుద్ధకాహళిని మ్రోగించుచు జాతిసోదరులను ఉత్తేజ పరచుచునే వున్నది. కొన్ని శతాబ్దులు పారతంత్ర్య మనుభవించిన జాతి తిరిగి పారతంత్ర్యమును కోరుకొనదు కదా! దేశముపై పరదేశీయుడు దాడి చేసినపుడు దేశమును జాగృతము చేయవలసిన బాధ్యత జాతికవులపై నున్నది. ఆ కర్తవ్యమును గుర్తించి తెలుగు కవులు చేసిన ప్రబోధ గేయములను చైతన్య సహితి వారు యీ పుస్తకరూపమున ప్రచురించారు. ఇందు శ్రీ విశ్వనాథ, జాషువా, దాశరథి, కాళోజి, కుందుర్తి ప్రభృతి ప్రముఖ కవులతోబాటు వర్థమానులైన కుందుర్తి, గోపాలచక్రవర్తి, నరసింహారెడ్డి మున్నగు వారి పద్యాలు, గేయాలు కూడా వున్నాయి.

"నలమందున్ దిని కప్పలన్ మెసవి, చీనా
సర్పముల్ భారతీ
యుల పోటుల్ జవిచూచి యుస్సురని
ఆయుశ్శక్తులూ టాడగా
బిలముల్ సొచ్చెనటంచు నాయుధములన్
వీడంగ రాదా విషా
హాలకున్ నాల్కలు రెండుగాదు పది
వేలుంద్రుం
బ్రచండంబులై"

అని జాతిని ఉద్బోధించారు శ్రీ జాషువ.

"రండి దేశభక్తులార! వివిధప్రజాశక్తులార
కదలిరండి వీరులార కరేంగేయ మరేంగే!
కరేంగేయ మరేంగే
కరేంగేయ మరేంగే"

ఇది శ్రీ కుందుర్తి ప్రభోదం.

దీనిలో యీ విధమైన కవితావస్తువెంతో లభ్యమవుతుంది. అందురూ చదవ తగ్గది.

## సౌనందచరిత్ర

రచన : శ్రీ కూచి సూర్యప్రకాశ శర్మ; ప్రతులకు : శ్రీ సునందాసుత సుజ్ఞాన సమితి; రామనాథపురం, పశ్చిమ గోదావరి జిల్లా; వెల : రూపాయిన్నర.

భారతీయ వైదిక సాహిత్యంలో ప్రఖ్యాతి పొందిన మహర్షులలో ప్రముఖుడైన యాజ్ఞవల్క్య మహర్షి చరిత్రమే ఈ కావ్యము. ఈ కావ్యమంతా త్రిశ్రగతి ఛందంలో నడిచింది. బ్రహ్మరతుడనుమునికి సునందయందు జన్మించిన వాడు యాజ్ఞవల్క్యముని.

పరిచయంలో శ్రీ జటావల్లభుల పురుషోత్తంగా రన్నట్లు యీ కావ్యంలో ప్రసాదగుణం, నుడికారపు సొంపు, జాతీయ ప్రయోగనైపుణి విరివిగా కనిపిస్తుంది.

"విద్వాంసుఁడు విజ్ఞానియు
విశ్రుత మిథిలాధీశుఁడు
సాంసారిక కర్మయోగి
జనకమహారాజు గలడు
తూ. చా. తప్పక ధర్మా
లాచరించి సంస్మృతిలో
బురదను కుమ్మరిపురుగును
బోలి యతఁడు వర్తించును!!

పై విధంగా సామాన్యులకు సైతము బోధపడే శైలిలో సాగిన యీ కావ్యం అందరికీ ఆదరణీయమైనది.

## మన విద్యారంగం

రచన : శీలంసిద్ధారెడ్డి; ప్రతులకు : ఖమ్మం జిల్లా రచయితల సంఘం; వెల : 75 నయాపైసలు.

[illegible] అంద రికీ లభ్యంకావాలనే ఆశయాన్ని ప్రచారం చేసే యీ గ్రంథంలో రచయిత విద్యావిధానం ఏ రూపంగా వుండాలో అందుకు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఏ యే శ్రద్ధలు తీసికోవాలో రచయిత చక్కగా వివరించారు. విద్యావంతులైన వారు దీనిని సమగ్రంగా పఠించటం అవసరం.

ఖమ్మం జిల్లా రచయితల సంఘంవారు నిర్మాణాత్మకమైన కృషి సాగిస్తున్నారు. కవితా సంపుటాలు, కథల పుస్తకాలను ప్రచురించడంతోపాటు సాంఘిక వ్యవస్థను చక్కదిద్దే సమస్యలపై ఇటువంటి గ్రంథాలను ప్రచురించడం ముదావహం. వీరి కృషి అభినందనీయం.

## గాంధీవాణి

రచన : చొల్లేటి నరసింహశర్మ; ప్రతులకు : రచయిత పేర కంచర కుంట వీధి, టాంక్ బండ్ రోడ్డు, హన్మకొండకు వ్రాయవచ్చును. వెల : 75 నయాపైసలు.

భారత స్వాతంత్ర్య సిద్ధికి జీవితాన్ని అంకితంచేసిన మహాత్మా గాంధి రచనల నుండి కొన్ని వాక్యములను ఏర్చికూర్చిన సంపుటి యిది. గాంధీజీ సూక్తులు భారతీయులకు ప్రాత స్మరణీయాలేగదా! ఆ సూక్తులను తన జాతి ప్రజలకు తన భాషలో అందివ్వడానికి శ్రీ శర్మ చక్కని కృషి చేశారు. శ్రీ శర్మగారి అనువాదానికిదొక ఉదాహరణ :

"ఒక కుండను చక్కగా నిలిపిన దాని యాధారముగా దొంతరలు నిలుచును. ఒక వ్యవహారము చక్కగా నున్న అన్నియు చక్కబడును. లేకున్న అనేక దోషములు ఆ స్థానము నాక్రమించును."

ఈవిధమైన అనువాదము సర్వ ప్రజలకు అర్థమగు ననుట నిస్సంశయము.

## సంక్రాంతి ముగ్గులు

రచన : ఇసుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రి, ప్రతులకు : సంస్కృత భాషా ప్రచారణ, హిమాయత్ నగర్, హైద్రాబాదు వెల : 80 నయాపైసలు.

పత్రికా పాఠకులకు సుపరిచితులైన శ్రీ ఐ.ఎల్.ఎన్. శాస్త్రిగారి నూతన రచన యిది.

శాస్త్రిగారి కథలు, నవలలు చదవడానికి అలవాటుపడిన వారికి యిది కొంత కొత్తదనాన్ని చూపిస్తుంది.

దీనిలో రచయిత ఒక నూతన సంవిధానాన్ని అనుసరించారు. ఈ విధానం పాశ్చాత్య దేశాలలో ఎప్పుడో పాతబడిపోయినా, తెలుగులో యిప్పుడిప్పుడే అడుగు పెడుతూంది. ఈ ప్రక్రియ అంత ఆకర్షణీయమైనది కాకపోయినా నూతనత్వం కొందరికి ఆకర్షకమే కదా.

రచయిత సృష్టించే పాత్ర రచయిత ఎదుటే నిలబడి తన భావాలను చెప్పుకోడమే దానిలోని క్రొత్తదనం.

పఠితులకు చిరపరిచితులైన శ్రీ శాస్త్రిగారు శైలిని గూర్చి వేరే చెప్పనవసరం లేదు. సంవిధానంలోవున్న క్రొత్తదనం కొందరికైనా తృప్తి కలిగించక పోదు. ఇటువంటి రచనలలో ఇతివృత్తం కంటె అది నడిచినతీరే గణనీయమైనది. కనుక యీ సమీక్షలో ఇతివృత్త ప్రస్తావన చెయ్యబోవడంలేదు. కొత్తగా కలం పట్టదలచిన వారందరూ చదవతగ్గ రచన.



# కూపర్ డీసెల్ ఇంజన్ కలిగియున్న రైతును అడగండి

అతడు దాని ముఖ్య సుగుణముల గురించి ఉత్సాహంగా వివరించును

★ దృఢమైనవి మరియు ఖర్చుతక్కువ— లైట్ డీసెల్ ఆయిల్ వ్యయంతక్కువ.
★ నడుపుట చాలా సులభం
★ విడిభాగములు సులువుగా లభించును
★ "కూపర్-ఆమోదిత" సర్వీస్, సప్లై దారులు, వ్యాపారులు, ఉప వ్యాపారుల ద్వారా లభించును
★ నీటి సరఫరాయేగాక ఇతర పలు విధోపయోగములు — పిండి మరలకు కలప కోతకు, నూనె గానుగలకు మరియు అనేక ఇతర పనులకు
★ ఒక సంవత్సరం గ్యారంటీ

*కూపర్ డీసెల్ ఇంజన్లు 5 నుంచి 40 బి.హెచ్.పి. వరకు సర్వసిద్ధంగా లభించుచున్నవి.*




**కూపర్**
ఇంజనీరింగ్ లిమిటెడ్.
సతారా రోడ్, ఎస్. రైల్వే. మహారాష్ట్ర

ఒక్కావి అరువు పద్ధతికి అర్హతగలవి

**కూపర్**
డీసెల్ ఇంజన్లు.



# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ చిన్నమొత్తాల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లు మొదలు రూ. 25,000 ల వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. రూ. 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటుఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లు మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీచేయబడు ధరలు: రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 కు కొంచెమెక్కువగా వచ్చే చక్ర వడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరూ రూ. 26,600 ల వరకూ కొనవచ్చు.

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి 3 చొప్పున రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2½ చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

**క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ. 5,10,20,50,100,200 లేక 300 వంతున 5,10 లేక 15 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికివస్తుంది. ఆదాయంపన్ను లభిస్తుంది! భావిభారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలనుగూర్చి యితర వివరాలు మీకు చేరువగావున్న పోస్టాఫీసువద్దగాని రీజియనల్ డైరెక్టరు నేషనల్ సేవింగ్స్ 10-2-2, ఎ.సి. గార్డ్సు రోడ్డు, హైదరాబాదు, లేక, మీ జిల్లాకలెక్టరు ఆఫీసులోని, జిల్లా ఆర్గనైజరువద్దగాని తెలుసుకోవచ్చు.

# ఆంధ్రప్రదేశ్

| | |
|---|---|
| విస్తీర్ణం | 1,06,286 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| పట్టణాలు, నగరాలు | 212 |
| గ్రామాలు | 28,997 |
| పూర్తి జనాభా (1961) | 359.83 లక్షలు |
| జన సాంద్రత | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | 76.27 లక్షలు |
| నికర సాగుభూమి (1960–61) | 10,783,000 హెక్టర్లు |
| పశువులు (1961) | 326.43 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1961) | 3,140 |
| విద్యుదుత్పాదన (1962) | 1,120.3 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్ |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1962–63) | 4,315 |
| విశ్వవిద్యాలయాలు | 3 |
| కళాశాలలు (1961–62) | 125 |
| ఉన్నత పాఠశాలలు (1961–62) | 1,435 |
| వృత్తివిద్యా పాఠశాలలు | 440 |
| పంచాయతీలు (1959–60) | 14,552 |
| అభివృద్ధి మండలాలు (31–3–1963 నాటికి) | 446 |
| 1961–62 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | రూ. 1,066.04 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | 61 |
| శాసన సభ సభ్యులు | 301 |
| శాసన మండలి సభ్యులు | 60 |




ముఖచిత్రం : సంక్రాంతి

## ఈ సంచికలోని

### కొందరు రచయితలు

కొమ్మూరి వేణుగోపాలరావు

ముద్దంశెట్టి హనుమంతరావు

అవసరాల రామకృష్ణారావు

జానకీరామ్ పట్నాయక్

కోడూరి కౌసల్యాదేవి

సి. నారాయణరెడ్డి

నాదమునిరాజు

ప్రతిమాదేవి

దాశరథి

బైరాగి

ఇంకా

వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు, కార్టూనులతో

నెలాఖరుకు వెలువడుతుంది.